
సుభద్ర
శరత్ బాబు
అనువాదం
నీలకంఠం

# సుభద్ర

రచన

శరత్ బాబు

అనువాదం

నీలకంఠం



పబ్లిషర్సు :
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# సుభద

గంగానదిలో గొంతులోతు నీళ్ళలోవుండి బ్రాహ్మణ వితంతువు క్రిష్ణప్రియ ముక్కు మూసుకుని మూడు మునకలు మునిగి యిత్తడి బిందెలో నీళ్ళు నింపుకుంటూ ''సంపద తగ్గేప్పుడు ఇలానే తగ్గుతుంది'' అని అన్నది.

నదిలో ఇంకా స్నానంచేస్తున్న ముగ్గురు నలుగురు ఆడవాళ్ళు యేమీ తెలియక నిలుచుండి క్రిష్ణప్రియ ముఖంలోకి వెర్రిగా చూడసాగారు: మాట మాటకు పోట్లాడే స్వభావంగల క్రిష్ణప్రియను ''ఏమిటి సంగతి ?'' అని అడిగేందుకుగానీ, అది కాదని వాదించేందుకుగానీ ఎవరికీ ధైర్యములేదు. స్నానం చేస్తూన్న ఆ నలుగురూ వయసులో ఆమెకంటే చిన్నవాళ్ళే.

''ఎవరి సంపదయినా సరే తగ్గేప్పుడు యిలానే తగ్గిపోతుందని అంటాను బిందూ—?''

ఎవరిని సంబోధించి యీ మాట అందో ఆమె పేరు బిందువాసిని. బిందు శ్రీమంతుల పిల్ల. శ్రీమంతుల కోడలు! ప్రస్తుతం ఆమె కన్నవారింటికి వచ్చింది.

తన్నే పిలిచి అంటూందని బిందు గ్రహించి ''ఏమిటత్తా?'' అని అడిగింది.

''అదే, హారాన్ ముఖర్జీ విషయం జ్ఞాపకం వచ్చింది. భగవంతుడు వాళ్ళను పట్టుకుని నీళ్ళలో ముంచేంతవరకూ వదలలేదు.''

బిందు హారాన్ ముఖర్జీ దౌర్భాగ్యపు విషయం కాబోలు ననుకుంది. షుమారు నెలరోజుల క్రిందట హారాన్ ముఖర్జీ ఆరేండ్ల పిల్లవాడు చనిపోయాడు. ఆ విషయమే అనుకుని ఆమెకు విచారం కలిగింది ''భగవంతుని ఏంకు వ్యతిరేకంగా మానవులు ఏంచేస్తారత్తా? చావు పుట్టుకలు యెవరింట్లో లేవు?'' అని అంది.

క్రిష్ణప్రియకు యీ విషయం యేమీ గుర్తుకురాలేదు. కొంచెం సేపయాక, "అవును పిల్లవాడు చచ్చిపోయి నెలరోజు లేమో అయింది. ఆ విషయంకాదు బిందూ. నే చెప్పేది అదికాదు, చావు బ్రతుకులు భగవంతుని చేతుల్లోనే వున్నాయి! కాని యిది.... యింతకూ నీవేమీ వినలేదా అమ్మాయ్?'' అని అడిగింది. బిందు యేమీ మాట్లాడకుండా ఆమె ముఖంకేసి చూడ సాగింది.

"అయితే హారాన్ ముఖర్జీ విషయం, నీవేమీ వినలేదూ?'' అని అడిగింది.

''ఆయనకు మళ్ళీ విషయ మేమిటి?''

''ఆ—అందుకే భగవంతుడు బాధపడేవాళ్ళనే యింకా బాధిస్తాడు అని నే ననేది! ఐనా ఆ త్రాగుపోతుకు యివేమీ పట్టవు.... వాడి కివేమీ అక్కరలేదు, ఆ కష్టమంతా యింటి కోడలు బంగారు బొమ్మదే అనుకో: ఆ దరిద్రుని కట్టుకుని ఆమె ఒక్కరోజుకూడా సుఖపడలేదు.''

ఆమె ముఖంకేసి చూస్తున్న బిందు అలానే చూస్తూ వుండి పోయింది. కాని, యేమీ గ్రహించుకోలేక పోయింది, ఐనా

క్రిష్ణప్రియ మాటలు ఊరికే పోలేదు. అవి శాఖోపశాఖలుగా అల్లుకు పోయినై! రేవులో ఎంత మంది ఆడవాళ్ళున్నారో, అంతమందీ విస్మయభరితురాండ్రయారు. "హారాన్ సంగతి ఏమిటా?" అని అందరూ ఆలోచించారు. వాళ్ళందరికీ హారాన్ సంగతి తెలుసు. ఇంతలో ఎవరికీ తెలియని విషయం ఏం జరిగిందా? అని ఆలోచించారు.

చాలా సేపు ఆలోచించాక, "అత్తా! యింతకూ అసలు సంగ తేమిటో చెప్పావుకావు?" అని బిందు మళ్ళీ అడిగింది.

"యెందుకు చెప్పనమ్మ! అయినా యిదేమంత పెద్దసంగతి కాదు. అందుకనే చెప్పడానికి మనసు వప్పడం లేదు.......... ఆ విషయం గుర్తుకు వచ్చినప్పుడల్లా మనసులో యేదో యిదిగా వుంటుంది. ఇంతకూ భగవంతుడు ఆ దౌర్భాగ్యపు పిల్లవాడి నొసట అంతకష్టం వ్రాసినపుడు, మనం యెన్నను కున్నా తప్పుతుందా యేం?"

"ఏం కష్టమత్తా?"

"కష్టమనేది ఒక విధంగా వుంటుందా? యెన్నెన్ని కష్టాలు....యెన్ని యాతనలు....యెన్నని చెప్పను, యేమని చెప్పను?"

"అయినా చెప్పత్తా?"

"వద్దు. ఇప్పుడుకాదు. ఏసంగతీ గుప్తంగావుండదు. అందరూ వింటారులే! కొంచెం ముందో—వెనుకో వినే వుంటారు! నీవు కూడా వింటావు!"

"ఐతే—నీవు చెప్పకూడదూ?"

"వద్దు, వద్దు. ఇతరుల సంగతి నా కెందుకు. నేనదే ఆలో చిస్తున్నాను!

"అత్తా మేమేన్నా నీకు పరాయివాళ్ళమా యేమిటి? నీవు చెపుతావని నాకు తెలుసు....!"

"అయితే బిందూ! నేను గంగానది నీళ్ళలో నిలుచుని అబద్ధం చెపుతానా యేమిటి?"

"అబద్ధమేమిటి? నువ్వబద్ధం చెపుతావని నే నన్నానా?"

"అయినప్పుడు, మరి యెలా చెప్పను? గంగానదిలో నిలుచుని, యితరుల విషయంలో జోక్యం కలుగజేసుకుని, నేను మాట్లాడనని యింతకు ముందే చెప్పానుగా?"

కలహ ప్రియమైన క్రిష్ణప్రియ వెళ్ళిపోయింది. ఒకరి ముఖాలు ఒకరు ఒకరు చూసుకున్నారు. యెవరికీ యేమీ అర్థం కాలేదు. క్రిష్ణప్రియ నోటిలో ఏదీ దాగదని అందరికీ తెలుసు. ఐనా యీ విషయం అందర్నీ ఆశ్చర్యంలో ముంచేసింది!

స్నానమయాక యెవరిండ్లకు వాళ్ళు వెళ్ళారు. బిందు యింటికి వచ్చి గుడ్డలు మార్చుకుని తల్లిదగ్గరకు వచ్చి కూచుంది.

బిందు తల్లి అంది "బిందూ! ఇంత సేపు నీళ్ళల్లోనే వున్నావా! బాగానేవుంది. ఇలా అయితే, జబ్బుచేయదూ?"

"అయితే యేం....? రెండురోజులు కష్టపడతాను."

"సరే.... అందుకని విచారం దేనికంటావ్?"

"అమ్మా! హారాన్ ముఖర్జీకి యిక్కడ యేంజరిగిందే?"

"యేమిటీ? హారానాకు జరిగేదేమిటి?

"రేవులో యింతకుముందు క్రిష్ణప్రియ అత్త హారాన్ ముఖర్జికి యింకేదో కొత్త వుపద్రవం కలిగినట్లు మాట్లాడింది నీకేమీ తెలియదూ ?''

''తెలియదు....ఐతే, యేమని చెప్పిందేం ?"

హారాన్‌ను భగవంతుడు నీళ్ళల్లో ముంచుతున్నాడనీ, ఆ త్రాగుబోతుకేమీ యిందువల్ల కష్టం లేదనీ, కష్టమంతా హారాన్ భార్యదేననీ చెప్పింది. ఇక యెప్పుడూ యితరుల విషయంలో తను జోక్యం కలుగ చేసుకోననికూడా చెప్పింది''

''పాపం ! ఇప్పటికి జ్ఞానం కలిగిందన్నమాట''

"అయితే అమ్మా ! నీకు నిజంగా యేమీ తెలియదా ?''

''యేమీ తెలియదు.''

''అయితే మధ్యాహ్నం నేను వారింటికి వెడతాను.''

''యెందుకు ? యేం జరిగిందో తెలుసుకునేందుకేనా ?''

''అవును.''

''నీకేమయినా పిచ్చిపట్టిందా యేం ? ఆమె జోక్యం కలుగ జేసుకోకుండా వూరుకున్న విషయాన్ని నీవు అడుగుతావా ?''

''యెవరు ?''

బిందు తల్లి అటూ ఇటూ చూచి, ''యింకెవరు ? క్రిష్ణప్రియ''

అని అంది.

''క్రిష్ణప్రియ జోక్యం కలుగచేసుకోకుండా పూరుకున్న ఆ విషయాన్ని మనం కలుగచేసుకోకూడదని అంటావా ?''

''అవును ఒకరి విషయంలో మనం అనవసరంగా జోక్యం కలుగ చేసుకోవడం బాగుండదు.''

"యేమయినాసరే, నే వెళ్తాను."

"యీ విషయంలో మనం జోక్యం కలుగజేసుకోకుండా వుంటేనే మంచిది"

"సరే నమ్మా! ఇతరుల విషయంలో జోక్యం కలుగజేసుకోవడం మంచిదికాదని, యెవరయినా ఓ మనిషి మన కళ్ళ ముందు మునిగిపోతూ వుంటే, అతన్ని రక్షించకుండా వూరుకుంటామా?"

"నీవు రక్షించడానికి వెళ్ళడంలేదా బిందూ?"

"ఇంతకూ యెవరు మునిగిపోతున్నారో, ఆ సంగతి ముందు తెలుసుకున్నాక రక్షించేందుకు కూడా వెళతాను."

బిందు తల్లి కొంచెంసేపు వూరుకుని "బిందూ! నీవు వాళ్ళ యింటికి వెళ్ళకమ్మా! హారాన్ మంచివాడు కాడు. నీ తండ్రికీ అతనికీ విరోధం. అటువంటప్పుడు నీవు వాళ్ళింటికి వెళ్ళడం మంచిదికాదు" అంది.

"హారాన్ మంచివాడు కాదని నాకు తెలుసు. ఐనా నేనతని దగ్గరకు వెళ్ళడంలేదు. అతని భార్యదగ్గరకు వెళ్తే తప్పేమిటి? అతనికేదో ఆపద వచ్చింది. మనమంతా పొరుగింటివాళ్ళ మయి వుండికూడా, యిటువంటి సమయంలో కళ్ళుమూసుకుని. కూర్చోవడం అలవాటు చేసుకుంటే, నా అత్తగారి యింటిదగ్గర నా ముఖం యెవరూ చూడరు."

"అఘోరనాథ్ నిన్ను వీధి వీధి తిరిగి, యెవరింట్లో యేం జరిగిందీ, యేం జరగలేదు యివి తెలుసుకోమనేనా చెప్పింది? నేను తల్లిని. వద్దని చెపుతున్నాను. నామాట వినవా?"

"తప్పకుండా నేను వెళ్తానమ్మా ?"

"వెళ్ళి యేం తెలుసుకుంటావు. హారాన్‌కు యేం జరిగిందో ఆ యింట్లోవాళ్ళకు కూడా తెలియదు."

"మరి నీకెలా తెలిసింది."

"మీ నాన్నగారి ద్వారా."

"అయితే, యేమయిందేమి టమ్మా ?"

"నందిబాబుగారి లెక్కలో కొంత డబ్బు దొంగిలించినందుకు అతన్ని పోలీసులకు వప్పగించారు.

"నందిబా బెవరమ్మా ?"

"బ్రాహ్మణపాడ్ జమీందారు. అతనిదగ్గరే హారాన్‌ముఖర్జీ గుమాస్తాపని చేస్తున్నాడు ?"

"యెంతడబ్బు దొంగతనం చేశాడే ?"

"షుమారు రెండువందలు."

"మరి, యెవరూ జామీన్ వుండలేదా ?"

"జామీన్ యెవరుంటారూ ? యీ పల్లెటూళ్లో మీ నాన్నగారిని అందరూ యెరుగున్నారాయె : ఇక వుంటే వారే వుండాలి ! కాని, అతను వీరితో శత్రుత్వం తెచ్చుకున్నాడు. ఒకసారి జామీను వుండమని అడిగినా వీరు వప్పుకోలేదు."

బిందు యేమిటో ఆలోచించి, "అయితే వాళ్ళింటికి మధ్యాహ్నం ఒకసారి వెళ్లివస్తాను. వచ్చినప్పట్నుంచీకూడా పాపం—ఆమెను చూడలేదు" అని అంది.

బిందు తల్లి ఆశ్చర్యపడి, మళ్ళీ కోపంతో, "వెళ్ళాలను కున్నావా ? యిప్పుడుకూడా వెళ్ళాలా యేం ?" అని అంది.

"ఊఁ."

ఆమె యేమీ మాట్లాడలేదు.

కొంచెంసేపు వూరుకుని బిందు "వాళ్ళింటికి వెళ్ళినంతమా త్రాన ఎవరికీ యేమీ నష్టముండదు. మగవాళ్ళ పోట్లాటలతో ఆడవాళ్ళకేమీ సంబంధం వుండదు" అంది.

పొద్దు చాలా తిరిగినందున తల్లి లేచివెళుతూ, "మీ నాన్న గారు వింటే కోప్పడతారమ్మాయ్" అంది

"నాన్నగారికి తెలవకుండానే వెళ్తాను."

"తప్పకుండా తెలుస్తుంది."

"నీవు చెప్తేనే తెలుస్తుంది."

"తెలిసిందంటే కోపం చేస్తారు."

"తల్లీ తండ్రీ తమ బిడ్డల్ని కోపంచేసి కూడా మరిచిపోతారు, దీనికోసం నీవు భయపడకమ్మా !"

## 2

ఈ వూరిపేరు "హలాద్‌పూర్" అని అంటారు. యీ వూరికి యెవరూ వెళ్ళలేరు గనుక, దీనిపేరు చెప్పకుండా మిమ్మల్ని కష్టపెట్టను. ఈవూరిని గురించి అంతగా వినవల సిన విషయంగాని, చూడవలసిన విశేషం గాని యేమీలేదు"

ఈ వూరిప్రక్కనుంచే గంగానది ప్రవహించుతూంది. పూర్వ కాలం నాటివి రెండు శిథిలమైన శివాలయాలు వున్నాయి. ఈ వూళ్ళో పూర్వం ధనవంతులు వుండేవాళ్ళు, గంగాతీరాల్లో

పశువులు పచ్చికమేస్తూ కలకల లాడుతూ వుండేవి. ఇప్పుడు వున్నదల్లా పది బ్రాహ్మణుల కొంపలూ, రైతుల యిళ్ళు దెబ్బయ్యీ వున్నాయి. అవితప్ప మిగిలినదంతా అడివి! వాటి మధ్యలోంచే ఒక రిద్దరు వెళ్ళేందుకు చిన్న డొంకతప్ప యింకేమీ లేదు.

ఈ పల్లెలోనే శ్రీయుత హారాన్ ముఖోపాధ్యాయ మహాశయుని రెండంతస్తుల మేడుంది. పాత యిటుకతో పైన రెండు గదులూ, క్రింద నాలుగయిదు గదులూ వున్నాయ్! మేడచుట్టూ ఏవో అయిదారు చెట్లూ, రెండు మామిడిచెట్లూ ముఖోపాధ్యాయుని భౌతిక సంపదగా ఏర్పడినయ్!

'హలాద్‌పూర్'కు ఓ క్రోసుదూరాన నున్న 'బ్రాహ్మణపాడ్' జమీందారుగారయిన 'నందిబాబు' వద్ద హారాన్ నౌకరీ చేస్తున్నాడు. నెలకు యిరవై రూపాయల జీతం. పూర్వము ఈ యిరవై రూపాయిలతోనే యెలాగో కాలం గడిచేది. కాని, యిప్పుడు చాలడంలేదు.

ఇంట్లో అతనిమీద ఆధారపడి వున్నవాళ్ళు చాలామంది. భార్య, యిద్దరు కొడుకులూ, యిద్దరు ఆడపిల్లలూ, ఓ విధవ అక్కగారు, అంటే సాధారణంగా ఒక హిందూ కుటుంబంలో యెంతమంది వుంటారో, అంతమందీ వున్నా రన్నమాట! పూర్వం నెలవగానే, యిరవై ముద్రలూ తెచ్చి భార్యచేతి కిస్తున్నప్పుడు, యింట్లో యేలోటూ కనపడేది కాదు. భార్యా అక్కగారూ కలసి, అనవసర ఖర్చులు చేయకుండా సంసారం గడుపు తుండేవారు. ఇప్పుడు మాత్రం వాళ్ళ చేతకాకపోయింది. దరి

ద్రము వాళ్ళను విడువలేము ; ఒకరోజు బియ్యం లేకపోతే మరో రోజు పప్పు వుండదు. ఈ రోజు కట్టెలు లేనందున వంటచేయ లేము. రోజూ 'ఇదిలేదు, అదిలేదు' అనే మాటల్నిపట్టి ముఖర్జీ మహాశయుడు, అందరూ అవలంబించిన పనినే ఆఖరికి అవలంబించా డన్నమాట !

విశ్వాసపాత్రుడయిన హారాన్‌మీద కొన్నిరోజులవరకూ, యెవరికి అనుమానం కలగలేదు. కాని, యెక్కువ కాలం అలా జరగలేదు. మెల్ల మెల్లగా జమీందారుకు అనుమానం కలిగింది.

కొంచెం గట్టిగా సందేహం స్థిరపడ్డాక, స్వయంగా తనే లెఖ్కలు చూడాలని చెప్పి, ఖాతాల్లో పడకుండా యెన్ని వదిలి పెట్టబడినవో, యెంత గందరగోళంతో ఖాతా పుస్తకం వుందో చూసి, చివరకు దొంగతనంకూడ పట్టుకుని, హారాన్‌బాబును పిలిచి "ఇంతవరకు యెన్ని రూపాయలు దొంగిలించావు ?" అని జమీందారు శ్రీ భగవాన్ నందిబాబు దయాధర్మమూ గలవాడు గనుక మెల్లిగా అడిగారు.

"తెలియదండీ ?"

"తెలియదూ ? ఖాతాలు చూస్తుంటే మూడువేల రూపాయలు పోయినట్లు కనుపిస్తోంది. ఇంతడబ్బు తీసుకుని యేంచేసావు ?"

"ఖర్చయింది."

"సరే, ఖర్చేమో అయింది. ఐతే, దొంగతనం యెందుకు చేయాల్సొచ్చింది."

"ఇరవై రూపాయలతో సంసారం గడవడం లేదుగాబట్టి, దొంగతనం చేసాను "

"ఇన్ని రోజుల్నుంచీ యిరవై రూపాయల్తో గడచినప్పుడు, హఠాత్తుగా యిప్పు డెందుకు గడవలేదో నాకు తెలియడంలేదు. సరే, యిరవై రూపాయలతో గడవడంలేదని, నీవు నా కెందుకు చెప్పలేదు ?"

"అలా చెప్తే, మీరు నాకు జీతం యెక్కువ యిచ్చేవారా ?"

"ఇస్తే యిచ్చేవాణ్ణేమో ! పోనీలే. జరిగిం దేదో జరిగి పోయింది. తీసుకున్న దాంట్లోంచి సగం తిరిగి యిచ్చేస్తే నిన్ను వదిలేస్తాను."

"ఎక్కణ్ణుంచి తెచ్చి ఇవ్వను ? నా దగ్గిర యేమీలేదు."

"ఏమీలేదా ?"

"ఐతే నా కున్నదల్లా ఒక్కయిల్లు. కావలిస్తే తీసుకోండి."

"నీ భార్యా పిల్లలు యెక్క డుంటారు ?"

"చెట్ల నీడల్లో."

చాలా సేపు భగవాన్ నందిబాబు హారాన్‌బాబు ముఖంలోకి చూసి "సరేగాని, యెందుకని నీ కళ్ళింత యెర్రగా వున్నాయ్ ?" అని అడిగాడు.

"నాకేం తెలుసు ?"

హారాన్‌ను పంపి, ఆయన యింకో వుద్యోగస్థుని పిలిచి, "హారాన్ బా బింటి విషయం కనుక్కో గలవా ?" అని అడిగాడు.

"ఏమేమి కనుక్కోవాలండీ ?"

"అదే, అతని సంగతి, డబ్బెంతవుంది ? ఎవరితో నన్నా యిచ్చి పుచ్చుకోవడాలు వున్నాయా ? అన్ని సంగతులూన్నూ."

"నాకు తెలిసినంతవరకూ, ముఖర్జి యింట్లో ఏమీ జరగడం లేదు. డబ్బుకూడ యేమీలేదు ఇచ్చి పుచ్చుకోవడాలసంగతి నాకేమీ తెలియదు."

"జాగ్రత్తగా కనుక్కొని నాకు చెప్పు."

రెండురోజులు గడిచాక ముఖర్జీ కుటుంబము యెంత చెడిపోయిందో అంతా బాబుగారికి ఆ నౌకరు చెప్పాడు.

"ముఖర్జీకి యేమయినా దురలవాట్లు వున్నాయా? నిషా చేయడం ఏమయినా వుందా?" అని నందిబాబు అడిగాడు

"అవునండీ, గంజాయి త్రాగుతాడు."

"ఆహా! అందుకనే ఆరోజున కళ్లు అంత యెర్రగా వున్నాయి. ఇంకేమైనా దురలవాట్లు వున్నాయా?"

అతను తల వంచుకుని, "వున్నా యనుకుంటాను" అని అన్నాడు.

"అయితే ఒకపనిచేయి. రేపు కచేరీకివెళ్ళి దొంగతనపు అపరాధంమీద ముఖర్జీని పోలీసులకు అప్పగించు."

చివరకు ఏవిధంగా పరిణమించిందం టే, ముఖర్జీ మహాశయుని పోలీసు ఠాణాకు పంపారు.

అలా జరిగి నప్పటికిని, యీ సంగతి హలాద్‌పూర్‌లో యెవరికీ తెలియలేదు. కాని, ఒక్క బిందు తండ్రి భగవతీచరణ గంగూలికి మాత్రం యీ సంగతి తెలిసింది. నందిబాబు ఆయనకు చెప్పివుంటాడు! ఇంతకూ ఆయన చాలా పలుకుబడిగలవాడు. కాని, ఆయన ఏమీ సహాయంచేయలేదు. నిస్సహాయుడు అయిన

ముఖర్జీ పోలీసు ఠాణాలో వుండిపోయాడు. కలహ ప్రియమైన క్రిష్ణప్రియ, యీ సంగతి యెలా విన్నదో ఆమెకే తెలియాలి!

వైశాఖమాసంలో మధ్యాహ్నన్నే కారుమబ్బులు కమ్ముకు వచ్చి చీకటి పడింది! ఈ సమయంలోనే హారాన్ బాబు వంటింటి వసారాలో అతని భార్య, పెద్ద కూతురు లలనా, యెదురు బొదురుగా కూచుని వున్నారు.

ఇద్దరి ముఖాలు వాడి వున్నాయ్! విధవ అయిన లలన బాలకు ఆరోజు యేకాదశి! ఆమె తల్లికూడా ఇంతవరకూ యేమీ తినలేదు.

"అమ్మా! నాన్నగారు ఇవాళకూడా రానట్టున్నారు. మేఘాలు క్రమ్ముకొస్తున్నయ్! ఒకవేళ వర్షం వచ్చినట్లయితే వంటింటిలో నిలుచునేందుకు చోటుండదు. నువ్వు కాస్త తినరాదూ!" అని అన్నది లలన.

"ఇంకా కొంచెంసేపు చూస్తానమ్మా! మూడు రోజుల్నుండి రాలేదు, ఇవాళయినా వస్తారేమో?" అంది లలన తల్లి.

"అమ్మా నాన్నగారు మూడురోజుల్నుంచి రాలేదు. ఇవాళ కూడా రాకపోతేనో?"

"అయితే ఏం చేయను? భగవంతుడే వున్నాడు."

హారాన్ బాబు పెద్దక్క రాసమణి చాలసేపట్నుంచి స్నానం చేసి, ఏకాదశి నిత్యకర్మను సమాప్తం కావించి, రుద్రాక్షమాల తిప్పుకుంటూ దగ్గరకు వచ్చి "అమ్మాయ్! ఇంకా భోజనం చేయలేదూ?" అని అడిగింది.

ఆమె విచారంగా "ఇంకా కొంచసేపు చూస్తాను" అని అంది.

"బాగానేవుంది నా తలకాయి! ఇంకా కొంచెంసేపు చూస్తే ఏమవుతుంది? ఆ ఛండాలుడు ఇంత పొద్దెక్కినాక వస్తాడా? వెళ్ళు. ఇక చూడకు. గంజాయిత్రాగి తందనాలాడుతూ ఏ వెధవ ముండ కొంపలో పడివున్నాడో" వుపవాసాలు చేస్తుండడం మూలాన, రాసమణి మనసు సరిగా వుండడంలేదు. ఆమె మాటలకు యెవరూ ఏమీ సమాధానం చెప్పలేదు. అది చూసి రాసమణి ఇంకా మండిపడుతూ "ఆ ఘోరంబోకు వెధవ చచ్చినప్పుడు కాని, మన హృదయం చల్లబడదు" అని అంది.

ఈ మాటలకు లలన వూరుకోలేక "అత్తాయ్! ఏకాదశిపూట నాన్న నలా తిడతావు యెందుకు?" అంది.

"ఏకాదశిపూట యెందుకు తిడతావు?" ఈ మాట రాసమణి హృదయములో కెళ్ళి తలిగించింది. మనసులో సిగ్గుపడింది. అయినా 'యీ చిన్నపిల్ల తనకు చెప్పాలా?' అనే కోపము యెక్కువైంది.

"గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు, నీకు ఏళ్ళు వచ్చాయో లేదో. అప్పుడే యీ ముసలిదానికి యేకాదశి, ద్వాదశి వుపదేశాలు చేసేందుకు తయారయ్యావా? నీకే తండ్రికాని, నా కేమీ కాడూ?" అంటూండగానే రాసమణి కళ్లు నిప్పుల్లా అయినై! "మూడు రోజుల్నుంచి ఇంటికి రాకపోయినందుకు నా మనసులో యెలావుందో ఆ భగవంతుడికే తెలియాలి" అని పైటకొంగుతో కన్నీరు తుడుచుకుని "నేను ముసలిదాన నయ్యాను. నా నోట్లోంచి

ఒకమాటవస్తే దానికి మీరు అయిదుమాటల్ని అంటా రెందుకు? సరేలేఅమ్మాయీ, ఇక నేను ఏవిషయంలోనూ జోక్యంకల్గించుకోను అన్నపానాదులు లేకుండా చచ్చిపోయేందుకు సిద్ధమవుతూవున్న మీ అమ్మనుచూసి మాట్లాడాలని వస్తోంది" అని అంది.

లలనకు విచారమేసింది, తను మాట్లాడిన యీ ఒక్క-మాటకూ ఇంత అర్థంతీసి, ఏడుపులూ, పెడబొబ్బలూ, రాద్ధాంతాలూ చేస్తుందని ఆమెకు తెలియదు. అందుకని "తప్పయిందత్తా! ఇక యెప్పుడూ అలా అనను" అంది. నిజంగా ఆమె వల్ల తప్పయింది. ఆమె తల్లికూడా "అమ్మాయ్! ఇంత పెద్ద దాని వయ్యావ్, ఇకనైనా తెలివి తెచ్చుకుని మాట్లాడడం నేర్చుకో!" అన్నది.

తరువాత అందరూ బలవంతం చేయడంవల్ల లలన తల్లి రెండు మెతుకులు కొరికి లేచిందో లేదో, బిందువాసిని తన అయిదేళ్ళ పిల్ల ప్రమీలచేయి పట్టుకుని హారాన్‌బా బింటిక్ వచ్చింది.

ఎదురుగుండావున్న రాసమణి "బిందూ! ఇప్పుడు మా ఇంటివేపు రావడం మానేశావేం?" అని అడిగింది.

బిందు సామాన్యమైందికాదు. నవ్వుతూ "నీవు మాత్రం మా ఇంటికి వస్తున్నావేం, అక్కాయ్?" అని అంది.

"వచ్చేందుకు వీలు చిక్కడం లేదమ్మా! చిన్నవాడికి జబ్బు చేసిం తర్వాత బైటికి కాలుకదపడమే కష్టంగా వుంది."

"ఏం జబ్బా?"

"జ్వరమూ కడుపునొప్పీ. ఇంకా అన్ని రకాలు వున్నాయ్";

"కోడలు యెక్కడి కెళ్ళిందేం?"

"ఇప్పుడే రెండు మెతుకులు కొరికి ఆ పిల్లవాడి దగ్గర కూచుంది. ఏం చేస్తాం?"

"ఇంత ఆలస్యం యెందుకు చేస్తావుఁది" "ఇవ్వాల్టికి మూడు రోజుల్నుంచీ వాడు ఇంటికి రావడంలేదు. ఇంకా వస్తాడు, ఇంకా వస్తాడు, అని ఎదురుచూస్తూ కూచుంది."

మాధవుడు వున్న గదిలోకి ఇందు వెళ్ళింది. ఎనిమిదేండ్ల వయసుగల మాధవుడు హారాన్ చిన్నకొడుకు సంవత్సరంనుంచి మలేరియాతో బాధపడుతూవున్నా, అతనికి యేమంత కష్టంగా లేదు. సరయిన చికిత్స చేస్తూంటే యెప్పుడో నయమయ్యేది! బీదరికంవల్ల సరయిన మందూ మాకులు లేకపోవడం మూలాన్ని, ఆ రోగం అలానే అతన్ని అంటిపెట్టుకుని వుంటోంది. యేదో ఇష్టంవచ్చినట్లు తినీ, తినకుండా కాలం గడుపుతున్నాడు. శాంత స్నిగ్ధ ఉజ్వలనేత్రాలతో తల్లిని చూసి, "అమ్మా, నాన్న రెండు మూడు రోజుల్నుంచి నన్ను చూడడానికి రావడం లేదు. యెందుకని?" అని అడిగాడు.

"నాన్న ఊళ్ళో లేరు."

"యెక్కడి కెళ్ళారు?"

తల్లి ఇటూ అటూ చూసి, "నీకు మందు తీసుకురావడానికి వెళ్ళారు" అని చెప్పింది.

"తియ్యనిమందు తీసుకురమ్మని చెప్పు. చేదుమందు ఇక త్రాగలేనమ్మా! చూడమ్మా. బాగైనాక మళ్ళీ పరుగెత్తాలనీ, తిరగాలనీ నా మనస్సు ఉవ్విళ్ళూరుతూ వుంది. అని కొంచెం

సేపు ఆగి, "అమ్మా: నాకు నయమవుతుందా?" అని అడిగాడు.

తల్లి కళ్ళల్లో నీళ్ళు జలజలలాడాయ్! మాధవుని ఏం చేయ దలచుకున్నాడో ఆ భగవంతునికే తెలుసు! ఏదో జవాబు చెప్పబోయే సమయంలో, బిందు తొందరగావచ్చి, "యెందుకు నయంకాదు నాయనా! నేను నీ దగ్గరవుండి నయమయేట్లు చేస్తాను" అని అంది. మాధవుడు కాని, అతని తల్లి కాని బిందు రావడం చూడలేదు. ఇద్దరూ చకితులయ్యారు!

బిందు ఆ మంచంమీద కూచుని, "ఇంతకూ అన్నం ఏమన్నా తిన్నావా సుభదా?" అని అడిగింది.

హారాన్ ముఖర్జీభార్య పేరు సుభద. బిందు ఆమెకంటే వయసులో చిన్నదైనా, పేరుతోనే పిలవడం అలవాటు! సుభద తలవంచుకొనే తలూపుతూ "ఊ" అని అంది.

"మీ పెద్దమ్మాయి, యెక్కడికి వెళ్ళింది?"

"పైన వున్నదేమో."

"అయితే ఆమెను కొంచెం పిలుద్దూ?" అని మళ్ళీ స్వయంగా తనే, "లలనా, ఓ లలనా" అని పిలిచింది.

లలన పైనుంచే, "యెందుకు?" అని అడిగింది.

"కొంచెం క్రిందికి దిగిరా అమ్మా?"

లలన వచ్చాక తన కూతురిని ఆమెను పప్పగించి. బిందు "ప్రమీలను తీసుకుని నీవు తమ్ముని దగ్గరకూచో చాలా రోజులకి మీ అమ్మను కలుసు కున్నాను కొంచెంసేపు ఆ గదిలో కూచుని మీ అమ్మతో మాట్లాడుతాను" అని అన్నది.

ప్రమీలచేయి లలనచేతిలో పెట్టి తను సుభదచేయి పట్టుకుని పైకి తీసుకునివెళ్ళి గది తలుపులు లోపల గడియవేసి "సుభదా! హారాన్‌బాబు యెన్ని రోజులనుంచి ఇంటికి రావడంలేదు?" అని అడిగింది.

"మూడు రోజులనుంచి"

"యెందుకు రావడంలేదో, ఏమయినా తెలుసా?"

"లేదు, ఏమీ తెలియదు"

బిందు మాట్లాడే విధానాన్నిబట్టి, ఏమయినా ఆపద కలిగిం దేమోనని సుభద అనుకుంది. బిందుకూడా చాలానేపు ఆలో చించి "సుభదా! లోకులు యెన్నో మాటలు అంటుంటారు. కాని, అవన్నీ నిజం కాదనుకుంటాను" అని అంది.

సుభద ముఖం తెల్లబడిపోయింది. "అవును లోకులమాటలు నమ్మకూడదు. అయితే ఆ సంగతి ఇప్పుడెందుకు? అసలు సంగతేమిటి?" అని అడిగింది,

"హారాన్ అన్నయ్య మూడు రోజుల్నుంచి ఇంటికి యెందుకు రావడంలేదు, యేదయినా ఆపద కలిగిందేమోనని నేనంటే ఏమంటావు?"

సుభద శరీరం ఒక్కసారి జలదరించినట్లనిపించి "యేమిటి? వా రిప్పుడు లేరా?" అని అంది.

"ఇదేమిటి? ఇలా వణకుతావెందుకు? ఆయనగారు లేరని యెవరన్నారు?"

"అయితే వా రున్నారా!"

"యెంత పిచ్చిదానివి! యెందుకులేరు. హాయిగానే వున్నారు!"

ఆ మాట విన్నా సుభదకు మాట్లాడేశక్తి లేకపోయింది. కొంచెం సేపయాక "అయితే యేమిటి?" అని అడిగింది.

"అదే, చెప్పాలని వచ్చాను. ఊరికినే నీవలా భయపడితే నేను చెప్పను."

సుభద ఓ నిట్టూర్పు విడిచి "ఇక అలా భయపడను. యేం జరిగిందో చెప్పు?" అని అడిగింది.

"దొంగతనం చేసాడనే నేరంమీద ఆయనను నందిబాబు పోలీసు ఠాణాకు అప్పగించారు"

"పోలీసు ఠాణాకా!" సుభద ముఖమంతా తెల్లబడింది. "అయితే ఇప్పుడే మవుతుంది?" అని అడిగింది.

బిందువాసిని సహజ స్వభావంతో, "ఏ మవుతుంది సుభదా? ఆయన్ని విడిపించుకురావాలి" అని అంది.

"అలా జరుగుతుందా?"

"ఠాణాకు వెళ్ళిన వాళ్ళందర్ని జైలుకు పంపిస్తున్నారా ఏమిటి?"

చాలా సేపు ఊరుకున్నాక సుభద "బిందూ! ఒకసారి మీనాన్న గారి దగ్గరకు వెళ్ళి వస్తాను" అని అంది.

వద్దని బిందు తలూపింది. సుభద ముఖంచూస్తే రాళ్ళు కరిగి పోతాయ్ కాని తన తండ్రి మనసు మాత్రం కరగదని ఆమెకు తెలుసు! "అక్కడికి వెళితే ఏమవుతుంది?" అని బిందు అడిగింది.

"మా కెవరూలేరు. ఒకవేళ దయతలచి వా రేమయినా సహాయం చేస్తారేమో,"

'నా' అనేవాళ్ళు లేనివారికి భగవంతుడే వున్నాడు. హారాన్ అన్నాయికి మా నాన్నకూ విరోధముంది. అందువల్ల మా నాన్న గారి దగ్గరకెళ్తే లాభంలేదు''

''అయితే ఇప్పుడేం చేయను బిందూ ?''

''నేను చెప్పేది అదే. లేకపోతే, వూరికే యీ కబురుచెప్పి వెళ్ళాలని వచ్చా ననుకున్నావా ? ఇంతకూ నేను చెప్పినట్లు చేస్తావా ?"

''చేస్తాను''

''యెన్ని కష్టాలువచ్చినా?'' ''ఆ''

''అయితే విను. రెండు మూడువందలు దొంగతనం చేసాడని నందిబాబు అతనిమీద నేరం మోపాడు''

''రెండుమూడువందలా? ఒక్కసారే ఇంతడబ్బు దొంగతనం జేసారా ? ఒకవేళ దొంగతనం చేసినా యెక్కడ పెట్టారా డబ్బుని ? ఆయన ఎన్నడూ ఇంతడబ్బు దొంగతనం చేసుండరు బిందూ ?''

''దొంగతనం చేయకపోతే మంచిదేగా ? ఆ డబ్బును తిరిగి నంది బాబుకి ఇచ్చేస్తే వదిలేస్తారు."

''ఈపని యెలా జరుగుతుంది ? అంత డబ్బు నే నెక్కణ్ణుంచి తేను ?''

''అదే నీకు చెప్పేది ! సిగ్గు పడాల్సిన సమయంకాదిది. కాని యీ రెండు ముడుపులూ తీసుకుని యీ రాత్రికే నువ్వు నందిబాబింటికి వెళ్ళు ! తరువాత యెలా చేయాలనుకుంటే అలాచేయ్ !''

సుభద ఆశ్చర్యంగా ''నీ మురుగులా ?'' అని అంది.

"అవును నా మురుగులే: వీటి ఖరీదు మూడు నాలుగు వంద లవుతుందీ. ఇవి వారి కిచ్చి మంచిమాటలు చెప్పి వేడుకుంటే, వదిలేస్తాడు.''

''కానీ బిందూ ?''

''కానీ, గీని, ఇప్పుడెందుకు ? ముందు భర్తను రక్షించుకో. తర్వాత కాని అని అను. ఇది సిగ్గుపడాల్సిన సమయంకాదు. నాడబ్బు నాకు తిరిగి ఇచ్చే విషయంలో, నీ కొడుకు పెద్దవాడయి తీర్చుకుంటాడులే !''

''ఇవాళే వెళ్ళనా ?''

''అవును. ఇవాళే వెళ్ళాలి''

''యెవరినన్నా తోడు తీసుకుని వెళ్ళమంటావా ?''

''నమ్మకస్తు దెవరయినా వున్నారా ?''

''యెవరూ లేరు''

''అయితే ఒంటరిగానే వెళ్ళు. ఒంటరిగా వెళ్ళడమే మంచిది! నలుగురుకీ తెలిస్తే నాలుగు రకాలుగా మాట్లాడుతారు.''

''ఐతే ఇవాళే వెళ్తాను.''

''అవును చీకటి పడిన తర్వాత, మాసిన గుడ్డలు కట్టుకుని ముసుగులేకుండా వెళ్ళు. రేపు యీ పాటప్పుడు మళ్ళీ నేను వస్తాను'' అని బిందు వెళ్ళేందుకు లేచి నిలుచుండగానే, సుభద కళ్ళంట నీరు కారాయ్ !

బిందు ప్రేమతో వాటిని తుడిచి, ''భగవంతుడు అంచర్నీ బాగా చూస్తాడులే ! కష్టపు రోజులు ఎప్పుడూ వుండవు ? ఏమి

దిగులు పెట్టుకోకు!'' అని తన పైటకొంగున వున్న అయిదు రూపాయల కాగితాన్ని తీసి సుభద పిడికిల్లో అదిమిపెడుతూ ''నేను నీ తల్లికి ఒక విధంగా దగ్గిరి చెల్లిలిని. నా దగ్గర సిగ్గెందుకు? ఈ రూపాయలు తీసుకో. పిల్లవాడి కెందుకయినా పనికి వస్తాయ్'' అని క్రిందకు దిగివచ్చి ప్రమీల చెయ్యిపట్టుకుని ''చాలా ఆలస్యమయిందమ్మా! పద, ఇంటికి'' అని విధవ అయిన లలనని, స్నేహప్రపూరిత దృష్టితో చూసి, పలకరించి బైటకు వెళ్ళిపోయింది.

# 3

ఆ మధ్యాహ్నం పట్టిన మబ్బులు గాలివల్ల ఛిన్నాభిన్నమై పోయి, మళ్ళీ చీకటి పడగానే ఒక్కొక్కటే సమరోత్సాహంతో, గర్జనలతో, కలుసుకుంటూన్నాయ్! యీ రాత్రికి వర్షం వచ్చి తీరుతుందని అందరూ అనుకుంటున్నారు. వేడి తగ్గిపోతుంది, ప్రాణాల్లోకి ప్రాణాలు వస్తాయ్! లాభాలు వస్తాయ్! కాని, ఒక్క సుభదకుమాత్రం అది ప్రాణసంకటమై పోయింది.

''హలాద్‌పూర్'' నుంచి ''బ్రాహ్మణపాడ్'' కు దారి అడవుల్లోంచివుంది, పైగా ఆమె ప్రయాణానికి భయంకరమైన మబ్బులు కమ్ముకొస్తున్నాయ్. అయినా సుభద తెగించి, పైట చెంగులో రెండు మురుగులు భద్రంగా కట్టుకుని, కంబళీతో శరీరమంతా కప్పుకుని ఇంట్లోంచి బైటకు వచ్చింది. ఇంతకు ముందెప్పుడూ ఆమె ''బ్రాహ్మణపాడ్'' కు వెళ్ళలేదు. కాని, ఉత్తరపు వేపు

నుంచి అంకోసు వెళ్ళాక ఒక మంచిదారి దొరుకుతుందని. అక్కణ్ణుంచి కొంచెం ముందుకువెళ్తే "బ్రాహ్మణపాడ్" గ్రామము కనిపిస్తుందని అక్కడికి వెళ్ళాక జమీందారుగారి ఇల్లు గుర్తించడంలో ఏమంత కష్టంలేదనీ. అందరూ చెప్పుకుంటారు.

"హలాద్‌పూర్" దారిదాటి "బ్రాహ్మణపాడ్" దారి కనుక్కోడమే ఆమెకు కష్టమయింది. మెల్లమెల్లగా చీకటిపడింది. చిన్న చిన్న వర్షపు చినుకులుకూడా మొదలు పెట్టాయి. కొంచెం సేపట్లోనే చినుకులు పెద్దవై జోరున వర్షం సాగింది. పిసుగెత్తి సుభద ఓ చెట్టుక్రిందకువచ్చి నిలుచుంది. కన్ను పొడుచుకున్నా కానరాని ఆ కటికి చీకటితో, యెదుటి వస్తువేమీ కనుపించని ఆ కాళరాత్రిలో ముందుకు అడుగిడేందుకే గుండెలు జల్లుమన్నాయ్!

జోరున వర్షము మధ్యమధ్య వురుములూ, మెరుపులకు సుభద కంపిస్తోంది. నాలుగువేపులనుంచి అడివిజంతువులు పరుగెత్తుకుంటూ ఆ చెట్టు క్రిందకు వచ్చి అక్కడనున్న మానవమూర్తిని చూసి, భయంతో వెనక్కి పరుగెత్తుక వెళ్తున్నట్లుంది! తను వచ్చినట్లే యీ వర్షానికి భయపడి దొంగలు ఆ చెట్టుక్రిందకువస్తే? ప్రాణాలకు యేమీ భయంలేదు. కాని, భర్తను విడిపించేందుకు వుపయోగపడే ఆ రెండు కంకణాలకోసం ఆమె భయపడింది. భయంతోనే ఆ చెట్టుక్రిందనుంచి పారిపోయింది. ఒళ్ళంతా బురదతో నిండిపోయింది. చెట్లకొమ్మలు తగలడంచేత శరీరం గీచుకుపోయింది. అయినా సుభద వెళ్తూనే వుంది. ఒక్క క్షణమయినా వర్షం తగ్గలేదు! ఒక్క ముహూర్త కాలమైనా మేఘాలగర్జన ఆగలేదు. ఏవేపు నడుస్తూందో యేమో,

తనకే తెలియదు. ఆ గాలీ వర్షంలో ఆమె అలానే నడుస్తోంది. చాలా సేపయాక ఓ పెద్ద దారి కనిపించింది. రెట్టింపు వుత్సాహంతో ఆ దారిని సరయిన దారని గుర్తించి మెల్లమెల్లగా ఆమె పల్లెలోకి వచ్చింది. కొంచెం దూరం వెళ్ళాక ఓ పెద్దమేడ దాని చుట్టూవున్న తోటను చూసి, అదే జమీందారుగారి ఇల్లనుకుంది. ఇప్పుడు లోపలి కెట్లా వెళ్ళాలి?

ఇంతవరకూ దారికోసం వెతికింది. ఇప్పుడు జమీందారు గారిని కలుసుకోవడ మెలాగు అనే ఆలోచనలో పడింది. ఒక వేళ లోపలకు వెళ్ళినా ఇంత రాత్రప్పుడు జమీందారుగారు మాట్లాడతారా?

సుభదకు యేడుపువచ్చింది. ఇప్పు డేమిజరుగుతుందో ఇంటికి యెలా వెళ్ళాలో వురుముల మెరుపుల మధ్య ఆశతో ఇంతదూరం కష్టపడి వచ్చిన శ్రమ వృధా అవుతుందా?

నందిబాబు ఇంటికి యెదురుగావున్న శివాలయపు వరండాలోకి వచ్చి ఆమె పడుకుంది. అప్పటికి ఇంకా వర్షం తగ్గలేదు. వైశాఖమాసపు మేఘాలు యేవిధంగా క్షణంలో ఆకాశాన్ని కప్పివేస్తాయో ఆవిధంగానే క్షణంలో ఆకాశాన్ని వదిలి యెక్కడికో వెళ్ళిపోతాయ్! చూస్తూ చూస్తూ వుండగానే మేఘాలు యెక్కడో మాయమై, చంద్రుని తెల్లని కిరణాలతో ప్రపంచం మెరిసింది. ఇక ఇంటికి వెళ్ళేందుకు చంద్రుడుకూడా తనకు తోడుగా వున్నాడని ఆమె అనుకుంది.

తడిసిపోయిన గుడ్డలు పిండుతూ వుండగా జమీందారుగారి ఇంటి తలుపు తెరుచుకుని ఒక వృద్ధుడు దేవాలయంవేపు వస్తు

న్నాడు. నౌకరు ఒకడు చేత లాంతరుపట్టుకుని దారి చూపు తున్నాడు! వీరిని అడిగి కనుక్కుందామని సుభద ప్రక్కకు వదిగి నిలుచుంది.

శివాలయపు ద్వారం వద్దకు వచ్చి ఆ వృద్ధుడు ఒక్కసారి ఆమెవేపు చూసి, లోపలకు వెళ్ళాడు. చాలసేపయాక బైటకు వచ్చి ఆమె అక్కడే వుండడం తిరిగి చూశాడు. ముఖంమీదున్న ముసుగు చూసి ఆమె ఎవరో పెద్దింటి ఆడపడుచని వర్షం వచ్చి నందున అక్కడ నిలుచుందని అతను అనుకుని "ఎవరమ్మాయ్, నువ్వు?" అని కుతూహలంతో అడిగాడు.

సుభద యేమీ మాట్లాడలేదు.

"ఎక్కడికి వెళతావమ్మా?"

జవాబు చెప్పేందుకు సిగ్గుపడికూడా, ఆమె, "జమీందారు బాబుగారింటికి?" అని అంది.

"జమీందారుగారి ఇల్లు ముందున్నదేగా: అక్కడికి వెళ్ళ కుండా ఇక్కడెందుకు నిలుచున్నావు?"

సుభద జవాబేమీ చెప్పలేదు.

వృద్ధుడు మళ్ళీ "జమీందారింట్లో, ఎవరిని కలుసుకోవాలి?" అని అడిగాడు.

"బాబుగారిని."

"ఏ బాబు?"

"భగవాన్ బాబుగారిని."

వృద్ధుడు విస్మయంగా "భగవాన్ బాబు వద్దా?" అని అడిగాడు.

"అవును."

"అయితే నా వెంటరా" అని ముందుకు నడిచాడు.

సుభద్ర వెన్నెల్లో ఆ వృద్ధుని నెరసిన వెంట్రుకల్నీ, అతని సౌమ్యమూర్తినీ చూసి, సంకోచము లేకుండా అతని వెంట నడిచి వెళ్ళింది.

క్రమంగా దారి దాటి, తోటలోంచి వెళ్ళి, ఓ గది తలుపు తెరచి "ఈ గదిలోకి రా అమ్మాయ్." అని వృద్ధుడు పిలిచాడు.

గది బాగా అలంకరించబడి వుంది—పరుపులూ కుర్చీలూ పాన్పులూ ఇంకా యేమేమో....

వృద్ధుడు ఓ ముఖమల్ పాన్పుమీద కూచుని, సుభద్రను తల మొదలు పాదాలవరకూ ముసుగులోనే చూశాడు. సుభద్ర ఒకానొకప్పుడు రూపవతి! కష్టాలకు లోబడి ఉపవాసాలు చేస్తున్నందున అమె రూపం మునుపటంత ఇదిగా లేకపోయినా వున్న ఆ కొద్ది అందానకే వృద్ధుడు మోహితు డయ్యాడు! చాలా సేపు ఆమెను చూశాక "అమ్మాయ్! నువ్వు మర్చిపోయి ఇటువేపు వచ్చావనుకుంటాను. వినోదబాబును కలుసుకునేందుకు వచ్చావా!" అని అడిగాడు.

"వినోద బాబెవరు?"

"భగవాన్‌బాబు చిన్నతమ్ముడు!"

"ఆయన్ని కలుసుకోవాలని నేను రాలేదు"

"అయితే నీకు భగవాన్ బాబుతోనే పనుందా?"

"అవును"

...వాన్ నందిబాబును నేనే! ఆ పేరుతో నన్నే పిలుస్తారు. మరి ...న్న నే నెప్పుడూ చూడలేదే?"

"లేదు"

"అయితే నాతో నీకేం పనుంది?"

సుభద జవాబేమీ చెప్పలేదు. భగవాన్‌బాబు మళ్ళీ "ఏ ఆడ దానితోనైనా రాత్రిపూట ఏనోదబాబుకే పనుంటుందని నా అభిప్రాయం. ఇంత రాత్రప్పుడు నాతో నీకేంపనో నాకు తెలియడం లేదు" అని అన్నాడు! సుభద జవాబేమీ చెప్పలేదు.

"మరి మీ ఇల్లెక్కడ?"

"హాలాద్‌పూర్"

"హాలాద్‌పూర్? నాతో పనేమిటి! అయితే నీవు హారాన్ భార్యవా ఏమిటి?"

"ఊఁ"

"మరి నాతో పనేమిటో చెప్పు?"

సుభద పైటచెరగున వున్న రెండు కంకణాలూ తీసి, బాబుగారి పాదాలవద్దవుంచి, గద్గదస్వరంతో "వారిని వదిలిపెట్టండి" అని అడిగింది!

వృద్ధుడు అంతా గ్రహించి, రెండు కంకణాలూ తీసుకుని వాటిని పరీక్షిస్తూ, "ఇప్పుడు నీకు ఇవైనా ఇచ్చాడుకదా అని సంతోషంగా వుంది. అని ఆ రెండు కంకణాలూ క్రిందపెట్టి, "ఈ వస్తువుల్ని తిరిగి తీసుకవెళ్ళు. బ్రాహ్మణ ఆడపడుచుచేతి కంకణాలు నేను తీసుకోను, అతన్ని వదిలి పెట్టాలంటే, ఊరికినే వదిలేస్తాను. అతనెంత తీసుకుందీ నాకు తెలియక పోయినా, యీ కంకణాలు తీసుకోకుండానే వదిలివేయగలను" అని అన్నాడు,

సుభద కన్నీళ్ళు తుడుచుకుని, "అయితే వారిని వది తారు కదూ?" అని అంది.

"వదిలిపెడదామని అనుకోలేదు. అటువంటి దుశ్చరిత్రుడికి ప్రాయశ్చిత్తం తప్పకుండా చేస్తేనే మంచిది. అయినా నీకోసం అతన్ని వదిలిపెడతాను"

సుభద కళ్ళల్లోంచి నీరు కారింది. బ్రాహ్మణ పిల్లయినా, తెల్లని వెంట్రుకలు గల ఆ వృద్ధుల్ని దీవించేందుకు ఆమెకు సాహసము కలుగలేక పోయింది. మనసులోనే ఎన్నో ధన్య వాదాలను అర్పించి వెళ్ళేందుకు నిల్చున్నప్పుడు "ఇప్పుడే యీ రాత్రిపూటే ఇంటికి వెళ్తావా?" అని అతను అడిగాడు.

ఆమె వెళతానని తలూపింది.

"నీతో ఇంకా ఎవరైనా వచ్చారా!"

"ఎవరూ రాలేదు"

"ఎవరూ రాలేదూ? ఐతే ఇంత రాత్రప్పుడు ఒంటరిగా వెళ్ళడం మంచిదికాదు. ఒక మనిషిని వెంటతీసుకు వెళ్ళు"

సుభద అంగీకారంగా తలూపి, నౌకరు సాయంతో ఆ అడవుల వెంట పడి ఇంటికి తిరిగి వచ్చింది.

అప్పటికి తెల్లవారింది. లలన లేచి, ఇంటిపనుల్లో ప్రవేశిం చింది. తడిసిన బట్టలతో తల్లి రావడముచూసి "ఇంత ప్రొద్దున్నే గంగాస్నానానికి వెళ్ళొస్తున్నావేం అమ్మా?" అని అడిగింది.

# 4

సుభద తన ఇద్దరి కూతుళ్ళకు "రామామణి దుర్గమణి" అని పెట్టకుండా లలన, చలన అని పేర్లు పెట్టినందున మేనత్త రాసమణి సంతాపానికి హద్దులేదు.

లలన, చలన యీ రెండు పేర్లూ. బజారు పిల్లలకు మల్లే వుండటం రాత్రింపగళ్ళు ఆమె రెండు గూబలను పగులగొడ్తున్నాయ్! యేదో ఒక విధంగా లలనపేరు కొంత బాగానేవుంది కాని, చలన, ఇదీ ఒక పేరేనా? ఛీ! చలనను ఆమె తన క్రీగంటితో కూడా చూడకపోయేందుకు యీ పేరే కొంత కారణము.

కొడుకులకూ, కూతుళ్ళకూ అందరూ దేవతలపేర్లు పెడతారు. ఆ పేర్లుపెట్టి పిలిచినప్పుడు, కొంత పాపమైనా తగ్గుతుందని వాళ్ళ నమ్మకము! కాని, యీ పేర్లతో పిలిచినట్లయితే పుణ్యం మాట అటుంచి, పాపం కూడబెట్టుకొనడం లాంటిదిగా ఆమెకు కనిపించింది.

లలనామయి హోరాన్ కూతురు పెద్దది. రెండో ఆమె చలన ఇంకా చిన్నది. పెద్దమ్మాయికి పన్నెండేళ్ళు. విధవ, రెండోఆమె ఇంకా చిన్నపిల్ల.

స్నానం చేయటానికి లలన గంగానదికి వెళ్ళినపుడు, ముదివయసుగల ఆడవాళ్ళంతా "భగవంతుడు ఇంత అందాన్ని ఇచ్చింది పాపం ఇలా విధవను చేయడానికేనా!" అని అనే వాళ్ళు. లలన యీ మాటలేమి లక్ష్యంపెట్టకుండా మూడు మునకలు మునిగి, బిందె నింపుకుని ఇంటికివచ్చేది. ఆమె ఎక్కువగా మాట్లాడదు ఇరుగుల జోక్యానికి పోదు.

ఇక చలన విషయం వేరు. పోట్లాటంటే చెవి కోసుకుని బైలుదేరుతుంది. ఇతరుల విషయం తనవే అని అనుకుంటుంది. ఎనిమిదయ్యాక లేచి స్నానానికి వెళ్ళి, పన్నెండు గంటలకు తిరిగి వస్తుంది. ఒంటిమీద నగలూ, నాణ్యాలూ లేవని ముఖం ముడుచు

కుని కూచుంటుంది. ముతకబియ్యపు అన్నం బాగోదనీ. కంచంలో చేప వేపుళ్ళు లేవనీ, పళ్ళెం విసిరేయటం.... ఇలాంటివి రోజు కెన్నో జరుగుతూ వుంటాయ్!

ఆమె అందానికి కూడా లోటులేదు. బంగారు శరీర ఛాయ! గులాబి పూలవంటి బుగ్గలు, రెండు కనుబొమ్మలూ చిత్రకారుడు తీర్చి దిద్దినట్లు చక్కగా చిత్రించి వుండేవి. ఆకులు నమిలాక అద్దంలో తన ఎర్రని పెదిమలను చూచుకుని తనకు తానే మురిసి పోతూ వుండేది! "యీ వయసులో ఇంత అందం వుంది. పెద్ద యాక యేమవుతుందో ఎవరికి తెలుసు! అందరి మెడల్లోనూ. ఎన్నెన్నో నగలుంటాయ్, ఇక్కడ గాజులు, ఇక్కడ తోడాలు, ఇక్కడ ముక్కుబేసరి. ఇక్కడ గొలుసు ఇంకా, ఇంకా అన్నీ నాకుంటే. ఎలావుంటానో?" అని మనసులో అనుకొని హఠా త్తుగా లేచి, అక్కగారి దగ్గరకు వెళ్ళుతుంది.

"ఏం? పరుగెత్తుకుంటూ వచ్చావ్?" అని లలన అడిగేది.

"అక్కాయ్! నావళ్ళు మునుపటికంటే నల్లబడిందా?"

"నల్లగా ఎందుకుంటుంది?"

"లేదూ? సరే! అక్కాయ్. మన పల్లెటూళ్ళో ఎవరైనా జ్యోతిషుడు వున్నాడా?"

"ఎందుకూ?"

"నేను చేయి చూపించుకోవాలి?"

"ఎందుకు?"

"పెద్దదాన్నయాక నేను నగలు పెట్టుకుంటానో, లేదో చెప్తాడు"

లలన కళ్ళంట నీళ్ళు వచ్చేవి. "పెట్టుకుంటావమ్మ. పెట్టుకుంటావు. ఎందుకు పెట్టుకోవు? నువ్వు ఓ మహారాణివి అవుతావు?" అని అనేది.

చలన సిగ్గుపడేది. ముఖం ఎరుపెక్కేది. పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయేది.

మళ్ళీ ఎప్పుడన్నా వచ్చి "అక్కాయ్, మన ఇంట్లో ఏమీ వుండవేమే?" అని అడిగేది.

"మనం బీదవాళ్ళం కాదా అమ్మా?"

"బీదవాళ్ల మెందుకయాము అక్కాయ్? యీ పల్లెటూళ్ళో మనలా కష్టపడేవాళ్ళు ఎవరూలేరుగా?"

"ఈశ్వరుడు ఎవరిని ఏవిధంగా సృష్టిస్తాడో, వాళ్ళకు ఆ విధంగా జరుగుతుందమ్మా",

"మరి, ఇంకెవర్నీ మనలా సృష్టించలేదుగా? మనల్నే ఎందుకని సృష్టించాలి?"

"ఇది మన పూర్వజన్మ పాప ఫలం"

"పూర్వజన్మ పాపమంటే, యేం పాపమక్కాయ్?"

పాపం అనేది ఒకటేనా యేమిటి? ఎన్నో పాపాలు చేసుకుంటాము. తల్లిదండ్రులను ఆదరించక పోవడం, ఇతర్లకి కష్టాన్ని కలిగించడం, ఇంకా ఎన్నో పాపాలు చేసుకుంటాం?"

"అయితే, మనం ఈ విధంగానే ఎల్లప్పుడూ వుండాలని భగవంతుడు ఏర్పరిచాడా? ఇక ఎప్పటికీ మనకు సుఖ మనేది వుండదూ?"

"ఎందుకు వుండదమ్మా! చెడురోజులు పోయాక మంచి రోజులు వస్తాయేమో ఎవరు చెప్పగలరు?" అని చలన రెండు

చేతులూ పట్టుకుని "నీ కెంతో సుఖం, ఎన్నెన్నో నగలు, ఎంతో ఐశ్వర్యం. ఎంతోమంది దాస దాసీలు దొరుకుతారు. నువ్వు ఓ రాజాకు తప్పకుండా రాణీ వవుతావు?'' అని అనేది.

''అక్కాయ్, మరి నువ్వో?''

తన అక్కగారు విధవ అని చలనకు తెలుసు. అయినా చిన్న తనపు చపలత్వంవల్ల నోటినుంచి మాట జారి వచ్చేసేది.

''నేనుకూడా సుఖంగానే వుంటాను....అమ్మ నన్ను పిలుస్తోంది'' అని లలన వెళ్ళిపోయింది.

నిజంగా అప్పుడే వాళ్ళమ్మ లలన పిలిచింది. ఆమె దగ్గరకు వెళ్ళి ''ఎందుకమ్మా?'' అని లలన అడిగింది.

''మీ నాన్నగారు వచ్చారు. ఆ గదిలో....'' మాట పూర్తి కాకముందే లలన వెళ్లిపోయింది.

''ఇన్ని రోజులు ఎక్కడికి వెళ్ళావురా?'' అని రాసమణి అన్నం తినేందుకు కూచున్న హారాన్‌ను అడిగింది.

నోట్లో ముద్ద పెట్టుకుంటూ, ''అదంతా దేనికి, గ్రంథ ముంది?'' అని హారాన్ అన్నాడు.

''ఆ, పెద్దగ్రంథ మేమిటిరా?''

ఆ ముద్ద మింగి హారాన్‌బాబు మొదటి లాగానే ముఖాన్ని గంభీరంగా పెట్టి, ''నా తలమీద పెద్ద తుఫానులాంటి ఓ అపవాదు పడింది'' అని అన్నాడు.

రాసమణి విస్మయానికి కానీ, విచారానికి కానీ హద్దులేక పోయింది. బొంగురుపోయినగొంతుకతో ''విప్పి చెప్పు హారాన్!'' అని అడిగింది.

తన గంభీర ముఖంమీద కొంచెం చిరునవ్వు తెచ్చి పెట్టుకుని, హారాన్ "చవితినాటి చంద్రుని అపవాదు కథ విన్నావుకదూ? నాకూ అటువంటిదే జరిగింది. దొంగతన మనే అపవాదు వేసి నందిబాబు.... ...నా పేరుకు మచ్చ తెచ్చాడు" అని చెప్పాడు.

"మచ్చ తెచ్చాడా?"

"అవును. మచ్చ కలుగచేసాడు. కాని, అబద్ధం ఎంతకాలం దాగుతుంది? ఏమీ అంతు తేలలేదు. గత్యంతరములేక విడి పించారు. అంతే, అంతులేని విజయాన్ని పొంది ఇంటికి తిరిగి వచ్చాను."

ముసుగులోవున్న సుభద తన కన్నీళ్ళు తుడుచుకుంది. రాస మణి జమీందారు కుటుంబాన్ని దీవించి "ఇప్పుడు వాళ్ళు నిన్ను నౌకరీలో తిరిగి ఉంచుకుంటారా?" అని అడిగింది.

హారాన్ కళ్ళు ఎరుపెక్కినై. "నౌకరీలో వుంచుకుంటారా? ఎందుకు వుంచుకోరు? నేను అసలు నౌకరీ చేయదలచుకుంటేగా! ఛండాలుడైన నందిబాబు ముఖం ఈ జన్మలో ఇక చూస్తానా? ప్రతికుండీ కసితీర్చుకుంటాను, తెలుసా?"

రాసమణి భయపడి కొంచెంసేపు అతని ముఖంలోకి చూసి, "మరి ఖర్చులకి, గిన్నులకి డబ్బో?" అని అడిగింది.

"ఆ విచారం పెట్టుకోకు అక్కాయ్? నేను మగవాణ్ణి. నా కేమీ విచారంలేదు. రేపీపాటికి ఇంకోచోట నౌకరీ చూసు కుంటాను."

హారాన్‌బాబు చెప్పిందంతా రాసమణి నమ్మలేదు. కాని, యేదో కొంత విశ్వాసం కలిగింది. పూర్తిగా నమ్మేందుకు ఇటు

వంటి భీషణ విచారాలు ముందుగా వదిలించుకోవాలని అందరూ అనుకున్నట్లు ఆమెకూడా మెదలకుండా ఊరుకుంది.

కొంచెంసేపు ఊరుకుని "ఎలా నచ్చితే అలాచేయి—లేక పోతే యీ జబ్బుల్తో పిల్లా జల్లా పడే కష్టాలకు అంతుండదు" అని అంది.

హారాన్ భోజనము ముగించుకుని మాధవుడి దగ్గరకు వెళ్లాడు. అంతకుముందే తండ్రి వచ్చాడని తెలిసి, మాధవుడు మంచం మీద లేచి కూచున్నాడు. తండ్రి దగ్గరకు వచ్చి శరీరం నిము రుతూ "ఎలావుంది మాధవ్?" అని అడిగాడు.

"ఇప్పుడు బాగానేవుంది నాన్నా! మరి ఇన్నిరోజుల్నుంచీ నీవు ఎక్కడికి వెళ్ళావ్?"

కుర్రవాడు నమ్మేటట్టు హారాన్ యేదయినా మంచి జవాబు చెప్పాలని అలోచించాడు. కాని, మాధవుడు "నువ్వు నాకు మందుకోసం వెళ్ళావు కదూ? తెచ్చావా?" అని అడిగాడు.

వాడిపోయిన ముఖంతో హారాన్ "తెచ్చాను" అన్నాడు.

"మంచి మందేనా? తినగానే నయమవుతుందా?"

"తప్పకుండా నయమవుతుంది"

"అయితే తే" అని చేయి చాపాడు మాధవుడు.

హారాన్ మరోచిక్కుల్లో పడ్డాడు. అయినా సంబాళించుకుని, "ఇప్పుడు వద్దు, రాత్రికి తిను" అని చెప్పాడు.

ఈ మాటకు మాధవుడు సంతోషంతో మెల్లిగా నవ్వుతూ "సరే" అని, తరువాత కొంచెంసేపు తండ్రిగారి ముఖంలోకి

చూసి, ''నాన్నా! నాకు ఆపిల్ పండు తెచ్చి ఇవ్వవూ! తెస్తావా?'' అని ఆడిగాడు.

''సరే తెస్తానులే,'' అని లేచి, సుభద దగ్గరకువచ్చి ''నాకు రెండణాలు వుంటే ఇవ్వు'' అని అడిగాడు.

''ఎందుకు?''

''నాకు అవసరం వుంది. ఒకతనికి బాకీ వున్నాను. అతను అడగడానికి వచ్చాడు''

సుభద పెట్టె తెరచింది. హారాన్ వంగి అందులో ఇంకా డబ్బులు వుండడం చూసి, ఇచ్చిన రెండణాలు తీసుకుని ''ఇంకా నాలుగణాలు వుంటే ఇటివ్వు మాధవుడికి ఒక ఆపిల్ పండు కొనుక్కురావాలి'' అని అడిగాడు.

విచారవదనంతో సుభద భర్త ముఖంలోకి ఒక్కసారి చూసింది. అంతడబ్బుతీసి ఇవ్వడానికి ఆమెకు కష్టంగా తోచింది. అయినా పెట్టిలోంచి డబ్బుతీసి ఇవ్వక తప్పిందికాదు.

డబ్బును బాగా పిడికిట్లో మూసుకుని హారాన్ కొంచెం గట్టిగా నవ్వి ''రే పీపాటికి యీ డబ్బు తిరిగి తెచ్చి ఇస్తాను. సరేనా?'' అని అన్నాడు.

సుభద అనుమానంగా తలూపింది. భర్తచెప్పేమాటల్లో ఏమీ అర్థం లేదని ఆమెకు తెలుసు! బైటకు వెళ్ళబోతూండగా, ''ఇప్పుడెక్కడికీ వెళ్ళకండి. కొంచెంసేపువిశ్రాంతి తీసుకోండి!'' అని అన్నది.

''బాగానేవుంది! ఇంట్లో పడుకుంటే నిర్వాహకం యెలా జరుగుతుంది? ఎంతపని నా నెత్తిన వుందో నీ కేమైనా తెలుసా?''

"అయితే వెళ్ళండి!"

హారాన్ వెళ్ళాక మళ్ళీ పెట్టి తెరచి చూస్తే ఒక్క రూపాయి మాత్రమే మిగిలివుంది. ఆరోజు బిందు ఇచ్చిన ఆ అయిదు రూపాయలకు ఆ ఒక్క రూపాయే ఇప్పుడామెకు అండ అయింది. రహస్యంగా దాన్ని జాగ్రత్తపరచి మాధవుడి దగ్గిరకు వచ్చి కూచుంది.

"అమ్మా! నాన్నగారు ఆపిల్ పండు ఎప్పుడు తెస్తారే?"

"సాయంకాలము"

సాయంకాలమయింది. రాత్రయింది. కాని హారాన్ వచ్చేట్లు కనబడలేదు. మాధవుడు చాలాసార్లు అడిగాడు. ఎన్నో రకరకాల ప్రశ్నలు వేశాడు. చివరకు యేడ్చాడు.

సుభద దగ్గరకువచ్చి కూచుంది. లలన ఎన్నో విషయాలు చెప్పి కుర్రవాణ్ణి మరిపించాలని చూసింది. కుర్రవాడు చివరకు విసుగెత్తి, అలసిన శరీరాన్ని నిద్రకు వప్పగించి, ప్రొద్దుపోక ముందే లేచి "అమ్మా! నాన్న ఆపిల్ పండు తెచ్చాడా!" అని అడిగాడు.

సుభద కంటినీరు ఆపుకుంటూ. "ఆపిల్ పండును ఎలా తింటావు నాన్నా?" అని అడిగింది.

"యేం?"

"ఆపిల్ పండువల్ల జబ్బింకా ఎక్కువవుతుంది"

కూచున్నవాడల్లా పడుకున్నాడు పడుకున్నవాడల్లా కూచు న్నాడు. రెండోనాడు సాయంత్రానికిహారాన్ వచ్చాడు రాసమణి కోపంతో మాట్లాడలేదు. లలన కాళ్ళకు నీళ్ళిచ్చింది.

స్నానపానాదులయ్యాక, సుభద ''మాధవుడికి ఆపిల్ పండు తెచ్చారా?" అని అడిగింది.

''అరె ఓ....అదా!....జేబులో డబ్బులు వేసుకున్నాను. జేబు చినిగిపోయింది కామాలు! అవన్నీ ఎక్కడ జారి పొయ్యాయో యేమో, తెలవదు. సరేగానీ, నాలుగణాలు వుంటే ఇవ్వు. సాయంకాలం ఇస్తాను."

''ఇంకేమీ లేవు''

''యేమీలేకుండా వుంటుందా? నీ లక్ష్మిగృహంలో తరుగనేది ఎప్పటికీ కనుపించదు. యేమీ లేకుండాపోదు."

''నిజంగా యేమీలేదు''

''ఎందుకులేదు. నిన్న రూపాయి వుందిగా?''

సుభద మాట్లాడలేదు.

హారాన్‌బాబు "ఛీ! ఛీ! వెధవ డబ్బులకు నన్ను నమ్మ లేకపోయావు! రూపాయలకు రూపాయలు ఇవ్వడానికి నమ్మకం లేకపోతే లేకపోవచ్చుగావి, నాలుగణాలకు నమ్మకంలేని వాణ్ణయ్యాను కదూ?" అని అన్నాడు.

సుభద ఇం కేమీ మాట్లాడకుండా ఆ డబ్బు ఇచ్చేసింది.

## 5

హారాన్ చంద్రుడు ''హలాద్‌పూర్'' దాటి ''బ్రాహణ పాడ్'' సమీపించి ఒక చిన్న సందునపడి పేడతో అలికిన ఓ ఇంట్లోకి వెళ్ళాడు. అక్కడ యెంతోమంచి మతిలేని వాళ్ళలా ఒకమూల కూచున్న వాళ్ళంతా, హారాన్ చంద్రుని చూడడం

తోనే, సంతోషంతో కేకలు సాగించారు. ఒకడు "బాప్పా" అనీ, ఇంకొకడు "అన్నయ్యా" అనీ, మరొకడు "తాతా" అని ఇంకొకడు "మామా" అని వరసలతో పిలవడం సాగించారు.

ఈ సంభోదనల ఆహ్వానంతో యుద్ధంలో విజయం పొందిన వీరనాయకునిలా, వెన్ను విరుచుకుని అందరిమధ్యా కూచోవడం తోనే రకరకాల పిలుపులతో, మాటలతో, గోలచేయడం మొదలు పెట్టారు.

ఇక్కడే యెందరో రాజులవి, మంత్రులవి, తలలు యెగిరి పొయ్యాయి! లక్షలకొలది మొహరీలు క్షణంలో ఖర్చయి కూచున్నాయ్! ఇదే సారాదుకాణం! స్మశానంలో రాజులూ, మహారాజులూ, అడుక్కునే వాళ్ళూ అంతా ఒకటే అంటారు. కాని, సారాదుకాణంలో మాత్రం బికారులు రాజా, మహారాజా లకు మల్లే మారిపోతారు. ఏవిధంగా సారాయిని పెగ్‌మీద పెగ్ వేసుకుంటారో, ఆవిధంగానే పైకి లేస్తుంటారు. అలానే హృద యములో శౌర్యమూ, ధైర్యమూ, గాంభీర్యమూ, పాండిత్యమూ ఒక టొకటే పెరిగి విశాల స్వరూపాన్ని ధరిస్తుంటాయ్. యెన్నో దాన ప్రతి దానాలు జరిగిపోతాయి. వాగ్దానాలు గావింపబడతాయ్. మణిమాణిక్యాలు, వజ్రాలు, బంగారం, రాజ్యాలు, ఎంతోమంది అపరూప రాజకన్యలూ అన్నీ ఒక్కొక్క పెగ్ ఎదుటకువచ్చి వెళుతుంటాయి.

విలువ కట్టలేని అమూల్య రత్నాలతోపాటు ప్రపంచంలోని అన్ని రకాల మంచి వస్తువులుకూడా పేడతో అలకబడిన ఈ ఇంట్లోని మానవుల హస్తాల్లోకి వచ్చి మెల్లిగా దిగజారిపోతుం టాయ్,

మెల్లమెల్లగా సాయంకాలం కావచ్చింది. యెంతమందో కాళిదాసులూ, యెంతమందో ఢిల్లీ బాదుషాలూ, మరెంతమందో సురాపుద్దౌలా నవాబులూ, ఇంకెంతమందో తాన్‌సేన్‌లూ అంతా ఒకరొకరే తడికతలుపు తెరుచుకుని మెల్లిగా బైటకు వస్తున్నారు.

ప్రపంచంలోని నీచమానవులతో యీ శ్రేణి మాట్లాడదు. వాళ్ళతో వీరు మంతనాలు చేయరు. అందుకని రోడ్డుకు ఒక ప్రక్కగా తూలుతూ ఆనందంగా తమ యిళ్ళకు వెళుతున్నారు.

అందరిలానే హారాన్ చంద్రుడు కూడా బయటకు వచ్చాడు. రాగానే, అంతా జ్ఞాపకం వచ్చింది. జబ్బుతో వున్న మాధవుడూ మాధవుడితోపాటు ఆపిల్‌పండూ గుర్తుకొచ్చినయ్. అందరిలానే సామ్రాజ్య ఆనందాన్ని సంపాదించి బైటకువచ్చినా యీ పిల్లవాడు ఆసామ్రాజ్యాన్ని చిన్నా భిన్నం చేస్తాడు. గత్యంతరం లేక తలూపుకుంటూ ఢిల్లీపాదుషా హారాన్ చంద్ర చక్రవర్తి జేబులో చేయిపెట్టి చూసుకున్నాడు. యేముంది........?

అంత పెద్ద సామ్రాట్టువద్ద నాలుగు డబ్బులూ, గంజాయి గొట్టమూ తప్ప యింకేమీ మిగలలేదు.

"చాలా మంచిదే" యీమంత్రాన్ని పఠిస్తూ, దగ్గరున్న ఓగంజాయి దుకాణములో దూరి, దుకాణందారుని సంతుష్టి పరిచి "తాతా, ఈ నాలుగు డబ్బులకి పొగాకు యిస్తావా?" అని అడిగాడు.

వెంటనే దుకాణదారు అతని ఆజ్ఞను పాలించాడు.

మెల్లిగా హారాన్ చంద్రుడు తనకునచ్చిన ఓ వటవృక్షాన్ని ఆనుకుని గంజాయిసాయంతో విశృంఖలమైన తన సామ్రా

జ్ఞాన్ని తిరిగి కల్పించుకునేప్పటికి గంజాయి ఆఖరవడంతో రాత్రి చాలా ప్రొద్దుపోయింది. తూలుతూ వృక్షాన్ని వదిలి లేచి, చాలా సేపు నడిచి ఓ పూరిల్లు సమీపించి తలుపు తట్టుతూ, "ఓ కాత్యాయినీ!" అని పిలిచాడు. యెవరూ జవాబు చెప్పలేదు.

"అరే! ఓ కాత్యాయనీ.... ఇంట్లో వున్నావా?"

మళ్ళీ జవాబులేదు.

విసుగెత్తి హారాన్ చంద్రుడు గట్టిగా అరుస్తూ. "యింట్లో వుంటే ఒకసారి తలుపుతెరిచి వెళుదూ?" అని అన్నాడు.

క్షీణమైన కంఠంతో "యెవరూ?" అని వినిపించింది.

"నేనే, నేనే!"

"నావంట్లో ఏమీ బాగాలేదు, లేవలేను."

"కాదు, కాదు. కొంచెం లేచి తలుపు తెరుద్దూ?"

ఓ నల్లని యువతిపచ్చి విసుగుతో తలుపుతీసి "అయ్యయ్యో! కడుపులో బాగా నొప్పిగావుండి నేను బాధపడుతూవుంటే, ఏదో పుట్టిమునిగినట్టు అరుస్తావెందుకూ?" అన్నది.

"అరవడానికి నాకు సంతోష మేమిటి? తలుపు తెరవక పోతే అరిచాను."

"కాదుబాబూ, ఇలాకాదు. రాదలచుకున్నప్పుడు కొంచెం తొందరగా రా! అర్థరాత్రికి అర్థరాత్రిళ్ళు వచ్చి ఇలా అరిస్తే బాగోదు. ఇంత అల్లరి నాకు నచ్చదు.

హారాన్‌చంద్రుడు లోపలికె దూరి, తలుపు బంధించి కాత్యాయినివేపు చూసి, "ఓ....ఓ....ఓ....కడుపులో నొప్పిగా వుందా? అయితే నాకు తెలపదే?" అని అన్నాడు.

"నీకెలా తెలుస్తుంది? ఈ వీధివీధంతటికి తెలిసిందికాని, నీకుమాత్రం తెలిసిందికాదు. ఇదియేరావస్తే నీకేం? నిన్నటి నుంచి కడుపులోకి ఒకచుక్క నీరయినా పోలేదు. అయినా ఇంత రాత్రప్పుడు వచ్చావేం?"

"ఒక పనుంది."

"యేమిటది?"

"చెపుతాను, ముందు కొంచెం యీ చిలుములో పొగాకు నింపుతావా?"

ఆమె కోపంగా ఒకమూల చేత్తోచూపిస్తూ "ఆమూల నీ సామానంతా సిద్ధం చేసుంచాను. పొగాకు తాగాలనుకుంటే అక్కడకి వెళ్ళి చిలుము నింపుకొని తాగు. నన్నింక యెక్కువగా మండించకు. కొంచెంసేపు నిద్దరపోవాలి" అని అన్నది.

"సరే, నువ్వు నింపనవసరంలేదు. నాకు జ్ఞాపకము లేకపోయింది. నువ్వెళ్ళి నిద్రపో, నేనే నింపుకుంటాలే!"

పొగాకు నింపుకుని, హుక్కా చేత్తోపట్టుకుని హారాన్ చంద్రుడు కాత్యాయని పక్కనే మంచంమీద కూర్చుని, పొగ త్రాగుతూ మెల్ల మెల్లగా "కాత్యాయినీ, నాకు రెండు రూపాయలు కావాలి, యివ్వు" అని అడిగాడు.

కాత్యాయిని జవాబు చెప్పలేదు.

"విన్నావా? అప్పుడే నిద్రపోయావేం? నిన్నే. నాకిప్పుడు రెండురూపాయలు కావాలి."

కాత్యాయిని కంబళి కప్పుకుని మాట్లాడలేదు.

హారాన్‌చంద్రునికి కొంచెం సాహసం వచ్చింది. హుక్కాను యథాస్థానంలో వుంచి, ఆమె వంటిమీద చేయివేసి, "ఇస్తావు కదూ?" అని అడిగాడు.

"పూరికినే యెందుకలా, వాగుతావ్ ? యెక్కణ్ణుంచి తెచ్చివ్వ మంటావేం ?"

"నీదగ్గర లేవా యేమిటి ?"

"లేవు."

"ఉన్నాయ్. లేవంటావేం. నాకు తెలియదనా ? చాలా అవ సరం. ఇవ్వాళమాత్రం నామీద ఏదో యింత దయ చూపించక తప్పదు."

"లేనప్పుడు యేం దయ చూపించను ?"

"రెండు రూపాయలు నీదగ్గిర వుండవంటే నేను నమ్మను. తప్పకుండా వుంటాయ్. నీదగ్గర రూపాయలు ఉన్నా యని నాకు తెలుసు. ఎందుకు నన్నిలా యేడిపిస్తావ్. డబ్బులేక, తిండికి గింజలులేక మేమందరం పస్తులు ఉంటున్నాం. జబ్బులో పడి మూలుగుతున్న నా కొడుకు నోటిదగ్గర. ముద్ద లాక్కొని వచ్చి, నా కడుపు నింపు కున్నాను. సిగ్గుతో, ఏహ్యంతో, నాగుండె పగిలిపోతూవుంది. కాత్యాయినీ, నన్ను రక్షించక తప్పదు."

"రక్షించేందుకు నావగ్గర యేమన్నా వుంటేకదూ ? నిజం చెపుతున్నాను. దాదగ్గ రిప్పుడు ఒక్క దమ్మిడీకూడా లేదు."

హారాన్ చంద్రుడికి కోపం వచ్చి, "అవును, ఎలా వుంటుందీ ? ఎంతోడబ్బు నేను నీకిచ్చాను. ఈ గడవనిరోజుల్లో రెండు రూపాయలు నా కివ్వలేవుకదూ ? సరే ! తాళపుచేతులు యిటు తే ! డబ్బుందో లేదో చూస్తాను" అని అన్నాడు.

అసలే ఆమె నీచజాతి ఆడది. ఏమేమో బండబూతులు తిడుతూ, "నీ వుంపుడుగత్తెగా వున్నపుడు డబ్బు ఇచ్చావుకాని,

వూరికినే ఇచ్చావా యేం? నీకు గడవని రోజుల్లో ఆ డబ్బును తిరిగి యివ్వాలని రూలా యేమిటి?'' అని అన్నది.

హారాన్ ఘటికుడు కాడు, తెల్లబోతూ విచారంగా ''అయినా, నీ ప్రియుడికి ఈమాత్రం ఉపకారం చేయలేవూ?'' అన్నాడు.

''నీ ప్రియత్వాన్ని మంట బెట్టారులే! ప్రియుడంట ప్రియుడు! ఏలాంటి ప్రియుల ప్రేమకూ, ప్రియురాళ్ళ ప్రేమకూ ఇది స్థానంకాదు తెలుసా? ఇప్పటికి మూడు నెలల నుంచి ఓ దమ్మిడీకూడా ఇవ్వడంలేదు కదా నిన్నింకా ప్రేమించాలా?''

''ఛీ, అలా అనకు కాత్యాయినీ! నువ్వు నన్ను ప్రేమిస్తున్నావని తెలుసు. ఎందుకిలా బుకాయిస్తావు?''

''ఏమీ ప్రేమించడంలేదు. ఎందుకింకా దాపరికం. మా పొట్టల్ని నింపేవాళ్ళనే మేము ప్రేమిస్తాం? గొంతులో కత్తితో పొడిచి చంపినా, ప్రేమించేందుకు మీరు పెళ్ళిచేసుకున్న పెళ్లాన్ని మాత్రంకాదు. నీవు లేకపోతే నాకు ఇతరాదరువు లేదాయేమిటి? ఎవడు డబ్బిస్తే వాణ్ణే వరిస్తాము. అతన్నే ప్రేమిస్తాము. వెళ్ళు ఇంటికి వెళ్ళు. ఇంత రాత్రిప్పుడు గలాభా చేయకు.''

''కాత్యాయినీ, అంతా ఆఖరేనా?''

''ఇప్పటిదాకానా? చాలారోజుల క్రిందటే ఆఖరయింది. ఇన్ని రోజులదాకా యేమీ చెప్పకుండా యెదురుచూస్తూ, ఓపికపట్టి కూచుని యేమీ చెప్పలేకపోయాను. ఆఖరికి నీఅంత నీవే ఆమాటిప్పుడు తెచ్చిపెట్టావు. కనుక అంతా విప్పి చెప్పాల్సొచ్చింది. నీవు పెద్దమనిషివి కావు. గౌరవ మేమీ లేదు. ఇకనుంచి ఎప్పుడూ

నా దగ్గరకు రాకు. యజమాని తాలూకు డబ్బును దొంగిలించి, జైలుకు వెళ్ళిన రౌడీవి! నౌకరీ చాకరీ యేమీ లేకుండా చేతులు వూపుకుంటూ గస్తీలు పచార్లుకొట్టున్న పెద్దమనిషివి! ఎప్పుడో ఒకప్పుడు సర్వనాశన మయ్యేదానికంటే దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవడం మంచిది, తెలుసా? ఇక ఇక్కడి కెప్పుడూ రావద్దు. తెలుసా?''

హారాన్ చంద్రుడు చాలా సేపటివరకు అక్కడే మాట్లాడకుండా కూచుని, ఆఖరికి తలెత్తి ''బాగానేవుంది. అంతగా ఇష్టం లేకపోతే ఇకమీద ఇక్కడికి రానులే! నీకోసం నేను దొంగనయాను. జైలుకు వెళ్ళాను. నౌకరీ పోగొట్టుకున్నాను. నీకోసం నేను నా పెళ్ళాం బిడ్డల్ని వదిలాను. చివరికి నీవు....'' మాట పూర్తికాకుండా ఆగి, కొంచెం సేపుండి మళ్ళీ ''ఇప్పుడే నా కళ్ళు తెరిపించావు'' అని అన్నాడు.

ఈసారి కాత్యాయిని కూడా కొంచెం కోపంగానే ''నిజంగా నీకళ్ళ పొరలు వూడిపోయేట్లు భగవంతు డెప్పుడు చేస్తాడా? అని చూస్తున్నాను. మేమంతా నీచపు జాతివాళ్ళమే! నీచులమే! ముందు పెళ్ళాం బిడ్డలూ ఇళ్ళూ వాకిళ్ళు, ఆ తరువాత మేమని నాకు తెలుసు! తినడానికి కూడూ, కట్టుకునేందుకు బట్టా, ముందు మానవుడు చూసుకొని బ్రతకడం నేర్చుకుంటేనే, తరువాత షోకులతోపాటు గంజాయీ, సారాయి తెలుసా? నేను నీ వోగు నెప్పుడూ కోరడంలేదు. నీ మంచినే కోరుతున్నాను. ఇక ఇక్కడికి రావద్దు. సారాయి కొట్టులోకి దూరకు. ఇంటికి వెళ్ళి పిల్లాజెల్లలను కాపాడుకో; ఏదయినా నౌకరీ చాకిరీ చేసుకుంటూ, యజ

మాని దయ సంపాదించుకుని, పిల్లా, పాపల పొట్టకోసం రేపటి సంగతి గుర్తుంచుకొని వుండు, డబ్బులు కూడబెట్టు! మనసనేది వుంటే, తరువాత యెప్పుడో ఒకప్పుడు ఇక్కడికికూడా రా!'' అని చెప్పి, మంచంమీదనుంచి లేచి, పెట్టిలోంచి పదిరూపాయల నోటునుతీసి, హారాన్ యెదుటవుంచి, "యిది తీసుకు వెళ్ళు" అని అంది.

"అవసరం లేదు.''

కాత్యాయిని నవ్వి తన చేత్తో హారాన్ గడ్డాన్ని పట్టుకుని ''దీన్ని తీసుకవెళ్ళకుంటే రేపు మీరంతా వుపవాసం చేయాల్సి వస్తుంది" అని అంది.

''యెందుకు''

''ఇంట్లో యేమి లేదుగనుక''

''ఏమీ లేదని నీ కెలా తెలుసు?''

''పిల్లవాడి నోటిదగ్గర ముద్ద లాక్కునివచ్చి పొట్టనింపుకున్నానని అన్నారుకదూ? అప్పుడే మర్చిపోయారా!''

''ఓ!''

''అదేకాదు! నువ్వు చెప్పక పోయినా నాకంతా తెలుసు! నేను మీ ఇంటికి వెళ్ళి స్వయంగా సంగతంతా కనుకున్నాను''

''యెందుకని?''

''ఒకటి. మగవాళ్ళతో సంబంధమున్న ఆడ వాళ్ళకు వాళ్ల స్థితి గతులు తెలుసుకోవాలని కోరిక! రెండోది, అంతా చూస్తూ, వింటూ, నాలుగు వేపులనుంచీ వచ్చే మాటలు గమనించకుండా వుండిపోవడం మా చేత కాదు! మీరు మగవాళ్ళై వుండి

కూడా, స్త్రీలకన్న ఇంగిత జ్ఞానంలేని మూఢులయ్యారు! పెళ్ళాం వుంది. పిల్లలున్నారు, బంధువులున్నారు, స్నేహితులున్నారు. ఒకసారి రెండుసార్లు మోసంచేసికూడా, అంతా మరిచిపోయినట్లు మళ్ళీ సమ్మోళించుకుంటారు. ఇక మాకో, యెవరూ లేరు. ఒకసారిగాని పడిపోతే మళ్ళీ లేవలేము. మేము అకలితో చచ్చిపోతున్నా యెవరూ కనిపించరు. అంతా "యెవరూ లేనివాళ్ళకు భగవంతుడే వున్నాడు" అని నీతి మాటలు చెప్తారే కాని మాకు ఆఖరికి ఆ ఆశ్రయంకూడా లేదు. అందుకని అన్నీ చూస్తూ వింటూ, ఊరికినే కూచుంటే మేము బ్రతగ్గలమా? తెలిసిందా?"

కాత్యాయినికి కూడా కష్టమనిపించింది. ఈ మాటలన్నీ అంటున్నా ఆమె కడుపులో బాధగానేవుంది. కానీ. అదంతా అణచుకుని, హారాన్ చంద్రుని తలను కొంచెం ఆడించి, "నేను చెప్పినదంతా వింటున్నారా? యీ నోటు మీ భార్యచేతికివ్వండి. రెండురోజులైనా మీ ఇంట్లో హాయిగా గడుస్తుంది. మీ దగ్గరమాత్రం వుంచుకోవద్దు వింటున్నారా?" అని అంది.

"ఆఁ"

"చాలా పొద్దుపోయింది. యెక్కడికీ వెళ్ళక యీ రాత్రికి ఇక్కడే పడుకోండి?"

## 6

హాలాద్‌పూర్‌లో వుండేవాళ్ళల్లో కొంతమంది శ్రీసదానంద చక్రవర్తిని 'సదాన్నయ్య, అనీ, మరికొంతమంది 'సదానందుడు

పిచ్చివాడ'నీ, అంటారు అతని తండ్రి అసలైన హిందువు! యింగ్లీషు మ్లేచ్ఛభాష అనీ, యింగ్లీషు చదువుకుంటే ధర్మం నశిస్తుందని అనుకుని కొడుకుకు అతను యింగ్లీషుభాష చెప్పించ లేదు. అసలు చదువుకునే అవసరంకూడా లేదు. పది పన్నెండు యెకరాల పొలము వుండడం మూలాన్ని నౌకరీ చేసే అవసరం కూడాలేదు!

వూరికే చదువుకున్నందున లాభమేముంది?

కొందరు సంస్కృతం చదువుకున్నాడనీ, కొందరు లేదనీ అతన్ని గురించి అనుకుంటుంటారు. ఇంతకూ యేది యెలా వున్నా, అతను పిచ్చివాడని అందరికీ గట్టి నమ్మకం! ఆబాల గోపాలమూ అతను పిచ్చివాడని వప్పుకుంటారు. పొలాల్లో తిరగడం. సమయాసమయం లేకుండా బజార్లలో పాడుతూ ఇంటింటికీ వెళ్ళడం యీ విధంగా రోజులు గడిపేవాడు!

ప్రస్తుతం అతనికి దూరపు బంధువు అయిన ఒక అత్తగారు తప్ప ఇంకెవరూ లేరు అందుకని గ్రామాన్నంతటినీ తనవాళ్ళ నుగా చేసుకున్నాడు. అందరూ అతనికి ఆత్మీయులే! అందరి తలుపులూ అతనికి తెరిచి వుండేవి! సదానందుని తండ్రి కన్య తలిదండ్రులకు చాలా డబ్బుయిచ్చి పెండ్లిచేశాడు! విధివశాత్తు సంవత్సరము తిరక్కముందే ఆ పిల్ల చచ్చిపోయింది. యిప్పటికి ఆరేళ్ళనుంచీ సదానందుడు ఒంటరి జీవితం గడుపుతున్నాడు. యింతడబ్బు తిరిగి ఖర్చుపెట్టడం యిష్టంలేక, రెండోపెళ్ళి చేసుకోలేదు!

ఆ రోజు మూడోజామున బాగా మబ్బు కమ్మింది. అంతా నిశ్చలంగా నిశ్శబ్దంగావుంది. జోరున వర్షం కురిసే సూచనలు కనపడుతున్నాయి.

అత్తగారయిన రాసమణి లలనను పిలిచి, ''ఓ లలనా, ఇంట్లో ఒక చుక్కనీళ్ళయినాలేవు. చప్పున ఒక బిందె నీళ్ళు తీసుకురా!'' అని చెప్పింది.

చంకను బిందె పెట్టుకుని, లలన రేవుకువచ్చి, నీరు నింపుకుని మెల్లగా అడుగులు వేస్తూంటే వర్షం సాగింది. లలన తొందరగా నడుస్తోంది!

ఆ దారిలోనే సదానందుని యిల్లుంది. దారిప్రక్కనున్న వరండాలో కూచుని సదానందుడు పాటపాడుకుంటున్నాడు. లలనను చూసి పాట ఆపి ''తడుస్తున్నావెందుకు లలనా?'' అని అడిగాడు.

లలన నవ్వుతూ ''నీవు పాటెందుకు ఆపావు?'' అని అన్నది.

''నాపాట పూర్తయింది.''

తరువాత కొంచెంసేపు వూరుకుని మళ్ళీ ''ఊరికే తడుస్తావెందుకు? ఇక్కడ కొంచెంసేపు నిలుచుని వెళ్ళు'' అని పిలిచాడు.

లలన వరండాలోకి వచ్చి నిలుచుంది. సదానందుడు కొంచెంసేపు ఆమె ముఖంలోకి చూసి ''నిలుచోవద్దులే! ఇంటికివెళ్ళు'' అని అన్నాడు.

''యెందుక నేమిటి?''

''అత్తయ్య యింట్లో లేదు, వర్షమింకా యెక్కువైతే యెలా వెళ్తావు? తడుస్తావు, తొందరగా వెళ్ళు.''

లలన ఆలోచించి చూసింది. సదానందుడు చెప్పింది నిజమే! రెండడుగులు ముందుకువేసి, మళ్ళీ వరండాలోకివచ్చి నిలుచుంది.

"మళ్ళీ వచ్చావేం లలనా?"

"రాత్రిపూట నాకు జ్వరం వస్తూవుంది. యీ వర్షంలో ఇంకా తడుసుకుంటూ వెళ్తే, జ్వరమింకా యెక్కువవుతుందేమో?"

"అయితే వెళ్ళకు. నిజమే! ఇక్కడేవుండు."

సదానందుడు మళ్ళీ పాటపాడి ఆపాడు. లలన బిందె క్రింద పెట్టి వింటూ కూచున్నదల్లా పాట ఆపడంతోనే "ఆపావేం?" అని అడిగింది.

"ఇక పాడను."

"యేం."

"ఆతరువాత చరణం గుర్తులేదు."

"మరి యెందుకని మొదలు పెట్టావు?"

"నే నలానే పాడతాను" తరువాత ఆకాశంవేపు చూచి "మేఘాల్లో కమలం పుట్టుతుందట! నువ్వెప్పుడన్నా చూశావా?" అని అడిగాడు.

"లేదే! నువ్వు చూశావా యేం?"

"ఆ, చూశాను."

"యెప్పుడు చూశావు?"

"అప్పుడప్పుడు చూస్తూనేవుంటాను. ఇంకా మేఘాలు ఒకదానొ్నకటి కలుసుకున్నప్పుడు చూస్తుంటాను."

సదానందుని గంభీరమైన ముఖాన్ని చూచి లలనకు నవ్వు వచ్చింది. గుడ్డతో నోరుమూసుకుని నవ్వాపుకుంటూ "అలా జరుగుతుందా?" అని అడిగింది.

"యెందుకు జరగదు? కమలమనేది నీళ్ళున్న చోటనేపుట్టేది. మేఘాల్లో నీళ్ళకేమీ కొదవలేదు. అటువంటప్పుడు అక్కడ కమల మెందుకు పుట్టదు?"

"మట్టిలేకుండా కమలము యెక్కడన్నా నీళ్ళలో పుట్తుందా?"

సదానందుడు చాలాసేపు ఆమె ముఖంలోకి చూసి, "అవును. అందుకనే యెండిపోతూ వుంటుంది" అని అన్నాడు.

లలన మాట్లాడలేదు. ప్రతిరోజూ యిటువంటి పనికిమాలిన ప్రసంగాలు యెన్నో చేస్తూవుండడం అందరకూ తెలుసు!

కొంచెంసేపయాక సదానందుడు "లలనా! శారద మీ యింటికి రావడంలేదూ?" అని అడిగాడు.

లలన రెండో ప్రక్కకు ముఖం త్రిప్పుకుంది. తన ముఖాన్ని అతనికి చూపించదలచుకోలేదు. సదానందుడు మళ్ళీ "రావడం లేదూ?" అని అడిగాడు.

"లేదు"

"యేం?"

"తెలియదు."

సదానందుడు పాట మొదలుపెట్టాడు.

పాట ఆగిపోయింది. వర్షం యింకా యెక్కువయింది, లలన బిందె ఎత్తుకుని నడుమున పెట్టుకుంది. సదానందుడు చూసి "యెక్కడి కెళ్తున్నావు లలనా?" అని అడిగాడు.

"ఇంటికి"

"వర్షంలో వెళ్తే, జ్వరం యెక్కువవుతుందేమో?"

"యేం చేయను?"

లలన వెళ్ళాక సదానందుడు మళ్ళీ పాట మొదలుపెట్టాడు.

## 7

హారాన్‌చంద్రుడు, భార్యచేతిలో ఒక్కసారి పదిరూపాయలు పెటినప్పుడు ఆమె ముఖంమీద నవ్వు కనుపించినా పైకి నవ్వలేక

పోయింది. కాని, ముఖం తెల్లగా చేసుకుని ''ఈ డబ్బెక్కణ్ణుంచి తెచ్చారు?'' అని అడిగింది,

డబ్బు యిచ్చేప్పుడుకూడా అతని ముఖం మాడివుంది. కొంచెంసేపు నిశ్శబ్దంగా వుండి "సుభదా! నేను యీ డబ్బును దొంగతనంచేసి తెచ్చానని అనుకుంటున్నావా?'' అని అడిగాడు.

సుభద క్రుంగిపోయింది. యీ విషయం ఆపాపి మనసులో ఒకసారి మెదిలింది కామాలు! కాని, నోరువిప్పి ఆమె అడగలేదు. అసలు ఆయన అలా దొంగతనంచేసి తెచ్చినట్లయితే అవి తీసుకోవాలి? అన్నం నీళ్ళూ లేకపోయినా తను చచ్చిపోగలదు; కాని దొంగడబ్బంటే ఆమెకు యిష్టంలేదు! మరి మనవాళ్ళందరి మాట? ప్రాణాలకంటే ప్రియమైన పిల్లలూ? యీ విషయాన్ని తర్కించడం యిక మంచిదికాదని సుభద ఆపదిరూకల్ని పెట్టెలో భద్రపరిచింది.

కొంతసుఖంగా, స్వచ్ఛందంగా రోజులు గడుస్తున్నాయ్. హారాన్‌ముఖర్జీ యిప్పుడు హాలాద్‌పూర్‌లో తరచుగా కనుపించడంలేదు. యింటికి వచ్చాక రాసమణి ''నువ్వు పగలంతా యెక్కడ వుంటున్నావురా?'' అని అడిగితే,

"నాకు యెన్నో పనులుంటాయ్! నౌకరీ దేవుల్లాడుకుంటూ తిరుగుతున్నాను'' అని మాత్రం చెప్పేవాడు.

పూర్వంలా యిప్పుడు డబ్బుకూడా అడగడంలేనందున సుభద కూడా నిజమనుకునేది. రేపిస్తానని ఇప్పుడు నాలుగు అణాలు కావాలని అడగడంలేదు.

పగలంతా తిండీతిప్పలు లేకుండా, కాళ్ళరిగేటట్లు హారాన్ నౌకరీకోసం తిరిగేవాడు. యెంతోమంది దగ్గరకువెళ్లి తన కష్టాన్ని వినిపించాడు. అడితీ మొదలు ఆఫీసు వరకూ వెళ్లి లెక్కలు చూసే పనికి తనను పెట్టుకొండని ప్రతిమలాడినా యెక్కడా అతనికి పనిదొరకలేదు. యెంతోమంది అతనిబ్రతుకు బాధల్ని విని నమ్మలేకపోయారు.

సాయంకాలంపూట హారాన్ యింటికివచ్చాక "యివాళ యెక్కడభోజనం చేసారండీ?" అని సుభద అడిగింది.

. నాకేం తక్కువ! పల్లెటూళ్ళో నన్నెరగని వాళ్ళెవరున్నారు?"

సుభద ఇంకేమీ మాట్లాడకుండా వూరుకునేది. రెండుమూడు రోజుల్లో మిగతా డబ్బంతా అయిపోతుంది నోరువిప్పి ఆమె యీ సంగతి భర్తకు చెప్పేదికాదు. యెవరితో చెప్పడానికి కూడా ఆమెకు యిష్టముండేదికాదు. మనసులోని విషయాన్ని మనసులోనే యిముడ్చుకుని మధనపడేది.

మూడు రోజులయాక రాత్రిపూట అలసిపోయిన భర్తగారి పాదాలు వత్తుతూ, మనసులోనే చాలాసేపు తర్కవితర్కాలు చేసుకుని నోరువిప్పి "యింకేమీలేదు. డబ్బంతా ఖర్చయింది" అనిమాత్రం అంది.

హారాన్ కండ్లుమూసుకుని తనకేమీ బాధలేనట్టు "పదిరూపాయలు యింకెంత కాలమని వస్తాయ్ మరి?" అని అన్నాడు.

ఇంకేమీ మాటలు జరగలేదు. ఆరాత్రి సుభద "రేపు ఎలా జరుగుతుంది?" అని అడుగుదామని ఆలోచించింది. కాని తనకు తెలియకుండానే తనుయేదో అపరాధం చేస్తున్నానని ఊరుకుంది.

రెండోరోజు ఉదయాన్నే హారాన్ వెళ్ళిపోయాడు. లలన తన నిత్యకృత్యాల్లో నిమగ్న అయింది. రాసమణి రోజూ వలె మట్టి శివలింగంచేసి, పూజచేయడానికి కూచుంది. ఒక్క సుభద మాత్రం కొంచెంసేపు అక్కడ, కొంచెంసేపు ఇక్కడ నిలుచుంటూ తిరుగుతూవుంది!

ఎనిమిది గంటలయాక లలనవచ్చి "అమ్మా. నీ వింకా స్నానానికి వెళ్ళలేదేం? యెంత ఆలస్యమయిందో తెలుసా?" అంది.

"అవును వెడతాను"

కొంచెంసేపయాక మళ్ళీ లలనవచ్చి చూచింది. సుభద ముందు ఎక్కడైతే ఆమెకు కనుబడిందో— అక్కణ్ణుంచి ఓ అడుగయినా కదలలేదు.

"అసలు సంగతేమిటమ్మా?"

"ఏమీ లేదు."

"అయితే, మరి ఇంకా అలానే కూచున్నావేం?"

"మరి యేం జేయను?"

"ఏం....? స్నానంచేసి వంటచేయవా యేం?"

నీళ్ళతోనిండిన తన రెండుకళ్ళనూ కుమార్తెకు చూపుతూ "యివాళ యేమీ లేదు" అని అంది.

"ఏమీలేదు....అంటే?"

"ఏమీలేదు. ఇంట్లో ఒక్కగింజ బియ్యమన్నాలేవు."

"అయితే యెలా అమ్మా? పిల్లలేమి తింటారు?"

"భగవంతుడికే తెలియాలి" అని కొంచెంసేపు ఊరుకుని సుభద "లలనా! ఒకసారి నీ బిందు అత్తయ్య దగ్గరకు వెళ్ళొస్తావా?" అని అడిగింది.

"ఎందుకూ ?"

''ఏమయినా ఇస్తుందేమో.''

లలన వెళ్ళాక సుభద కళ్ళవెంట నీళ్ళు కారినై ! ఇలా యెప్పుడూ ఆమె తన కూతుర్ని ఒకరింటికి పంపి ఎరుగదు. వుండి వుండి, యీ విషయం ఆమె కడుపును దేవినట్లు చేసింది.

చెంపకు చేయిపెట్టుకుని సుభద పన్నెండు గంటలదాకా అలానే కూచుంది. ఆ సమయంలోనే రెండోపిల్ల చలనామయి వచ్చి "అన్నం పెట్టమ్మా ?" అని అడిగింది.

ఆ పిల్ల ముఖాన్ని చూస్తూ సుభద యేమీ మాట్లాడలేదు.

''అన్నం పెట్టమ్మా ఆకలవుతోంది''

ఆమె జవాబు చెప్పలేదు.

''అన్నం ఇంకా వండలేదా యేం ?''

"ఎందుకు వండలేదు? నిద్రపోయి నువ్వు చాలా ఆలస్యంగా లేచావా అమ్మా ?'' అని యేమాలోచించిందో యేమో వంటింటిలోకి వెళ్లి విస్మయంతో అరుస్తూ ''ఇంకా పొయిలో నిప్పయినా రాజేయలేదేమే ?'' అని అంది.

''ఇప్పుడే పొయ్యి రాజేస్తాను.''

''లేదు.''

చలన బైటకువచ్చి తల్లిముఖంచూసి నిలబడిపోయింది. మళ్ళీ దగ్గర కూచుని ''అమ్మా ఇంతసేపయినా. వంటెందుకు చేయలేదే ?'' అని అడిగింది.

"చేస్తానమ్మా తొందరగానే చేస్తాను."

"అమ్మా ! మరి నీవిలా అవుతున్నావేమమ్మా ?''

ఆసమయానే గదిలోంచి, జబ్బులోవున్న మాధవుడు 'అమ్మా' అని పిలిచినట్లు వినిపించింది.

సుభద గాభరాతో లేచింది.

లలనకూడా లేచి, "నువ్వు కూర్చో. నేను మాధవుడి దగ్గరకు వెళతాను" అని అంది.

"సరే, నువ్వు వెళ్ళమ్మా!"

అటు ఇంట్లోంచి బైటకు వెళ్ళిన లలన, భవతరణ గంగోపాధ్యాయుని ఇంటికి వెళ్లింది. అయినా బిందు అక్కడలేదు. గడచిన రాత్రి ఆమె తన అత్తింటికి వెళ్ళినట్లు తెలిసింది. ఏదో అర్జంటుగా వెళ్ళవలసి వచ్చి వెళ్ళింది. కాని, లేకుంటే సుభదను కలుసుకోకుండా వెళ్ళేదికాదు.

ముఖాన్ని వేలేసుకుని బైటకువచ్చింది. కాళ్లు ఇంటివేపు రావడానికి వప్పుకోలేదు. చాలాసేపు ఓ చెట్టుక్రింద నిలుచుని యేమాలోచించిందో యేమో రెండో దారిపట్టి చిన్నగా గంగానదివేపు నడిచింది.

ఆ దగ్గరలోనే సదానందుని ఇల్లు. బయట ఓ పిట్టను పట్టుకుని అతను యేవేవో పేర్లతో పిలుస్తున్నాడు. లలన అక్కడకు వచ్చి నిలుచుంది. సదానందుడు ఆమెను చూడడంతోటే "లలనా నీవేనా?" అని అన్నాడు.

"అత్త ఇంట్లో వుందా?"

"లేదు. ఇప్పు డిప్పుడే యెక్కడికో వెళ్లింది."

లలన ఒక అడుగు వెనక్కువేసి నిలుచుంది. సదానందుడు పిట్టను వదిలేసి లలన ముఖాన్ని చూస్తూ "అత్తతో యేమయినా పనుందా యేం?" అని అడిగాడు.

"అవును."

"ఆమె ఇంట్లో లేదు. నాతో చెప్పకూడదూ?"

సదానందుడు యీమాట అడగ్గానే ఆమె బుగ్గలు సిగ్గుతో యెరుపెక్కినయ్! ఇంట్లో యేమీలేదని వచ్చానంటే. ఛీ ఛీ ఇలా అడగడం మంచిదికాదు. ఒకరోజు అన్నం లేకపోతే గడవదా యేం? మరి పిల్లలో? ఒకనాడు సుభదక్కూడా యీ విషయమే మనసులో అనిపించింది. ఇప్పుడు లలనకూ అదే విషయం క్లిష్ట సమస్యయి కూచుంది. అయినా ఆమె నోరు విప్పి యేమీ చెప్పలేకపోయింది. సదానందుడు ఆమె మనసులో భావాల్ని కనిపెట్టి, నవ్వుతూ ఆమెచేయి పట్టుకున్నాడు. ఆతను పిచ్చివాడు.

పిచ్చివాడనీ, మతి స్థిరంగా వుండదనీ అందరికీ తెలుసు. ఇతరులు చేయలేని పని అతను అమాంతంగా చేసేవాడు. ఇతరులు సంకోచించే దాన్ని అతను ప్రేమపూర్వకంగా ఆహ్వానిస్తాడు. ఎవరికీ అందంగా కనుపించనిది, అతనికి అందంగా అపురూపంగా కనిపిస్తుంది. అందుకని స్వచ్ఛందతా పూర్వకంగా ముందుకు వచ్చి లలన చేయి పట్టుకున్నాడు.

నవ్వుతూ నవ్వుతూ "ఇవాళ లలన తన సదానందన్నయ్య దగ్గర సిగ్గుపడుతోందని తెలుస్తూవుంది. పిచ్చివాడిముందు నీకు సిగ్గెందుకు?" అని అడిగాడు.

లలన తలవంచుకుని కన్నీళ్ళు తుడుచుకుని బొంగురు గొంతుకతో "ఒక రూపాయి కావాలి ఇస్తావా?" అని అడిగింది.

"ఇంతేనా? ఈ మాటనేనా నీ సదానందన్నయ్యకు చెప్పకూడనిది? అయినా రూపాయి యేంచేస్తావు?"

"నాన్నగారు ఇంట్లో లేరు."

సదానందుడు ఇంట్లోంచి ఒకటికి అయిదురూపాయలు తెచ్చి లలన చేతిలోపెట్టి "మంచివాళ్ళ ముందు సిగ్గుపడకూడదమ్మా? పిచ్చివాడి యెదుట సిగ్గుపడతారా?" అని కొంచెం చిన్నగా నవ్వి "ఏదయినా అవుసర ముంటే వచ్చి ముందే యీ పిచ్చివాడితో చెప్పు. చెపుతావా?" అని అడిగాడు.

చేతిలోని రూపాయల్ని చూసి "ఇన్నిరూపాయ లెందుకు?" అని లలన అంది.

"ఉంచుదూ! అవే పనికివస్తాయ్."

"అయినా ఇన్ని రూపాయలు మా కవసరంలేదు."

ఆమె డబ్బు తిరిగి ఇచ్చేస్తూంటే సదానందుడు ఆమె చేతిని మళ్ళీ పట్టుకుని "ఛీ! చిన్నపిల్ల చేష్టలు చేయకు. అవసరం లేకపోతే, ఇంకోరోజు తెచ్చి ఇవ్వు. ఈ సంగతి యెవరికీ చెప్పకు యెవరికయినా చెప్పదలచుకుంటే సదానందన్నయ్య పిచ్చివాడు, దమ్మిడీ లనుకుని రూపాయలు దానం చేశా డని చెప్పు" అని అన్నాడు.

పగలంతా గడిచిపోయింది. అందరూ అన్నం తిన్నారు. కాని, సుభద నీళ్లుకూడా ముట్టుకోలేదు. రాసమణి యెన్నో చెప్పింది. లలన యెంతో బ్రతిమిలాడింది. అయినప్పటికీ ఆమె తినలేదు.

చీకటి పడబోతూవుండగా హారాన్ సంస్కారంలేని జుట్టుతో మోకాళ్ళవరకూ మట్టి కొట్టుకుని ఇంట్లోకి వచ్చాడు. అతని కండువా చెంగున రెండుశేర్ల బియ్యమూ రెండో అంచున

కొంచెం పప్పూ, వుప్పూ, వుల్లిగడ్డలూ అన్నీ యేమిటేమిటో ముడివేసి వున్నాయ్. ఒక కుండతెచ్చి అవన్నీ విప్పి అందులో పోశాడు. సుభద యేడ్చింది. సన్నాలు, లావులూ, అన్ని రక రకాల బియ్యం కలిసి వున్నాయ్. కుటుంబ సంరక్షణ కోసం ముష్టెత్తి తెచ్చాడని గ్రహించ డానికి సుభదకు యెక్కువసేపు పట్టలేదు.

# 8

కొంచెం సేపటికి చీకటి పడుతుందనగా, మాధవుడు "పెద్దక్కాయ్! ఇక నాకు నయమవదేమో?" అని అన్నాడు.

లలన ప్రేమపూర్వకంగా తమ్ముని తల నిమురుతూ "యెందుకు నయమవదు తమ్ముడూ? రెండురోజుల్లో నయమవుతుంది" అని అన్నది.

"ఇలాంటివి యెన్నోరోజులు వెళ్ళిపోయాయి.........యేమీ నయం కాలేదు"

"ఈసారి నయమవుతుందిగా!"

"సరే, నయంకాకపోతే——?"

"తప్పకుండా నయమవుతుంది నాయనా!"

"ఒకవేళ నయంకాకుంటే?"

పుల్లల్లాంటి అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని, కొంచెం గంభీరంగా "ఛీ....ఛీ....అలాంటి మాటలు అనగూడదు" అన్నది.

మాధవుడు ఇంకేమీ మాట్లాడలేదు.

కొంచెంసేపయాక లలన "మధూ! యేమయినా తింటావా?" అని అడిగింది.

"వద్దు"

మందు తాగించే సమయాన ఓ చంచా మందును గ్లాసులో పోసి "త్రాగు" అని అంది.

నేను త్రాగనని మాధవుడు మోశికెత్తాడు.

"ఛీ: పాడుచేయకూడదమ్మా....గబుక్కున త్రాగు"

మాధవుడు గ్లాసు చేత్తో పట్టుకుని మందు క్రిందపోశాడు. ఆమెకు, కోపం ఆశ్చర్యం కలిగి "ఇదేంపని మధూ?" అని అడిగింది.

"ఇక నేను మందు త్రాగను"

"యేం—?"

"వృత్తిత్తి మందెందుకు? నయంకావడంలేదు. ఇంకా మందెందుకు?"

"నయంకాదని యెవరు చెప్పారు?"

మాధవుడు మాట్లాడలేదు.

లలన అతని దగ్గర కూచుని, చాలా నెమ్మదిగా "మాధవ్! నా మాట వినవూ?" అని లాలించి అడిగింది,

"ఎవరూ నామాట విననప్పుడు, నేను వాళ్ళమాటెందుకు వినాలి?"

"నీమాట వినని దెవరమ్మా—?"

"ఎవరు వింటున్నారేం? నే నేదన్నా అడిగితే అమ్మకు కోపం వస్తుంది. నాన్న కోప్పడతాడు. అత్త మాటాడనన్నా

మాట్లాడదు. నువ్వు కూడా కోపం తెచ్చుకుంటావాయె. అటువంటప్పుడు ఒకరిమాట నే నెందుకు వినాలి?" అంటుంటే మాధవుడికి కళ్ళల్లో నీరు తిరిగింది.

వాటిని తుడిచి లలన "నేనిక వింటానులే మరి" అని అంది.

"అయితే నాకు నయమనేది లేకుండా నే నెప్పుడూ ఇలానే పడివుండాలా చెప్పు?"

"కాదు నాన్నా! ఇంక కొద్దిరోజులుదాకానే!"

"అయితే——?"

లలన పెదిమలు కంపించినయ్! యేమీ మాట్లాడలేకపోయి, ఊరికనే చూస్తూ కూచుంది.

మాధవుడు ఆమె ముఖాన్ని కొంచెంసేపు చూసి, "పెద్దక్కాయ్! మన చిన్న తమ్ముడు యదు. జబ్బుపడిం తర్వాత వాడికి నయంకాలేదు. అంతే. చచ్చిపోయాడు. నాన్న యేడ్చాడు. అమ్మ యేడ్చింది. నీవు యేడ్చావు. అత్త యేడ్చింది. అందరూ యేడ్చారు. అమ్మ ఇప్పటికీ యేడుస్తూనే వుంటుంది. అయినా, వాడు తిరిగి రాలేదు...." అని అన్నాడు.

లలన తన రెండు చేతులతో ముఖం కప్పుకుంది.

మాధవుడు చాలా సేపు ఊరుకుని, మళ్ళీ "చచ్చిపోతే ఏమవుతుందో చెప్పక్కాయ్!" అని అడిగాడు.

లలన తన ముఖం దాచుకునే "యేమీకాదు. అందరూ ఏడుస్తారు అంతే!" అని అంది.

ఆమె యేడుస్తున్నట్టుంది.

మాధవుడు గ్రహించాడో లేదో కానీ, "అక్కాయ్ చచ్చిపోయాక యెక్కడికి కెళ్తామే?" అని అడిగాడు.

పైకి చూస్తూ లలన "అక్కడికి, ఆకాశంలోకి" అని అంది.

"ఆకాశంలోకా ? అక్కడ నేనెవరిదగ్గరుంటాను ?"

లలన తనవేపుకు చూపిస్తూ "నాదగ్గర" అని అంది.

మాధవుడు సంతోషించాడు. నవ్వుతూ "అయితే చాలా మంచిదక్కాయ్: సరే అక్కడ మనకు ఇల్లుంటుందా ?" అని అడిగాడు.

"వుంటుంది"

"అయితే మరీ మంచిది. అక్కడ మనమిద్దరం హాయిగా వుంటాము కదూ ? యేమంటావు ?"

"అవును"

"మరి మనకు మంచి భోజనం దొరుకుతుందా ?"

"ఆ"

"చాలా ఆపిల్‌పండ్లుకూడా దొరుకుతాయిగదూ ?"

"ఆ ?"

మాధవుడు మనసారనవ్వి, కంబళి కప్పుకున్నాడు. కాని వెంటనే మళ్ళీ కంబళితీసి "అక్కాయ్ యెప్పుడు వెళ్దాం ?" అని అడిగాడు.

"మాధవ్ .... ?"

"ఏమిటక్కాయ్ ?"

"అమ్మని వదిలిపెట్టి నీ వెక్కడి కెళ్తావు ?"

"ఏం ? అమ్మకూడా మనతో వస్తుంది"

"ఒకవేళ రాకపోతే"

"నేను పిలుచుక వస్తాను"

"అయితేఅక్కాయ్, అమ్మ యెప్పటికీ రాదా?"

"వస్తుంది కాని, చాలారోజులు పోయాక"

"మంచిదేగా! అయితే మనం ముందే వెళ్దాం! అమ్మ తరువాత వస్తుంది"

కొంచెంసేపు వున్నాకమళ్ళీ "అమ్మను అడగనా అక్కాయ్?" అని అడిగాడు.

"వద్దు. అమ్మను అడిగినట్లయితే ఆమెరాదు సరిగదా నన్ను కూడా రానీయదు. తెలుసా?"

"అలాయితే అడగను. నువ్వు మందిచ్చి అన్నానికి వెళ్లు. నేను తాగి నిద్రపోతాను."

మందు త్రాగి బత్తాయి తిని మంచినీళ్లు త్రాగి మాధవుడు సంతోషంగా కంబళి కప్పుకొని తనూ, అక్కా వెళ్ళే చోటును గురించి సుఖస్వప్నాలు కంటూ అలానే నిద్రపోయాడు.

ఆరాత్రి రాసమణి, తల్లీ, చెల్లీ ఎవరు పిలిచినా లలన "తలనొప్పి నన్నెవరూ పిలవకండి. నేను లేవలేను" అని చెప్పి తలుపు తీయలేదు.

రెండో రోజునుంచే మాధవునిలో మార్పుకనిపించింది. "అది తినను. ఇదితింటాను అది త్రాగను, ఇది త్రాగుతాను" అనే మొండి పట్టుదల తగ్గిపోయింది. తల్లివచ్చి "యేమయినా తింటావా మధూ?" అని అడిగితే "తే" అనేవాడు.

"ఏమివ్వమంటావు?"

"ఏదివుంటే అది"

ఒకవేళ పెద్దక్కవచ్చి కూచుంటే. ఇక చెప్పేది యేముంది ఇద్దరూ ఏమిటేమిటో గుసగుసల మంతనాలు ఆడుకునేవారు. యెవరైనా వచ్చే అలికిడి వినబడేసరికి గప్ చిప్ అంతే!

ప్రస్తుతం హారాన్ ఇంట్లో అంత కష్టంగాలేదు. యేదయినా కొరవగా కనపడితే లలన ఒకటీ రెండు రూపాయలిచ్చేది. ఈ డబ్బెక్కడిదో సుభద్రకు తెలుసు. రాసమణి, హారాన్ యెక్కణ్ణుంచైనా తెస్తున్నాడని అనుకునేది. హారాన్ ఆలోచించేందుకు యేముంది? యెక్కణ్ణుంచైతే వస్తుందో, అక్కణ్ణుంచే ఇప్పుడు కూడా వస్తుంది. నేనెక్కణ్ణుంచి తేగలను అని అనుకునేవాడు. అతనికి అప్పుడప్పుడు సారాదుకాణం గుర్తుకొచ్చేది. కాని, మధ్యలో భయంవేసేది. యేది యెలావున్నా కడుపునిండా అన్నం మాత్రం దొరుకుతూవుంది. ఇక సారాయికోసం మనసెందుకు పాడుచేసుకోవాలి? అని అనుకునేవాడు.

కొన్ని రోజులయాక సదానందుడి అత్త "నాయనా నన్నో సారి కాశీకి తీసుకవెళ్ళు. ఎప్పుడు యీ ప్రాణాలు ఎగిరిపో తాయో యేమో తెలవదు. ఏవిధంగానైనా సరే, యీ గుక్కెడు ప్రాణాలు పోకముందే ఓసారి కాశీవెళ్ళి విశ్వేశ్వరుని దర్శించి చస్తాను" అని సణగడం ప్రారంభించింది.

ఆమెకు వ్యతిరేకంగా సదానందు డెప్పుడూ మాట్లాడి ఎరు గడు. అందుకని ఒకటి రెండు రోజుల్లోనే కాశీకి వెళ్ళాలని నిశ్చయించుకొని, ఆ రోజు వెళతామనగా సాయంకాలం "లలనా, లలనా" అంటూ సదానందుడు పిలుస్తూ పైకి వెళ్ళాడు. సదానం దుని చూసి లలన లేచి నిలుచుంది.

గుడ్డతో కట్టుకువచ్చిన యాభై రూపాయల మూటను విప్పి "మేము కాశీ వెళ్ళాలనుకున్నాము. ఎప్పుడు తిరిగివస్తామో యేమోచెప్పలేను. అవసరంవస్తే ఈ డబ్బు ఖర్చుపెట్టుకో!" అని ఇస్తూ సదానందుడు అన్నాడు.

లలన చకితురాలై "ఇన్ని రూపాయలా?" అని అడిగింది.

"ఎన్ని రూపాయలేం? యాభై రూపాయలు ఓ పెద్ద మొత్తమా యేమిటి? చూడడానికి, వినడానికి నిజంగా ఓ పెద్ద మొత్తమే కావచ్చు. కానీ, ఖర్చుపెట్టడానికి మాత్రం యేమంత ఎక్కువకాదు."

"అయినా ఇన్ని రూపాయలా....?"

మాట పూర్తికాకముందే సదానందుడు క్రిందికి దిగివచ్చి సుభద వంట చేస్తున్న దగ్గరకు వెళ్ళి "పిన్నీ! ఇవాళ మేము కాశీ వెళ్తున్నాం" అని చెప్పాడు.

"ఎప్పుడు తిరిగొస్తారేం?".

"ఆ సంగతి ఇప్పుడే ఎలా చెప్పను? అత్తయ్య కాశీ అంతా చూసిం తర్వాతగాని రానంటోంది."

"సరే నాయనా! జాగ్రత్తగా వెళ్ళండి."

సదానందుడు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

రెండోనాడు లలన సగండబ్బును తన దగ్గర వుంచుకుని మిగిలినదాన్ని తల్లికిస్తూ "అమ్మా! సదానయ్య వెళ్ళేప్పుడు ఈ డబ్బును ఇచ్చి వెళ్ళాడు." అని చెప్పింది.

సుభద కండ్లు పెద్దవిగాచేసి వాటిని లెక్కపెట్టి కూతురువేపు చూస్తూ "సదానందుడు పూర్వజన్మలో మనకు దగ్గర బంధువేమోనని అనుకుంటాను" అని అంది.

"అలానే అనిపిస్తుంది,"

"ఇంత డబ్బును ఎవరయినా ఇస్తారా మరి?"

లలన యేమీ జవాబు చెప్పలేదు.

"లలనా! సదానందుడు పిచ్చివాడేనా?

"ఎందుకు?"

"లేకపోతే, ఇంతడబ్బు ఎవరయినా ఊరికినే ఇస్తారా?"

"కష్టాల్లో ఆదరించే వాళ్ళంతా పిచ్చివాళ్ళా అమ్మా!"

"అయితే అందరూ అతన్ని పిచ్చివాడని అంటారేం?"

"లోకువుగా వుండేవాళ్ళని, మెత్తని వాళ్ళని అలానే అంటారు."

ప్రస్తుతం హారాన్ ముఖర్జీ పరివారం ఇప్పుడు కష్టపడడం లేదు. కూటికీ గుడ్డకూ బాగానే జరుగుతూవుంది. వీధి వీధంతా చర్చకు దిగారు.

"హారాన్ నందిబాబును లూఠీచేసి డబ్బు నిలువచేసాడనీ."

"ఇప్పుడు పెద్దవాడయాడనీ."

"కాదండీ యేమీలేదు. పాపం ఒకపూటకూడా పొయ్యిరాజేసిన పాపాన పోలేదనీ."

ఇటువంటివి ఎన్నో వాద ప్రతివాదాలు రోజూ జరిగేవి.

ఒకరోజు మధ్యాహ్నం హఠాత్తుగా క్రిష్ణప్రియ వాళ్ళింటికి వచ్చింది.

"సుభద్రా యేంచేస్తున్నావు? అన్నం గిన్నం అయిందా?" అని అడిగింది.

"ఆఁ, ఇప్పుడే అయింది."

క్రిష్ణప్రియ తమలపాకులూ, పొగాకూ నమిలి ఊస్తూ, "అమ్మామ్! ప్రస్తుతం హారాన్ యేం చేస్తున్నాడో" అని అడిగింది.

"ఏంచేస్తారు? నౌకరీకోసం తిరుగుతున్నారు."

"ఇల్లెలాగ గడుస్తోంది మరి?"

సుభద్ర జవాబు చెప్పలేదు.

"అందరూ హారాన్, నందిబాబు దగ్గర లూటీచేసి చాలా డబ్బు సంపాదించి పెద్దవాడయాడనీ, తిండి తిప్పలకు విచార మేమిటనీ, అనుకుంటున్నారు. కాని, నా కన్నీ తెలుసు కాబట్టి, ఇల్లెలాగడుస్తోందని అడుగుతున్నాను" అని అంది.

"అలానే జరుగుతోంది."

"బ్రాహ్మణపాడ్ ముండాకొడుకే దీని కంతటికీ కారణం? వాడిని చంపినా పాపం పోదు."

"అక్కాయ్ అన్నంతిని వచ్చావా?"

"ఆఁ, తిన్నాను. ఆ ఛండాలుడే మిమ్మల్నిలా నాశనం చేసింది. హారాన్ వట్టి అమాయకుడు, పిచ్చివాడు. మూడువేల రూపాయలు దొంగతనంచేసి కొద్దోగొప్పో తన భార్యకు ఇచ్చి వుండాలట!"

"అక్కాయ్ ఇవాళ యేంచేశావు?"

"ఏం చేయ మంటావు చెల్లీ? లేచే టప్పటికి ఆలస్యమైంది. ఇంకేం చేయను. ఏదో పాయసం వండాను....ఆ ముండా కొడుకుకి పరలోక విషయమై, ఏమీ ఆలోచన లేదుకదూ? అయినా భగవంతుడు లేడూ? బ్రాహ్మణుని నాశనంచేసి, నీవంటి పతివ్రతలకు కళ్ళంట నీరు తెప్పించినందుకు భగవంతుడు దండించడూ? అలానే చూస్తూవుండు. నా మాట నిజమో, కాదో తెలుస్తుంది!"

మధ్యలోనే సుభద ఆపి "అక్కాయ్! బిందు తొందరగా అత్తగారింటికి ఎందుకు వెళ్ళింది?" అని అడిగింది.

"ఆమె మామగారికి, రాత్రికి రాత్రే సంధిలక్షణాలు కనుపిస్తే వెళ్ళింది. సరేగాని, యీ ఇంటి వ్యవహారం నీ వెలా నిర్వర్తిస్తున్నావు?"

"నేనేం నిర్వర్తిస్తానక్కాయ్! భగవంతుడు ఎలారాస్తే అలానే...."

కృష్ణప్రియ ఒక నిట్టూర్పు విడిచి "అలానేలే? ఏం చేస్తాం మనచేతిలో యేముంది? సరేగాని, నీ చిన్నపిల్ల విషయం గుర్తుకొస్తుంటే నా కెలానోవుంది....పిల్ల పెద్దదవుతూవుంది. ఇక తొందరగా పెళ్ళిచేయకుంటే నలుగురూ నాలుగు విధాల అనుకుంటారు. ఇంతకూ ఆ విషయ మేమన్నా ఆలోచించావా?" అని అడిగింది.

సుభద నల్లగా ముఖం చేసుకుని నిట్టూర్పు విడుస్తున్న సమయాన్నే లలన అక్కడికి వచ్చింది. చలనను గురించి వాళ్ళు అనుకునే మాటలు ఆమె చెవుల్లో దూరాయ్! మంచి రోజులు కానీ, చెడురోజులు కానీ, హిందూ కుటుంబములో ఆడపిల్లలకు వివాహము చేయకుండా వుంచలేరు.

# 9

శుక్లపక్షపు ఏకాదశి, సగంరాత్రి గడిచింది. భాగీరథీతీరపు వృక్షఛాయల్లో శారదాచరణుడు ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్లు చాల సేపటినుంచి కూచున్నాడు.

శారదా చరణుడు హాలాద్‌పురంలోని ధనికుని కొడుకు. ఏం చదివాడో తెలియదు. కాని జ్ఞానమూ, తెలివితేటలూ కలవాడని ఒప్పుకోవాలి! వృద్ధుడైన తన తండ్రి ఆస్తిఅంతా తనే చూసు కుంటున్నాడు. శారదాచరణునికి తల్లిలేదు. ఆమె బ్రతికున్నంత కాలమూ హారాన్ ముఖర్జీతో సంబంధము వుండేది.

రాసమణీ, శారదా చరణుని తల్లీ ఇద్దరూ ఎక్కువ ప్రేమతో వుండేవారు. ఆమె చనిపోయాక రాకపోకల సంబంధం చెడి పోయింది. శారదాచరణుని తండ్రి రామమోహనబాబు బీద వాళ్ళతో సంబంధం చేయడం, మంచిది కాదని తెలుసు కున్నాడు.

లలన చిన్నప్పటినుంచీ శారదాచరణుని ప్రేమించింది. తరు వాత ఆమెకు పెళ్ళయింది,

ఆ రోజుల్లో హారాన్‌స్థితి చెడిపోలేదు. అందుకని వున్న ఆ చిన్న ఇంట్లోనే, ఎంతో గొప్పగా లలనకు పెళ్లిచేసాడు. కాని దురదృష్ట వశాత్తు లలన రెండు సంవత్సరాల్లోనే విధవ అయి ఇంటికి తిరిగి వచ్చింది. అయినప్పటికి కూడా లలన శారదా చరణుని ప్రేమిస్తూనే వుంది. ఆ ప్రేమ తగ్గలేదు. కాని, ఎక్కు వయింది. ఇద్దరి అవస్థలూ ఎక్కువై, ఆ ప్రేమ పరిణామము సుఖంగా పరిణమించదని తెలుసుకున్నారు.

శారదాచరణుడు గ్రహించలేకపోయినా, లలన చాలా తేలిగ్గా తెలుసుకుంది. అందువల్ల తనే ప్రేమ తలుపులు ఒక్కటొక్కటే మెల్లగా మూస్తూ వచ్చింది. ఇప్పుడామె అతనిదగ్గరకు వెళ్ళలేదు. అతన్ని రమ్మనమనికూడా చెప్పదు. తన ప్రేమను వెల్లడిం

చదు. పూర్వం మాదిరిగా ఇప్పుడు రహస్యంగా జాబులు వ్రాయదు.

ఇదంతా చూచి శారదాచరణుడు సంకటములోపడి కూచున్నాడు. శారదాచరణుడు ఎంతో ఇదిగా నచ్చచెప్పి చూచినా, లలన తన రెండు చెవుల్లో వ్రేళ్ళుపెట్టుకుని సూచుంది. ఆఖరికి ఒకనాడు ఆమె 'ఇదంతామనకు మంచిది కా' దనికూడా చెప్పింది.

శారదా చరణుడు కోపంతో ' మంచిదికాకపోతే ఇన్ని రోజుల నుంచీ ఎందుకు చేసావు ?'' అని అడిగాడు.

''ఇన్నిరోజులవరకూ యేమీ తెలియనిదాన్ని....। ఇప్పుడు పెద్దదానయ్యాను''

''పెద్దయ్యాక ఇవన్నీ బాగోవూ ?''

''లేదు"

''కొంచెం ఆలోచించు....''

"ఆలోచించేందు కిప్పుడు అవసరంలేదు. ఇకముందు నాకీ చెడ్డ సలహాలు యివ్వకండి.''

"అయితే ఇవి చెడుసలహా లంటావా ?''

''కాకపోతే యేం చేస్తున్నారు ?''

''చెడు సలహా లిస్తున్నానా ?''

''అవును. చెడు సలహా లిస్తున్నారు ?''

''సరే, ఇవాళే అవన్నీ పోయేట్లు చేస్తాను''

''మంచిదే''

''యీ జీవితంలో నీతో మాట్లాడను''

''మాట్లాడకు''

తరువాత ఎవరి త్రోవన వారు వెళ్ళారు.

ఈ విషయం జరిగి నాలుగేళ్ళయింది. నాలుగేండ్ల తరువాత ఇప్పుడు మళ్ళీ శారదాచరణుడు శిథిల దేవాలయంలో లలనకోసం ఎదురు చూస్తూ కూచున్నాడు జరిగిపోయిన సంగతి క్రమ క్రమంగా మరిచిపోతున్నాడు. మరిచిపోయాడు కూడాను. అయినా. లలనే తనను ఇక్కడకు రమ్మనమని కబురు పంపింది. అందుకని మళ్ళీ వెనుకటి సంగతులు గుర్తుకొస్తున్నయ్ ! బాల్య ప్రేమ దృఢంగా వుండదని కొందరూ. వుంటుందని కొందరూ ఏమేమో చెపుతుంటారు. ఏది ఎలావున్నా ఈవిషయాన్ని నిర్ణయించలేము.

రాత్రి ఒంటిగంటయింది. ఒక మూర్తి తన దగ్గరకు వచ్చింది. ఆమె లలనే ! అప్పుడే ఎంత పెద్దయిపోయింది!

ఆమె దగ్గరకు వచ్చాక "కూర్చో" అని అన్నాడు.

చాలా రోజులయాక ఇద్దరూ మళ్ళీ ఆమెట్లమీద ఒకరి కెదురుగా ఒకరు కూర్చున్నారు. చాలా సేపు ఎవరూ మాట్లాడలేదు.

సాహసించి శారదాచరణుడు "నన్నిక్కడికి ఎందుకు రమ్మనమని కబురుచేసావు ?" అని అడిగాడు.

"పనుంది"

"ఏమిటాపని ?"

"చెప్పుతాను" అని ఊరుకుంది,

మళ్ళీ నిశ్శబ్దం ఇద్దర మధ్యా కొంచెంసేపు వున్నది.

శారదాచరణుడు మళ్ళీ, "ఏం ? చెప్పవేం ?" అని అడిగాడు.

"కొంతకాలం క్రింద నన్ను మీరు ప్రేమించారు కదూ? ఇప్పుడు కూడా ప్రేమిస్తున్నారా?"

"యెందుకు?"

"ఏముంది"

"ప్రేమిస్తున్నానని అంటే"

"నన్ను మీరు పెళ్ళి చేసుకుంటారా?"

"చేసుకోను"

"యెందుకని?"

"నిన్ను పెళ్ళిచేసుకుంటే, నా జాతీ, గౌరవమూ అన్నీ మంటకలుస్తాయ్"

"కలిస్తే కలవనీయండి"

"పోయింతర్వాత ఏం తినాలి? ఎలా బతకాలి?"

"తిండికి మీరేమీ విచారించక్కర్లేదుగా!"

"అయినా మా నాన్నగారు ఒప్పుకోరు."

"తప్పకుండా వప్పుకుంటారు. ఆయనకు మీరొక్కరే సంతానం. ఒప్పుకోక ఏంచేస్తారు? అసలు మీ మనసులోవుంటే అన్నీ వాటంతట అవే ఒప్పుదలగా మారిపోతాయ్."

"అప్పుడు కూడా చేసుకోలేను."

"ఏం?"

"కొన్ని కారణాలు వున్నాయ్. ఒకటి నాన్నగారు ఒప్పుకున్నా నిన్ను చేసుకుంటే, మా జాతి, గౌరవమూ పోతాయి. జాతితోపాటు గౌరవం పోయాక మేము యీ హాలాద్‌పురంలో వుండలేము. నిన్ను తీసుకుని వేరే వుందామంటే కావలసినంత

డబ్బులేదు. ఇక రెండోది, అయిం దేదో అయిపోయింది. జరిగిపోయినదాన్ని గురించి ఇక తవ్వుకోవడం మంచిదికాదు. దీనివల్ల మనకు చాలా మేలుంది.''

లలన కొంచెంసేపు వూరుకుని ''అవును. అదే మంచిది. అయినా యీ పనికిమాలిన దానికి ఒక వుపకారం చేస్తారా?'' అని అడిగింది.

''ఏమిటి? నా చేతనైతే చేస్తాను.''

''మీకు చేతనయ్యేదే! చేస్తారో లేదో మాత్రం చెప్పలేను.''

''నా శక్తివంచన లేకుండా చేస్తాను చెప్పు?''

''నా చెల్లెలు చలనను పెళ్ళిచేసుకోండి.''

కొంచెం నవ్వి ''ఏం? ఆమెకు తగిన వరుడు దొరకలేదా?'' అని అడిగాడు.

''ఎక్కడ దొరుకుతాడు? మేమేమో బీదవాళ్ళం. బీదింటి పిల్లను గబుక్కున యెవరు చేసుకుంటారు? అదేకాదు. మేము కులీనులమయ్యే, తక్కువ కులంలో అయితే వరుడు దొరుకు తాడు. అందుకని కులానికి తిలోదకా లియ్యాలిసి వస్తుంది. ఈ పనికిమాలిన దాని ప్రార్థన త్రోసి వేయకుండా మీరు గనుక ఆమెను పెళ్ళిచేసుకుంటే మేము రక్షింపబడతాము. చేసుకుం టారా చెప్పండి?'' ఆ కంఠంలో ఆతురత వ్యక్తమైంది.

''నేను పూర్తిగా నాన్నగారి చేతుల్లో వున్నాను. నా కింకా ఏమీ స్వాతంత్ర్యం లేదు. వారికిష్టంలేనిదే యేమి చేయలేను.''

''అయితే ఆయన్ని ఇష్టపరిచే పెళ్ళిచేసుకోండి''

''నాకు తెలిసినంతవరకూ ఆయనగారు ఒప్పుకోరు.''

లలన ముఖం పేలవమయి 'యెందుకు ఇష్టపడరు?' అని అడిగింది.

"నేనా సంగతంతా తెలుసుకునే నీకు చెపుతున్నాను. ఇక దాస్తే లాభమేమీలేదు. నా తండ్రి వట్టి లోభి! నా పెళ్ళిచేసి కొంతడబ్బు సంపాయిద్దామని చూస్తున్నాడు. మీ స్థితిచూస్తే.... అందుకనే యీ పెళ్ళికాదు...."

"మేము బీదవాళ్ళం. డబ్బెక్కణ్ణుంచి తేగలము? మీకు కావలసినంత డబ్బున్నప్పుడు, డబ్బుతో అవసరమేమిటి?"

"అది నాకు తెలుసు. కాని నాన్నగారు...."

"చెప్పేవిధంగా చెప్తే మీ మాట తప్పకుండా వింటారు."

"ఒకసారి చెప్పగలను. కాని, గట్టిగా ఆయనకు చెప్పలేను"

"అయితే ఎలాగు?"

"నేనేం చేయను?"

"అసలీ పెళ్లిచేసుకోవడానికి, మీకే ఇష్టం లేదనుకుంటాను"

"కాదు."

"లలన లాంటి పిల్ల మీకు తొందరగా దొరకదు. అందము, చందము, బుద్ధితోపాటు అన్ని పనులూ చేస్తుంది. ఒక బీద కుటుంబానికి వుపకారం చేసినవాళ్ళవుతారు. సాటి బ్రాహ్మణజాతి వాళ్ళని రక్షించినవాళ్ళవుతారు. ఇంతకంటే మీకేం చెప్పను? ఈ మేలు జన్మజన్మాలకు నేను మర్చిపోలేను. చేసుకోరూ?"

"నాన్నగారెలా చెప్తే అలానే చేస్తాను."

"ఇవాళ మీకంతా విప్పి చెవుతాను. ఈ జీవితంలో నాకిక సమయం దొరకదు. మీ దగ్గరిక నేను సిగ్గుపడను.

అన్ని సంగతులూ మీకు చెపుతాను. మిమ్మ ల్నెప్పుడూ ప్రేమిస్తూనే వచ్చాను. ఈ విషయాన్ని నేను ఇదివరకు మీతో చెప్పేవున్నాను. చాలా కాలానికి తిరిగి చివరసారిగా ఇప్పుడు మళ్ళీ చెపుతున్నాను. ఇంతకూ జరగవలసిందేదో జరిగిపోయింది. మిమ్మల్ని కష్టపెట్టాను. అందుకని నన్ను క్షమించండి."

శారదాచరణుడు మనసులోనే బాధపడుతూ వెళుతున్న లలననుచూచి "యీ విషయాన్ని నాన్నగారికి తప్పక చెపుతాను లలనా" అని అన్నాడు.

అతనివేపు చూడకుండానే "చెప్పండి" అని లలన అంది.

"అయినా నేను నాన్నగారి చెప్పు చేతల్లోని మనిషిని"

వెళుతూ, వెళుతూ లలన "ఆ సంగతి నాకు తెలుసు!" అని అంది.

"నాకు ఏమయినా సామర్థ్యం వుంటే, తప్పకుండా నీకు కబురు చేస్తాను."

"సరే"

"లలనా! నన్ను క్షమించాలి."

"క్షమించాను."

## 10

"నాలుగణాలు ఇటియ్యవయ్యా, యీ ఆటకూడా నాదే" అని హారాన్ చంద్రుడు మళ్ళీ, "ఇంకా యెనిమిదణాలు పందెం

వేస్తాను" అని యెనిమిదణాలూ వెయ్యి చినుగులుగల ఆ చింకి చాపమీద వేసి, పేకముక్కలు చేతిలోకి తీసుకున్నాడు. అందరూ తమ తమ పేకముక్కలు చూసుకున్నారు.

''తియ్యండిబాబూ, తియ్యండి''

అందరూ బొడ్లల్లోంచి డబ్బులు తీసారు.

''ఇంకా, ఇంకా, ఇంకా!''

''చాలు''

''పది హేను. గెలుపు నాదే!''

''మండు మండు మండిపో? ఇదేనా గెలుపు?''

ఆ రాత్రంతా గడిచాక హరాన్ చంద్రుడు ఆటలోంచి లేచే టప్పటికి అతని ధోవతి కొంగు డబ్బుతో నిండి పోయింది, ఆ రాత్రి ఆయన ఇంటికి వెళ్ళలేక పోయాడు. రెండో రోజు కూడా, యీ దుకాణం ఆ దుకాణం దగ్గిర వుండడం మూలాన్ని మధ్యాహ్నం కూడా గడిచిపోయింది. నాలుగు గంటలయాక ఎర్రటి కళ్ళతో ముఖం, ముక్కూ, గుడ్డలూ, వళ్ళూ సారా వాసనతో మెల్లగా ఇంట్లోకి దూరాడు.

స్నానంజేసి హారాన్ అన్నానికి కూర్చున్నప్పుడు సుభద ఎదురుగా కూచుని ''ఇవాళ చాలా ఆలస్యమైంది'' అని అంది.

''ఏం చేయను చెప్పు? పనికోసం తిరగడం మూలాన్న ఇంత ఆలస్యమైంది. ఇంకా నువ్వు అన్నం తినలేదూ?''

సుభద మాట్లాడలేదు.

''తినలేదా?''

''ఇప్పుడు తింటాను.''

హారాన్ విచారంగా, ''యీ బుద్దే నీకు చెడు అలవాటుగా పరిణమించింది. ఇలా అయితే నా కేమీ బాగోదు. ఒకవేళ నేనీ పూట రాకపోతే రోజల్లా అలానే ఆకలితో వుంటావన్నమాట. సరే బాగుంది'' అని రెండు ముద్దలు తిని సుభదవేపు చూస్తూ ''మొన్న నన్ను డబ్బు గురించి అడిగావు కదూ!'' అని అడిగాడు.

''లేదే''

''అడగలేదూ? అడిగా వనుకున్నాను'' అని మెల్లగానవ్వి ''మొన్న అడగలేదు....కానీ, రెండురోజులు పోయాక తప్ప కుండా అడుగుతావు. నాకు తెలుసు! నా కండువా మూటలో యెనిమిది రూపాయలు కట్టి వున్నాయ్, అందులోంచి అయిదు రూపాయలు తీసుకో!'' అని చెప్పాడు.

''సరే!'' అని సుభద తలూపింది.

చాలా రోజుల్నుంచి హారాన్ నోటివెంట ఆమె అటువంటి మాటలు వినలేదు. యెంతో ఆశ్చర్యంగా ''అయితే రూపాయలు ఎక్కడివీ?'' అని అన్నం తిన్నాక ఆమె అడిగింది.

ఆ రోజునే హారాన్ ముఖంమీద నవ్వు కనిపించింది. ''అరే! మనకు డబ్బుకు తక్కువేమిటి? తలతో మెదడనేది వుంటే, డబ్బెక్కడ పడితే అక్కడ దొరుకుతుంది తెలుసా!'' అని అన్నాడు.

ఆమెకేమి తెలిసిందో, ఆమెకే తెలియాలి. ఆమె మళ్ళీ మాట్లాడలేదు.

రెండు నెలలతర్వాత—

ఒకనాటి సాయంకాలమున సుభద లలన దగ్గర కూచుని ప్రాధేయ పూర్వకంగా "లలనా! యీ పూటకు యేమయినా వుందా?" అని అడిగింది.

"ఏమీ లేదమ్మా"

"ప్రతిరోజూ నువ్వు ఇలానే చెపుతూ ఆఖరికి నాలుగైదు అణాలుఇస్తూవచ్చావు. ఇప్పుడుకూడా అలానేయేమైనా వుందేమో చూడమ్మా! యేమీ వుండకపోదు. లేకపోతే ఈరాత్రికి మనం దరం పస్తుండవలసిందే?"

తల్లి దీన వదనాన్నీ, కన్నీళ్ళనీ, గద్గద స్వరాన్నీ విని లలన యేడుస్తూ "నాదగ్గర యేమీ లేదమ్మా: నీపాదాల సాక్షిగా లేదమ్మా!" అని అన్నది.

ఇద్దరూ యేడ్చారు. కూతురు మాటను విశ్వసించలేకపోయాను కదా అని సుభద, ఇదివరకు అడిగినప్పుడల్లా ఇచ్చేదాన్ని ఇప్పుడు ఇవ్వలేకపోయానుకదా అని లలనా ఏడ్చారు. నిజంగా లలనవద్ద యేమీలేదు. సదానందుడు ఇచ్చిన యాభైరూపాయలూ, ఇవాల్టి ప్రొద్దున్నతో అఖరై కూచున్నాయి. అంతా ఏం తినాలి? ఈ రాత్రి యెలా గడపాలి? తండికోసం ఏమీ ఇవ్వకపోతే, తనను గురించి తల్లి మనసులో ఏమనుకుంటుందో? ప్రొద్దున్నే ముష్టికి యెవరింటికి వెళ్ళాలి? ఇవన్నీ మనసులో తిరగడంతోనే, లలనకు దుఃఖమాగక కన్నీళ్ళు కారినై.

బిందుకూడా ఇప్పుడు లేదు. సదానందుడు కాశీ వెళ్ళాడు. రెండురోజుల్నుంచి హోరానేమో ఇంటికి రావడం లేదు. అతను నల్లమందు కొట్టులోనో, జూదమాడే చోటనో వుండి వుంటాడు.

ఇక్కడ హారాన్ మనఃప్రవృత్తి కొంచెం చెప్పాలి. అతను గంజాయి తాగుతాడు. నల్లమందు తింటాడు. నాలుగయిదు అణాలువుంటే దిగులు లేకుండా ఖర్చుచేస్తాడు. సుభదతో అబద్ధం చెప్పి నాలుగైదు అణాలు తీసుకుంటాడు. తలమీదకు వచ్చి నప్పుడు బొట్టుపెట్టి, భస్మము పూసుకుని, బ్రాహ్మణవృత్తి బిక్షాటనం చేస్తాడు.

"హలాద్‌పూర్"లో వుండడానికిమొట్టమొదట అతనికికష్టమ యింది. ఇప్పుడు బ్రాహ్మణపాడ్‌లో వుండటమే కష్టమైంది. ప్రతి దుకాణదారునికీ నాలుగైదు అణాలకు తక్కువ కాకుండా బాకీ వున్నాడు. ఈ కారణాలవల్ల అతను బ్రాహ్మణపాడ్‌లో కూడా వుండటమే కష్టమయింది.

అయినా సాయంకాలం నల్లమందు కొట్టువద్దా, రాత్రిపూట జూదపు యింట్లోనూ, అతను హాజరు కావలసిందే! డబ్బులేక పోవడం మూలాన అతను ఆడేవాడుకాదు. కాని, యెవడి కయినా ఆటలో సాయం చేస్తే, ఏదో నాలుగైదు అణాలు దొరికేవి.

మొత్తంమీద ఇంటికి వెళ్ళగానే అతనికి అన్నానికేమీ కొదవ వుండేదికాదు. ఇంట్లో యెవరికి లేకపోయినా, అతనికి మాత్రం దొరుకుతుంది. సుభద చేయి యెప్పుడూ ఖాళీగా వుండదనీ, ఆమె చేతిలో యేమీ లేకుండా వుండదనీ అతనికి నమ్మకం.

తను తినకపోయినా, తనకోసం యెంత రాత్రయినా, అన్నం గిన్నె ముందు పెట్టుకుని సుభద ఎదురు చూస్తూ వుంటుందని తెలుసు.

"ఇంత ఆలస్యం ఎందుకయిందనీ? ఇంత రాత్రి ఎందుకయిందనీ?" సుభద అడగదు.

అయినా తను అపరాధం చేస్తున్నాననీ దాన్ని సుభద ఇప్పటి వరకూ క్షమిస్తూ వస్తుందని అతనికి తెలుసు. ప్రతిరోజూ ఇలా అన్యాయంచేస్తూ ఉండడంవల్ల మధ్య మధ్య సంకోచిస్తూనే ఉన్నాడు.

రాత్రి చాలా ప్రొద్దుపోయిం తర్వాత ఆనాడు హారాన్ చంద్రుడు ఇంటికి వచ్చాడు. ఇంట్లోకి వెళ్ళడానికే అతనికి అవమానమయింది. సుభద మామూలుగా కాళ్ళుకడుక్కునేందుకు నీళ్ళు తేలేదు. అన్నపుగిన్నెను ముందుపెట్టుకుని తనకోసం ఎవరూ ఎదురుచూడటంలేదు. ఒక మూల దీపం మినుకు మినుకు మంటూ వెలుగుతూ వుంది. దీపంలోని వత్తి పెద్దది చేద్దామని హారాన్ చంద్రుడు దీపం దగ్గరకు వెళ్ళగానే అందులో నూనె లేకపోవడం చూచి మంచంమీద యేమేమో ఆలోచిస్తూ మెల్లగా కూచున్నాడు.

తూర్పురేఖలు మెల్లగా బైటకు వస్తున్నాయి! అయినా ఎవరూ కనుపించలేదు. హారాన్ యేమాలోచించాడోయేమో తెగిపోయిన చెప్పుల్ని చేత్తో పట్టుకుని ఇంట్లోంచి బైటకు కాలు పెట్టాడు.

మెట్లమీద చలనామయి కూర్చునివుంది. ఇంత ప్రొద్దున్నే ఆపిల్ల ఎప్పుడూ లేవకపోయినా ఇవ్వాళ యెందుకని లేచిందో యెవరికీ తెలపదు. తండ్రిని చూస్తూనే "నాన్నా నువ్వెప్పుడు వచ్చావు?" అని గట్టిగా అరిచింది.

"రాత్రి" అని బిడియపడుతూనే హారాన్ చెప్పాడు..

"సరేకాని నాన్నా నీకేమయినా మతుందా? నిన్న అమ్మకీ, అత్తకీ, అక్కకి యెవరికీ తినేందు కేమీ లేదు. ఇవాళ మేమంతా యేంతినాలో చెప్పు. నీవేమో చెప్పులు చేత్తో పట్టుకుని మెల్లగా పారిపోతున్నావు?" అని అన్నది.

చలన తన తలను నరుకుతున్నట్లుగా హారాన్‌కు తోచింది. చేతుల్లోని చెప్పులు వాటంతట అవే జారి క్రింద పడినయ్. చాలా సేపటికి, యేమీ తెలియని మూఢునిలా "చలనా నువ్వు అన్నది నిజమేనా?" అని అడిగాడు.

ఇంకా కొంచెం గట్టిగా అరుస్తూ "అత్తాయ్, ఓ అత్తాయ్! విన్నావా నాన్నగారి మాటలు? నేను అబద్ధం చెపుతున్నానట. రాత్రంతా అమ్మా, అక్కాయ్ యేడుస్తూ కూచుంటే నీ కెలా తెలుస్తుంది" అని అంది.

హారాన్ నిలుచోలేక చెప్పుల్ని చేత్తో పట్టుకుని పారి పోయాడు.

చలన మళ్ళీ "అరే, అరే! నాన్న పారిపోతున్నాడే?" అని గోలచేసింది.

చలన చిన్నపిల్ల ఏమీ తెలియనిది. అసలు యెప్పుడు ఏమనాలో ఆమెకు బొత్తిగా తెలియదు. ఇంత సేపటినుంచీ లలన చాటున వుందల్లా బయటకువచ్చి "చలనా, నీకేమయినా బుద్ధుందా లేదా?" అని అంది.

"ఏం?"

"ఎవరిదగ్గర యేం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో ఇంత వరకూ తెలుసుకోలేని దానివయ్యావ్? ఏం లాభం? ఒక ఏడుకి

ఇంకోయేడు మీదపడుతున్నకొద్దీ బుద్ధిలేక పోతుండటం బాగానే వుంది. ఇటువంటి మాటలతో నాన్నను యింకా దుఃఖపెట్టిపంపిం చడం మంచిదేనా ?''

''నేను పారిపొమ్మని చెప్పలేదుగా ? నాన్నే పారి పొయ్యాడు''

''ఛీ, ఛీ నాన్నను అలా అనొచ్చా ?''

''ఎందుకు అనకూడదేం ? తాతనయినా అనకూడదు కాని, ఇలాంటి తండ్రుల్ని మాత్రం తప్పకుండా అనాలి; బిడ్డల్ని పోషించలేక యిలా ఎవరి తండ్రి పారిపోతాడు ? ఏ తండ్రి బిడ్డలజోలి పట్టించుకోకుండా, గంజాయీ, నల్లమందూ తిని దిక్కులేనివాడిలా బైట పడుంటాడు ? నేను తప్పకుండా అంటాను. మళ్ళీ అదే అంటాను''

కోపంతో లలన ''చలనా, యికపో, యిక్కణ్ణుంచి వెళ్ళిపో !'' అని అంది.

''నే నెందుకు వెళ్ళాలి ? నీవే వెళ్ళు. నాకు నీవేమీ చెప్ప నవసరంలేదు.''

లలన మెదలకుండా అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

## 11

ఆరోజు మధ్యాహ్నా మయాక సుభద రాసమణికి ఒక యిత్తడి బిందె యిచ్చి ''ఇంత పొద్దుపోయిం తర్వాత వారిక వస్తారని నాకు నమ్మకంలేదు. ఈ బిందె తాకట్టుపెట్టితే, ఎవరైనా ఏమయినా యిస్తారేమో వెళ్ళు'' అని అన్నది.

చాలాసేపు సుభద మొహంవేపు చూసి "ఏం చేయను? చాలా సిగ్గుగా వుంటుందమ్మా!" అంది రాసమణి.

అక్కడే నిలుచునివున్న లలన ఆ బిందెను తీసుకుని "నే నెళ్ళొస్తానమ్మా!" అని అంది.

ఏడుపు గొంతుకతో "ఎక్కడి కెళ్తావే?" అని సుభద అడిగింది.

"హరిపాల ఘోష్ దుకాణంలోకి."

"నువ్వే వెళ్తావా, అమ్మా?"

"ఏం? నేనే వెళతాను. సిగ్గెందుకు పడాలి? నేనీ పల్లెకు బిడ్డని. చిన్నప్పటినుంచీ అందరూ నన్నెరుగున్నారాయె, నాకేం సిగ్గు? మంచి రోజులు చెడురోజులు యెవరింట్లోలేవు?"

లలన వెళ్ళేందుకు తయారుగా వున్నప్పుడు ఆమె చేతుల్లోని బిందెను రాసమణి లాక్కుని "అయితే నేనే వెళ్తాను" అని అంది.

ఆరోజు మూడుగంటలకు అందరూ తిన్నాక సుభద లలనను ఒక మూలకు లాక్కువెళ్ళి "లలనా! రహస్యంగా, ఎవరికీ తెలియకుండా, కొంచెం బచ్చలాకులు తీసుకురా అమ్మా!" అని చెప్పింది,

విస్మయంగా "వాటిని ఇప్పుడేం చేస్తావే?" అని లలన అడిగింది.

"పనుంది"

"ఏం పనమ్మా?"

"నీకేమీ తెలవదులే"

''అన్నం మిగలలేదా యేం?''

''ఎందుకు మిగలదూ?''

''అయితే?''

''అయితే యేంలేదు. బచ్చలాకులతో కొంచెం పనుంది''

''సరిగ్గా చెప్పమ్మా అసలు సంగతేమిటి?''

''సంగతేముంది''

''నీ కాళ్ళమీద పడతాను. నా దగ్గర యేమీ దాచకమ్మా'' అని లలన తల్లి కాళ్ళను పట్టుకునేందుకు వంగుతూన్నప్పుడు, సుభద ఆమె రెండు చేతులూ పట్టుకుని ఆమె ముఖంమీద పడుతున్న వెంట్రుకల్ని చెవుల పక్కకు సరిచేస్తూ ''ఒక మనిషి కంటే యెక్కువ అన్నం లేదమ్మా. ఒకవేళ వారువస్తే?'' అని అన్నది.

''అయితే వట్టి బచ్చలాకులు తిని నువ్వుంటావా?''

''బచ్చలాకులు తినకూడనివా యేం?''

''తినేవే అయినా నువ్వు తినాలా?''

''ఆ సంగతి వదలిపెట్టు. కష్టసుఖాలు యే ఇంట్లో లేవు, అని ఆ రోజున నువ్వే చెప్పావుకదూ! అయినా ఇప్పుడు మళ్ళీ మనం వాటిని ఎందుకు జ్ఞాపకం చేసుకోవాలి?'' అని అంటుంటే సుభదకు కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి.

లలన యేడుస్తూ వెళ్ళిపోయింది.

సాయంత్రమయేందుకు ఇంకా ఆలస్యముంది. అక్కడక్కడా ప్రొద్దుణ్ణుంచీ అడుక్కున్న బియ్యాన్ని మూటగా చంకకు తగిలించుకుని హారాన్ బ్రాహ్మణపాడ్‌లోని ఓ చిల్లర

కొట్టువద్ద నిలుచున్నాడు. దుకాణం చిన్నది. కానీకి అర్ధణాకు కొనేవాళ్లు తప్ప ఇంకెవరూ అక్కడికిరారు ఎంతోమంది వచ్చి నూనె, పప్పూ కొనుక్కుని వెళుతున్నారు. కాని, బిచ్చగాడు అలానే నిలుచున్నాడు. దుకాణదారు అతన్ని చూచి "యేం కావాలీ?" అని అడిగాడు.

"ఏమీవద్దు"

"మరి ఇక్కడ నిలుచోవడం దేనికి?"

అక్కడ కొంటున్న ఓ ఆసామి "అడుక్కునేందుకు వచ్చాడేమో?" అని అన్నాడు.

దుకాణదారు మెల్లగా "వెళ్లు, వెళ్లు. ఇక్కడేమీ దొరుకదు. సాయంకాలంపూట బిక్ష యేమిటి?" అని అన్నాడు.

హారాన్ వెళ్ళిపోయాడు. కొంచెం దూరంవెళ్ళి మళ్ళీ వచ్చి అక్కడే హారాన్ నిలుచోవడం చూచి "మళ్ళీ వచ్చావేం!" అని దుకాణదారు అడిగాడు.

"బియ్యం కొంటావా?"

"యే బియ్యం? ఏ ధర?"

"లావు బియ్యం...."

"ఏవీ? యెలావున్నాయో చూద్దాం చూపించు?"

బియ్యం చూశాక "ఇవన్నీ అడుక్కున్న బియ్యం! అందుకనే యిన్ని రకాలు. సరే. ఎంతకిస్తావేం?"

"రెండణాలు"

"ఓస్, నాలుగు కానులవి వున్నాయో లేవో కాని, రెండణాలు కావాలా? నాయనా వద్దులే వెళ్ళు."

హారాన్ తిన్నగా వెళ్ళి ఓ చెట్టు క్రింద కూచుని మూటలో బియ్యం సగం తిని మళ్ళీ మూటకట్టి దుకాణదారు వద్దకు వ "సరే తీసుకోండి" అని అన్నాడు.

"నాలుగు కాన్లకు యిస్తావా?"

"ఏం చేస్తాను మరి, తీసుకోండి"

"అయితే డబ్బాలో పొయ్యి"

హారాన్ బియ్యం డబ్బాలోపోసి నాలుగు కానులూ తీసుకొని వస్తూ పెద్దగా నవ్వి "బలే టోకరా యిచ్చాను. కర్మనేది యెలా వుంటే అలానే జరుగుతుంది. సగం తిన్నా ఆ ముండాకొడుక్కి ఏమీ తెలియలేదు" అని అనుకుంటూ, చీకటి పడుతుండగా నల్లమందు కొట్టులోకి పోయాడు.

# 12

"నేనింక వుండలేను లలనా" అని సుభద కూతురుని పట్టుకుని ఏడ్చింది.

మూడురోజులు వుపవాసంచేసి అమె ఆమాట అంది.

లలన తల్లి కన్నీళ్ళు తుడిచి "యీ రోజులు యిలానే వుంటాయా అమ్మా! మళ్ళీ మంచి రోజులు తప్పకుండా వస్తాయ్" అంది.

"భగవంతుడు ఆలా చేసినా ముందిప్పుడు సహించలేకుండా వున్నాను. మీకు తల్లినై వుండికూడా మీ దుఃఖాన్ని నేనేమని చూడను? గంగానదీమతల్లిని వేడుకుంటే కొంత హృదయ

శాంతన్నా వుంటుంది. నీ వెలానైనా వీళ్ళను చూస్తూవుండు. అక్కడక్కడ బిక్షాటనం చేయడం తల్లినై వుండి నేను చూడ లేను'' అని అంది.

సుభద ఏడుపు చూస్తే రాళ్ళుకూడా కరుగుతాయి. చాలా రోజులు ఓపికతో తన మర్యాదను చంపుకుని యింతింత పెద్ద పెద్ద కష్టాలు సహించాక ఆమె తన ధైర్యాన్ని కోలుపోయి తనసు తాను సంబాళించుకోలేని స్థితికి దిగజారి పోయింది.

అసలు కోపంలేనివాళ్ళకు తుఫాను వచ్చినపుడు అది ప్రళయం అవుతుంది. అందుకని లలన సంకటాల్లో పూర్తిగా మునిగింది.

చాలా రాత్రివరకూ తల్లీ కూతురూ ఏడుసూ అక్కడే నిదుర పోయారు.

సుభద సగం రాత్రపుడు, గబుక్కున లలనను లేపి, ''వారు ఇప్పుడు లేరను కుంటాను'' అని గాబరాగా అంది.

నిద్రమత్తులోవున్న లలన తల్లిమాటల్ని గ్రహించలేక ''ఎవరమ్మా ?'' అని అడిగింది.

''ఆయన యిప్పుడు లేరని నేను కలలో చూశాను.''

''అమ్మా. ఇలా అయిపోతున్నావేమిటే ?'' అని లలన ఏడ్చింది.

మెల్లమెల్లగా సూర్యుడు పైకి వస్తున్నాడు, షుమారు పది గంటలయాక కృష్ణప్రియ స్నానంచేసి యింటికి వెళుతూ, దార్లో వున్న హాఠాన్ యింట్లోకివచ్చి "అమ్మాయీ !'' అని పిలిచింది.

సుభద బైటకువచ్చి ''ఏం అక్కాయ్ కూర్చో !'' అని అంది,

"కాదమ్మా! చాలా ఆలస్యమైంది. చూద్దామని స్నానంచేసి యిలా వచ్చాను."

సుభద మాట్లాడలేదు.

"ఇంతకూ హారాన్ సంగతి ఏమయినా తెలిసిందా?"

"లేదు."

"యెన్ని రోజుల్నుంచి ఇంటికి రావడంలేదు?"

"ఆరు రోజుల్నుంచి."

"ఆరు రోజుల్నుంచి రావడంలేదూ? మరి బ్రాహ్మణఫాడ్‌కు ఎవరినైనా పంపక పోయావా?"

"ఎవర్ని పంపను, ఎవరెళతారు?"

"మరి, నాకెందుకు చెప్పలేదు?"

సుభద మాట్లాడలేదు.

"డబ్బేమయినా వుందా?"

"యేమీలేదు."

"అయితే యింట్లో యెలా జరుగుతోంది?"

సుభద మాట్లాడలేదు.

"పిల్లవాడికి యెలా వుంది?"

"అలాగేవుంది."

"కొంచెం లలనను నా ఇంటికి పంపు."

ఆమె వెళ్ళాక లలనను పిలిచి "కృష్ణప్రియ నిన్ను రమ్మంది యెందుకోమరి, వెళ్ళిరా?" అని సుభద చెప్పింది.

"యెందుకమ్మా?"

"యేమోమరి. నాకేం తెలియదు."

లలన కృష్ణప్రియ ఇంటికివెళ్ళి, కొంచెంసేపయాక తిరిగివచ్చి తల్లిచేతిలో రెండు రూపాయలు పెడుతూ "అత్తయ్య యిచ్చింది" అని చెప్పింది.

"ఇంకేమన్నా అన్నదా?"

"నాన్న యింటికిరాగానే కబురు చేయమనికూడా చెప్పింది"

సుభద ఆరోజున తన మనసులో భగవంతునికి యెన్నో పూజలూ, పునస్కారాలు, ప్రార్థనలూ చేసింది. తులసికోటకు యెన్నోసార్లు మొక్కి తినుబండారాలకుగాను డబ్బిచ్చిగంగస్నానానికి వెళ్ళింది.

బాగాచీకటి పడినాక చీకటిలో తన ముఖం దాచుకుని హారాన్ ఇంటికి వచ్చాడు. ఆరురోజుల క్రితం యెలావున్నాడో యిప్పుడూ అలానే వున్నాడు. అతనిలో పరివర్తనమేమీ లేదు. గుడ్డలు మాత్రం బాగా మాసిపోయి, లెక్కలేనన్ని చిరుగులతో వున్నాయ్.

భోజనాలు అయాక సుభద తన కూతురు చలనను పిలిచి "అమ్మాయీ రోజూ నీ ముఖం చూచి లేస్తుంటానమ్మా" అని అంది. నవ్వుతూ, "యెందుకమ్మా?" అని చలన అడిగింది.

"యివాళ కలిగినంత సుఖం సంతోషం నేనీ జన్మలో చూడలేదు, అనుభవించలేదు".

రెండవరోజు కృష్ణప్రియ దగ్గరకు చలన వెళ్ళి, "రాత్రి నాన్నగారు వచ్చారు" అని చెప్పింది.

"వచ్చాడా, బాగా వున్నాడా?"

"ఆ!"

"యిన్ని రోజుల్నుంచీ యెక్కడున్నాడే?"

"అదే తెలియదు"

"మీ అమ్మ యేమీ అడగలేదూ?"

"లేదు"

"మరి మీ అత్తకూడా ఏమీ అడగలేదా?"

"లేదు. ఆమె నాన్నగారితో మాట్లాడదు"

"మాట్లాడదూ? ఎందుకని?"

"యేమో తెలియదు"

పన్నెండు గంటలయాక కృష్ణప్రియ అరటాకులతో మూత వేసిన ఓ రాతిచిప్ప పట్టుకుని వచ్చి "అమ్మాయ్! కొంచెంకూర తీసుకవచ్చాను. హారాన్‌కు పెట్టు" అని అంది.

సుభద్ర రాతి గిన్నెను చేతిలోకి తీసుకుని ప్రక్కనున్న గది వేపు చేయి చూపిస్తూ "ఆ గదిలో ఉన్నారు" అని చెప్పింది.

కృష్ణప్రియ గ్రహించి "వుండనీయ్! యిప్పుడుకాదు నేనింటి తలుపులు వేసి రాలేదు" అని అంది

వెళుతూ వెళుతూ కృష్ణప్రియ "అమ్మాయ్ హారాన్‌ను ఒక సంగతి అడుగుతావా?" అని అడిగింది.

"యేమిటి?"

"ఇన్ని రోజులు అతను యెక్కడ వున్నాడో ఆ సంగతి తప్పకుండా అడుగు"

"సరే"

హారాన్ అన్నం తినేప్పుడు సుభద్ర "యిన్ని రోజుల్నుంచీ యెక్కడున్నారండీ?" అని అడిగింది.

హారాన్ ముఖం క్రిందకు దించి "చెట్లనీడల్లో" అని జవాబు చెప్పాడు.

సుభద్ర యింకేమీ మాట్లాడలేదు.

రెండవనాడు కృష్ణప్రియ వచ్చి ఆమాట యీమాట అడిగి "ఆవిషయం అడిగావా?" అని అడిగింది.

"ఆ!"

"యేమని చెప్పాడు?"

"చెట్లనీడల్లో వున్నారట"

తరువాత ఆ మాటా యీమాటా అయాక కృష్ణప్రియ గుడ్డల్లోంచి ఓ తాను తీసి సుభదకు యిస్తూ "ఇంట్లోపడి వుంటే తెచ్చాను. హారాన్‌కు కుట్టించు" అని చెప్పింది.

సుభద మాట్లాడకుండా తాను తీసుకుంది.

"చూడమ్మాయ్! ఇది యెవరిచ్చారని హారాన్ అడిగితే ఎప్పుడయినా నా పేరు చెప్పేవు? ఇంకెవరి పేరయినా చెప్పు?"

"ఏం?"

"అలానేలే. నీకు తెలవదు."

"నిజం చెపితే యేం?"

"ఏముందీ నీ కృష్ణక్కయ్య తల నువ్వే పగలగొట్టిన దానవవుతావు?"

రోజులు నెమ్మదిగా గడుస్తున్నయ్! ఇంటికి వచ్చిన హారాన్ మళ్ళీ ఇంటిని వదిలి పెట్టలేదు. సుభద కిప్పుడు కొంచెం విచారం భయం తగ్గింది కాని, అన్నం అదీ యెలా జరుగుతుంది అనేదే ఆమెకు ఓ సమస్య!

దయతలచి యెవరయినా ఓ రూపాయి యిస్తే యింకొకరు రెండురూపాయలిస్తే ఈ విధంగా ఆ కుటుంబపు ఖర్చులు జరుగుతున్నాయ్! మాధవుని స్థితి చూస్తే మరీ అధ్వాన్నమైపోయింది.

అతడి శరీరంలోని సగం రక్తం నీరుగా మారిపోయింది. అన్నిటి కంటే ఇంకోపక్క లలన భారం ఆమెకు యెక్కువగావుంది. రోజు రోజుకూ లలన పెద్దదవుతూ పెండ్లీడుకు వస్తోంది. మూడు నాలుగు నెలలు అలానే వుంటే, ఆ అవస్థకూడా దాటిపోతుంది. ఈ సమస్యలతో సుభదకు ఏదారీ దొరకలేదు.

# 13

ఆనాడు ఏకాదశి. ఇంటి పనులన్నీ అయాక లలన మాధవుని దగ్గరకు వచ్చి కూచుంది.

"అక్కాయ్? అదేమయింది?" అని మాధవుడు అడిగాడు.

"ఏది?"

"అక్కడకు వెళ్ళే విషయం?"

"ఆ విషయం నీతో ఇప్పుడే చెపుతాను మధూ!"

బలవంతంగా మాధవుడు లేచి కూచున్నాడు. "ఏమి టక్కాయ్! ఎప్పుడు వెళ్ళాల్సొంటుంది?" అని అడిగాడు.

"నేను రేపు వెళ్తాను మధూ!"

"నువ్వు రేపే వెళ్తావా? మరి నేనో?"

"నేను వెళ్ళాక నువ్వురా"

"ఏం? ఇద్దరం కలిసి వెళ్దాం"

"వద్దు, మనమిద్దరం కలిసి వెళ్తే అమ్మ దిక్కు తోచక ఏడుస్తుంది."

"ఏడిస్తే ఏం?"

"ఛీ! అలా చేయొచ్చా? తప్పుకదూ! ముందు నేను వెళతాను"

"మళ్ళీ ఎప్పుడొస్తావు?"

"నువ్వు వచ్చేనాడు మళ్ళీ ఒకసారి వస్తాను"

"మధ్యలో రావా?"

"రాను"

"అయితే నే నెప్పుడు రావాలి?"

"నేను తీసుక వెళ్ళేందుకు వచ్చినపుడు"

"మరి అప్పుడన్నా వస్తావా?"

"ఆ!"

"అయితే నువ్వు వెళ్తే అమ్మ యేడవదూ?"

"ఏడుస్తుంది"

కొంచెంసేపు ఆలోచించి మాధవుడు, "అయితే వెళ్ళొద్దు అక్కాయ్! వెళ్ళొద్దు" అని అన్నాడు.

"ఏం తమ్ముడూ?"

"అమ్మ యేడుస్తుందంటే నా మనసు అక్కడికి రావడానికి వప్పుకోవడం లేదు."

"నువ్వు వెళ్ళకు"

"వెళ్ళనులే!"

"వెళ్ళు"

"నేను లేనని ఏడవవుకదూ?"

"నన్ను తీసుక వెళ్ళడానికి యెప్పుడొస్తావు మరి?"

"కొద్దిరోజుల తరువాత"

"అయితే సరే వెళ్ళు, నేను యేడువనులే!"

మాధవునికి కనబడకుండా లలన రెండు కన్నీటి చుక్కలు రాల్చి, స్నేహంగా అతని తలమీద తన చేయివేసి నిమురుతూ "నేను వెళ్ళాక ఈ విషయమంతా అమ్మతో చెప్పకు" అన్నది.

"చెప్పనులే"

"అమ్మ చెప్పింది చేయాలి. యే విధంగానైనా సరే, యెప్పుడైనా సరే అమ్మను యేడిపించకు. తెలిసిందా? సరిగ్గా వేళకు మందు త్రాగు"

"ఆ....!"

కొంచెంసేపు లలన వూరుకుని "మధూ!, సహన్నయ్యను మర్చిపోలేదు కదూ?" అని అడిగింది.

"లేదు, యెందుకు మరిచిపోతాను."

"ఒకవేళ ఆయన యెప్పుడన్నా వస్తే....నిన్ను చూసేందుకు వస్తే...."

"వస్తే?"

"అక్కయ్య వెళ్ళిపోయిందని మాత్రం చెప్పు. అదీ, యెవరూ లేకుండాచూసి చెప్పు"

"సరేలే!"

ఆ సమయాన్నే సుభదవచ్చి "చాలా పొద్దుపోయిందమ్మా! నువ్వు వెళ్ళి నిద్రపో!" అని లలనతో అంది.

జవాబుగా మాధవుడు "అమ్మా, అక్కయ్యని నా దగ్గర పడుకోమని చెప్పవే" అని అన్నాడు,

అక్కగారిని వదిలిపెట్టేందుకు మాధవుని కా సమయంలో ఇష్టంలేదు. అది సుభద తెలుసుకుని లలనతో "సరే, నువ్వు

ఇక్కడే పడుకో. నేను చలన దగ్గర పడుకుంటాను'' అని చెప్పి పైకి వెళ్ళిపోయింది.

సుభద వెళ్ళాక, అక్కా తమ్ముళ్లమధ్య యెన్నో మాటలు జరిగాయ్. తరువాత మాధవుడు నిద్రపోయాడు,

రెండోరోజు వుదయాన్నే లలన యెవరికీ కనబడలేదు. ఆమె యెప్పుడూ ప్రొద్దున్నే లేచి పని చూచుకునేది. యేడెనిమిది గంటలయాక సుభద మాధవుని ''మీ అక్కయ్య యేదీ?'' అని అడిగింది. చలనను "మీ అక్క యెక్కడికి వెళ్ళింది?'' అని కేకలు వేసింది.

అందరూ ''తెలియదు" అని మాత్రం జవాబు చెప్పారు.

ప్రొద్దెక్కిన కొద్దీ సుభద తనంతట తానే పని చేసుకుంది. చలన కొంచెం సాయం చేసింది. వంట సిద్ధమయింది. అందరూ తిన్నారు. మధ్యాహ్నంకూడా అయింది. లలన జాడ మాత్రం లేదు,

రాసమణి దేవుల్లాడేందుకు వెళ్ళింది, చలనామయి అన్నం తిని వీధిలో యెక్కడన్నా వుందేమోనని పిలవడానికి వెళ్ళింది. చీకటి పడుతుండగా రాసమణి వచ్చి ''యెక్కడా కనుపించ లేదు. ఇంటికేమయినా వచ్చిందా?" అని అంది.

''లేదు''

చలన వచ్చి ''అక్కయ్య యీ ఊళ్ళోనే లేదమ్మా'' అని చెప్పింది. రాత్రి బాగా ప్రొద్దుపోయింది. కాని లలన రాలేదు.

హారాన్ ఇంటికి వచ్చినప్పటినుంచీ బయటకు వెళ్ళలేదు. అతనుకూడా "అస లది యెక్కడికి వెళ్ళిందో?'' అని దేవుల్లా

దేందుకు బైటకు వెళ్ళి రాత్రి పన్నెండు గంటలయాక తిరిగి వచ్చి ''అదే........అదే....యేమీ పొలుపోవడం లేదు'' అని అన్నాడు.

రోజంతా అన్నంలేకుండా పడివున్న సుభద యేడవడము మొదలు పెట్టింది. రాసమణి యేడుస్తూవుంది. చలనకూడా యేడ్చింది.

ఒక్క మాధవుడు మాత్రం వీళ్ళ ననుసరించలేదు. అందరి గాబరాలూ, ఏడ్పులూ చూసి, మాధవుడు అసలు సంగతంతా చెపుదామా అని అనుకున్నాడు కాని వెంటనే అక్కగారు ''ఎంత మాత్రం చెప్పొద్దు'' అని చెప్పిన విషయం గుర్తు కొచ్చింది.

తల్లి కన్నీళ్ళు చూసికూడా మాధవుడు అక్కగారి కిచ్చిన మాటకోసం మెదలకుండా ఊరుకున్నాడు. మూడురోజులయినా లలనరాలేదు. పల్లెలోని వారందరికీ ఈ విషయం తెలిసింది. అందరూ విచారపడ్డారు.

కొందరికి దుఃఖం వచ్చి యేడ్చారు. కొందరు సుభదకు ధైర్యము చెప్పేందుకు వచ్చారు. యీ విధంగా అయిదారు రోజులు గడిచినై!

లలన కోసం సుభద మాధవుడి ముందుకూడా ఏడ్చింది. అతనికేమీ కష్టమనిపించలేదు. అసలు చెప్పనూలేదు.

సుభదకు మాత్రం చాలా ఆశ్చర్యంగానేవుంది. పెద్దక్కగారి విషయం మాధవుడు అడగని దెందుకు? అక్క యెక్కడకు వెళ్ళిందని ఒక్కసారైనా అడగడేం? పెద్దక్క ఇంటికెందుకు రాలే

దని మారాం చేయడేం? ఇదంతా మాధవుడికి తెలుసని సుభదకు అనుమానం. అయినా ఆమె సాహసించి అడగలేక పోయింది.

ఆరు రోజులయాక హారాన్ ఇంటి ప్రక్కవున్న 'నందు' చేపలు పట్టుకునేందుకు గంగానదికి వెళ్ళాడు. చేపలు పడుతూ పడుతూ, ఓ ఎర్రంచు చీర సగం నీళ్ళలోనూ, సగం బయటా వుండడం చూశాడు. ఆ చీర లలన కట్టుకుని వుండడం అతను చాలాసార్లు చూశాడు. ఆ చీర లలనదేమోనని అతనికి సందేహం కలిగింది. గబగబా పరుగెత్తుకుంటూ వెళ్ళి రాసమణితో నందు ఆ విషయం చెప్పాడు. ఆమె పరుగెత్తుకుంటూ వెళ్లి చీరను చూసింది. గుర్తించేందుకు ఆట్టే ఆలస్యం కాలేదు. అది లలనదే! ఏడుస్తూ దాన్ని ఇంటికి తీసుకవచ్చింది. సుభద, హారాన్, చలన ఆ వీధిలోని వాళ్ళంతా నలుగు రైదుగురు చీరను చూసారు? ఆ చీర లలనదే; ఆమె చేత్తో కుట్టుకున్న అంచు, ఒకప్రక్క ఆమె పేరు స్పష్టంగావున్నాయి. ఇంకేం కావాలి? సుభద మూర్ఛ పోయింది. హారాన్ ముఖర్జీ కూతురు లలన గంగలోపడి చచ్చి పోయిందనేవార్త పల్లెలో వెంటనే వ్యాపించింది.

## 14

నారాయణపురపు జమీందారుగారైన శ్రీమాన్ సురేంద్రనాథ్ చౌదరిగారికి అస్వస్తతగా నున్నందున గాలి మార్పు కావాలన్నారు.

సురేంద్రబాబుగారికి ఆదాయం చాలా వస్తుంది. వయసు యేమంత యెక్కువకాదు. షుమారు ఇరవై ఐదుకంటే యెక్కువ

వుండవు. ఆ వయసులో వారికున్న వ్యసనాలు అన్నీ ఇన్నీ కావు. రండలను కుదిర్చే స్నేహితులే వారికి అధికం.

ఒకనాడు నలుగురైదుగురు స్నేహితులను పిలిచి, ''నా ఆరోగ్యము కొంచెం చెడిపోయినట్లుగా వుంది. మీ అభిప్రాయం యేమిటి?'' అని శ్రీవారు వాక్రుచ్చారు

"అదే మేము చాలా రోజుల్నుంచి తమతో మనవి చేసుకుందామని చూస్తున్నాము. మీకు చెప్తే....కష్టమని ఊరుకున్నాము".

"డాక్టర్ల మందువల్ల లాభమేమీ కనుపించలేదు. గాలిమార్పు జరిగితే గాని నయంకాదని నా నమ్మకము'' అని శ్రీవారు సెలవిచ్చారు.

అందరికీ తెలిసినవిషయమే కాబట్టి, అందరూ ముక్తకంఠంతో ''అంతకంటేనా?'' అని విన్నవించారు.

''కొన్ని రోజులపాటు నీళ్ళమీద చల్లనిగాలితో హాయిగా ప్రయాణంచేస్తే యేం?'' అని శ్రీ సురేంద్రనాథ్‌గారు అన్నారు.

''అవును అంతకంటే కావాల్సింది యేముంది? చాలా మంచి సూచన'' అని వారంతా తలలూపారు.

నీటి ప్రయాణానికిగాను కావలసిన సరంజామా అంతా తయారుచేసి ఓ పెద్ద ఓడను సిద్ధం చేశారు. రెండు నెలలకు సరిపోయే వస్తువు లన్నీ అందులో అమర్చ బడి వున్నాయి. ఓ మంచిరోజున సురేంద్రనాథ్ జమీందారువారు తమతో ముండలను కుదిర్చే స్నేహితుల్నీ బాజా బజంత్రీలనూ, ఓ చక్కని గాయికినీ తీసుకుని బైలుదేరారు. పల్లెవాళ్ళు భగవంతుని పేరు తలుచుకొని లంగరెత్తి నారాయణ నదిలో ఓడను వదిలిపెట్టారు.

అనుకూలమైన గాలిలో, కోస్తాల సాయంవల్ల ఓడ రాజ హంసలా ఈతకొడుతూ వెళ్తూవుంది. మంచి ప్రదేశమున్న చోట లంగరు దించి సురేంద్రబాబు దిగి షికారు చేసేవారు.

ఈ విధంగా యెన్నో ప్రదేశాలు చూశారు. ఎన్నెన్నో షికార్లు అయినై! ఓడ తిన్నగా కలకత్తా రేవుకు వచ్చి చేరింది. అక్కడ కొద్దిరోజులపాటు వుందామని అందరూ అనుకున్నారు. కాని, సురేంద్రబాబుగారికి నచ్చలేదు. "కలకత్తాగాలి ఇతర దేశాల కంటే ఏమంత మంచిదికాదు. ఇక్కడ వుండలేను, ఓడను ఉత్తర దిశకు తిప్పండి" అని తమ ఉత్తర్వును జారీచేశారు.

ఓడ ఒక్కరోజు మాత్రం కలకత్తాలో వుండి ఉత్తర దిశకు దారి తీసింది.

ఓడ కలకత్తా వదిలి వెళుతూన్నపుడు ఓడలోని స్నేహితులకు యెడతెగకుండా ఇన్నాళ్లు ఓడలో ప్రయాణం చేసినందువల్ల జమీందారుగారు ఆరోగ్యవంతులయారనీ ఇక తమ తమ భార్యా బిడ్డల్ని చూసుకుందామనీ ఆలోచన కలిగింది. యెక్కువ దూరం జమీందారుగారితో వెళ్ళేందుకు ఇష్టంలేక ఒకనాడు అందరూ "ఇల్లు వదిలి చాలా కాలమైంది. తమకుకూడా స్వస్థత చిక్కింది. ఇంటికి వెళ్ళేందుకు తమకేమీ అభ్యంతరంలేదనుకుంటాను" అని అన్నారు.

"అభ్యంతరమేమీ లేదుకాని, ఇప్పుడే ఇంటికి తిరిగి రాలేను. మీకేమైనా కష్టముగావుంటే మీరు వెళ్ళొచ్చు"

ఎవరూ ఎదురు చెప్పలేకపోయారు.

ఓడ ఆగుతూ ఆగుతూ వెళ్తూవుంది. శ్రీవారి స్నేహితుల మనసు యేమాత్రం కూడా ఆనందంగాలేదు. "యింటికి వెళ్లాలి" అనేకోర్కె ఎక్కువయిన కొద్దీ వాళ్ళు తెగించి అడిగారు.

సురేంద్రుడు అడ్డేమీ చెప్పలేదు. వెళ్ళమన్నాడు. ఒక వుస్తాద్ ఓ నర్తకీ నావికులు తప్ప మిగిలినవాళ్ళంతా వెళ్ళిపో యారు. సురేంద్రబాబు మిగతావారిని తీసుకుని ముందుకు సాగాడు. ఇంటికి వెళ్దామనే సంగతి ఒక్కమారూ అతనికి గుర్తు రాలేదు.

ఒకనాటి సాయంకాలము పశ్చిమాన్ని మేఘాలు విపరీతంగా పట్టాయ్! సురేంద్రబాబు ఓడకప్తాన్ను పిలిచి "హరిచరణ్! మబ్బులు పడుతున్నాయ్ చూశావా?" అని అన్నాడు.

"చిత్తం బాబూ?"

"యేమనిపిస్తూ వుంది; తుఫానేమయినా వస్తుందా?"

"జ్యేష్ట వైశాఖ మాసాల్లో అప్పుడప్పుడు తుఫాను వసూ వుంటుంది బాబూ"

"అయితే, మరి ఓడను కట్టెయ్"

దగ్గరలో యేమీ చిన్న పల్లెటూళ్లకూడా లేవు. మధ్యలోనే కట్టివేయమన్నారా?

"కట్టివేయకుంటే, మునిగి చచ్చిపోదామా యేం?"

కప్తాను మెల్లిగా నవ్వి "నేనున్నంత కాలం భయమేమీ లేదుబాబూ! తుఫాను వస్తుందనగా లంగరు వేస్తాను" అని చెప్పాడు.

"నీ తెలివితేటల్ని ప్రదర్శించవలసిన పనిలేదు. ముందు లంగరు విసురు. తెలుసా?"

తప్పని సరిగా కప్తాను హరిచరణుడు ఓ మంచి ప్రదేశంలో లంగరు దించాడు. సురేంద్రబాబు ఓడ పైభాగంమీదకు వచ్చి

కూచోవడంతోనే పొగాకుతో నింపిన హుక్కా నౌకరక్కడ పెట్టి వెళ్ళాడు. బాబుగారు హుక్కా గొట్టాన్ని నోటిలో పెట్టుకుని ఓ నౌకరును పిలిచి "వుస్తాద్‌ని ఇక్కడకు పంపు" అని చెప్పాడు.

కొంచెం సేపయాక ఓ హిందుస్థానీ వచ్చి, "బాబూ!" అని సంబోధించాడు.

అవతలి ప్రక్క ఒడ్డున నీళ్ళమీద ఏదో నల్ల వస్తువు లోపలకు దిగుతున్నట్లుంది, సురేంద్రుడు ధ్యానంగా దాన్నే చూస్తూ వున్నాడు. అది ఓ మనుష్యుని తలలావుంది. దాన్నే చూస్తూ వున్నందువల్ల వుస్తాదు కంఠధ్వని ఆయనకు వినిపించలేదు. జవాబేమీ రానందున వుస్తాద్ మళ్ళీ "హుజూర్!" అని జ్ఞాపకం చేశాడు.

సురేంద్రబాబు గబుక్కున ఇటుతిరిగి "వుస్తాద్, ఇప్పుడప్పుడే తుఫాను రానట్టుంది. కొంచెంసేపు, ఆట, పాట కావాలి" అనిచెప్పాడు.

"చిత్తం"

సురేంద్రబాబు తదేకదీక్షగా అవేపే చూస్తున్నాడు.

కొంచెం సేపయాక ఒక యువతి వచ్చి తివాచీమీద కూచుంది వెనువెంటనే వుస్తాద్ తబలా పట్టుకుని వస్తున్నాడు. అది చూసి, "వుస్తాద్ నీవు క్రిందకు వెళ్ళు. ఆటలేమీవద్దు ఊరికినే పాట పాడుతుందిలే" అని సురేంద్రుడు అన్నాడు.

వుస్తాదు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. ఆ తివాచీమీద కూచున్న స్త్రీ పేరు జయవతి! షుమారు ఇరవై ఏళ్ళు వుంటాయ్. ఆమె సురేంద్రుని కృపా పాత్రురాలు! శరీరంమీద సొమ్ములు లేవు. సాధారణపు గుడ్డలుమాత్రం కట్టుకుని వుంది.

సురేంద్రుడు ఆమెవేపు చూసి "జయా! ఇవాళ పగలంతా కనుపించలేదేం?" అని అన్నాడు.

"తల నొప్పిగా వుంది. పడుకున్నాను"

"ఇప్పుడు తగ్గిందా?"

"కొద్దిగా"

"ఏమైనా పాట పాడుతావా?"

"ఆజ్ఞ ఇస్తే"

"ఆజ్ఞయేమిటి? నీ ఇష్టం"

జయవతి పాట మొదలు పెట్టింది. సురేంద్రుడు అవతలి వడ్డున నీళ్ళమీద వున్న నల్లని వస్తువువేపు చూడ్డంలో నిమగ్నుడయాడు. కొంచెం సేపయ్యాక "జయా! అది అటూ ఇటూ కదులుతోంది కదూ?" అని అడిగాడు.

జయవతి పాట ఆపి, దాన్ని బాగా చూసి, "అలానే కనుపిస్తూ వుంది" అని అన్నది.

"అయితే, దుర్భిణీతో చూస్తే?" అని గట్టిగా పిలుస్తూ "అరేయ్, క్రిందనుంచి దుర్భిణీ తీసుకురారా?" అని కేకవేశాడు.

దుర్భిణీ వచ్చాక చాలా సేపు దానితో చూచి, లేచి నిల్చున్నాడు.

జయవతి "ఏమిటి?" అని అడిగింది.

"ఎవరో మనిషిలా వుంది."

"ఇంత సేపటినుంచీ నీళ్ళలో యేం చేస్తున్నట్లు?"

"తెలియదు. దగ్గరకువెళ్ళి చూస్తే తెలుస్తుంది."

"మనిషి నెవరినన్నా పంపండి"

"నేనే స్వయంగా వెళ్తాను" ఆజ్ఞ ఇచ్చిందే తడవుగా, ఓ నావికుడు ఓడకు వెనుక కట్టిన చిన్న డింగీని తీసుకవచ్చాడు.

"అవతలి వడ్డుకు పద"

దగ్గరకు వెళ్ళి చూస్తే, ఓ అమ్మాయి గొంతులోతు నీళ్ళలో వుంది. సురేంద్రుడు కొంచెంసేపు అటూ ఇటూ చూసి, "దగ్గర్లో, ఏమైనా పల్లెటూరు వుందా?" అని అడిగాడు.

"చెప్పలేను, లేదనుకుంటాను."

"అయితే, నువ్విక్కడికి ఎలా వచ్చావు?"

ఆమె మాట్లాడలేదు.

"మీ ఇల్లు ఇక్కడికి దగ్గర్లోనే వుందా?"

"లేదు, చాలాదూరం"

"మరి ఇక్కడి కెలావచ్చావు?"

"మే మెక్కివచ్చిన నావ మునిగిపోయింది."

"ఎప్పుడు?"

"రాత్రి"

"నీ వెంబడివున్నవా శ్కెక్కడ?"

"ఏమయారో తెలియదు."

"అయితే నువ్వింత సేపట్నుంచీ నీళ్ళలో యెందుకు నిల్చున్నావు? దగ్గర్లో యేదయినా వూరు వుందేమో, యెందుకు దేవుల్లాడలేదు?"

ఆమె మాట్లాడలేదు.

జవాబేమీ లేనందున సురేష్‌బాబు "మీ ఊరు ఇక్కడికి యెన్నిమైళ్ళుంటుంది?" అని అడిగాడు.

''షుమారు పది క్రోసులు''

"ఏవేపు ?"

సురేంద్రబాబు ఓడ వెళ్ళే దిక్కువేపే చేయి చూపిస్తూ ''అటు'' అని అంది.

సురేంద్రుడు కొంచెంసేపు ఆలోచించి ''నేనూ అటువేపే వెళతాను. నా ఓడలో ఇంకో అమ్మాయికూడా వుంది. మీ కేమీ అభ్యంతరం లేకపోతే మా వెంబడి రావచ్చు. నేను మిమ్మల్ని మీ ఇంటికి పంపిస్తాను" అని చెప్పాడు.

ఆమె మాట్లాడలేదు.

జవా బేమీ రానందున సురేంద్రబాబు ''వస్తావా ?'' అని మళ్ళీ అడిగాడు.

''వస్తాను''

"అయితే రా"

ఆమె యెందుకు నీళ్ళల్లో ఇంత సేపట్నుంచీ వుందో గ్రహించుకుని ఒడ్డున తను దిగి, ఓడలోంచి గుడ్డలు తెమ్మని చెప్పి మళ్ళీ "మరి నా వెంటబడి వస్తావా ?'' అని అడిగాడు.

"ఆ'' అంటూ తలూపింది,

నావికుడు గుడ్డలు తీసుకుని తిరిగి వచ్చాడు.

కొంచెం సేపయాక ఆమెను తీసుకుని సురేంద్రుడు ఓడలోకి వెళ్ళి జయవతికి వప్పగించాడు. ఆమె ఆ పిల్లను తన గదిలోకి తీసుకవెళ్ళి అన్నం అదీ అయాక కూర్చోపెట్టి "నీ పేరేమిటీ చెల్లీ ?'' అని అడిగింది.

"మాలతి, మరి మీ పేరు ?''

"జయవతి. మీ ఇల్లెక్కడ?"

"మహేళపూర్"

"ఇక్కడికి ఎంత దూరం?"

"పది పన్నెండు కోసులు, ఉత్తరపు వేపు"

"మీ అత్తవారి దేవూరు?"

"ఏవూరూ లేదు"

"అదేమిటమ్మా! పెళ్ళికాలేదా?"

"అయింది.....అదంతా ఓ కలలా అయిపోయింది"

కొంచెం విచారంగా జయవతి "యెన్నిరోజు లయింది?" అని అడిగింది.

"చాలా రోజులయింది. యేమని చెప్పను? అదంతా నాకు సరిగ్గా జ్ఞాపకం కూడా లేదు"

జయవతి మధ్యలోనే ఆపి, "అయితే మీ ఇంట్లో ఎవరెవరున్నారేం?" అని అడిగింది.

"యెవ్వరిగా లేరు. ఒక మేనత్తగారు మాత్రం వుండేది. ఇప్పుడు ఆమెకూడా లేదనుకుంటాను"

"మీరందరూ యెక్కడికి వెళ్తున్నారు చెల్లీ?"

మాలతి కొంచెం ఆలోచించి "సాగరద్వీపం" అని అంది.

"నీ వెంట వున్న వాళ్ళంతా యేమయ్యారు?"

"తెలియదు"

"యిప్పుడిక ఇంటికి వెళతావా?"

"అదే, ఆలోచిస్తున్నాను"

మెల్లిగా నవ్వుతూ జయవతి "మరి నా వెంబడి వస్తావా?" అని అడిగింది.

"నాకుమాత్రం యెవరున్నారు? తీసుకవెళ్తే తప్పకుండా వస్తాను. 'నా' అనేవాళ్లెవరూ లేని యీ దిక్కులేనిది యింటికి వెళ్తేమాత్రం ఎవరి దగ్గరని వుంటుంది"

మాలతిని తీసుకవెళ్ళడం జయవతికి ఇష్టం లేకపోయినా సురేంద్రబాబు..................

"మీ ఊరెక్కడ?" అని మాలతి ఆమెను అడిగింది.

"నారాయణ పురం"

"యెక్కడికి వెళ్తున్నారు?"

"యెక్కడికని చెప్పను? హాయిగా తిరిగేందుకు. బాబుగారి ఆరోగ్యం సరిగ్గా ఉండకపోవడం మూలాన. యీ ప్రయాణం" ఇంకా ఏ మేమో మాట్లాడుకున్నాక ఇద్దరూ నిద్రపోయారు.

# 15

ఆ రాత్రి సురేంద్రబాబుకు సరిగ్గా నిద్రపట్టలేదు అందుకని పెందలాడే లేచి, ముఖం, కాళ్ళూ కడుక్కుని హుక్కా గొట్టాన్ని తీసుకుని వోడ పైభాగంమీద కూచున్నారు. గాలిబాగా వీస్తోంది. నావికులు లంగరెత్తి వోడను నడుపుతున్నారు. పగలు కొంత గడిచాక జయవతిని పిలిచి, "ఆమెను గురించి యేమైనా సంగతులు తెలుసుకున్నావా?" అని సురేంద్రుడు అడిగాడు.

"ఏదో కొంచెం"

"యేమూంటు?

"మహేశపురం"   "యెక్కడుంది?"

"అది నాకు తెలియదు. ఇక్కడికి పది క్రోసులదూరంలో వుత్తరంగా వుందట."

"తండ్రి పేరేమని చెప్పింది,"

"అడగలేదు."

"అయితే ఇంతకూ యేదో కొంచెమయినా తెలుసుకున్నా వన్నమాట. మరి భర్తపేరేమని చెప్పింది?"

"భర్తగారు లేరట"

"మామగారి వూరు?"

"చెప్పలేదు."

"ఇంతకూ అసలు సంగతేమిటో తెలుసా?

"లేదు."

మరి, పేరేమని చెప్పింది?"

"మాలతి."

"యేమీ అనుమానం లేకపోతే, ఆమెను కొంచెం ఇటు నా గదిలోకి రమ్మనమని చెప్పు. స్వయంగా నేనే ఆమె సంగ సంగతేమిటో కనుక్కుంటాను."

కొంచెం సేపయాక నౌకరువచ్చి "గదిలోకి రండి" అని చెప్పి వెళ్ళాడు.

వెంటనే సురేంద్రుడు గదిలోకి వెళ్ళాడు. క్రింద పరిచివున్న తివాచీమీద మాలతి తల వంచుకుని కూచునివుంది. జయవతి ప్రక్కనే నిలుచుని సురేంద్రబాబు రాగానే, బైటకు వెళ్ళి పోయింది.

సురేంద్రుడు కుర్చీమీద కూచుని చాలాసేపు మాలతిని చూసి. 'భగవంతుడు ఇంత అందాన్ని ఇచ్చికూడా యీ విధంగా

విధవను చేశాదేమో?' అని అనుకుని ''నీ తండ్రిగారి పేరేమిటి?''
అని అడిగాడు.

''శ్రీ హరాన్ చంద్ర ముఖోపాధ్యాయులు.''

''వారు వున్నారా ?''

"లేదు, వారిప్పుడు లేరు.''

సురేంద్రుడు ఆమె తండ్రి చనిపోయాడని తెలుసుకుని 'ఇంట్లో ఇంకా యెవరెవరున్నారు ?'' అని అడిగాడు.

చాలా సేపు మౌనంగావుండి చివరకు మెల్లమెల్లగా ''యెవరూ లేరనుకుంటాను'' అని ఆమె అంది.

"ఇన్ని రోజులనుంచి యెక్కడని వున్నావు ?''

''అక్కడే వున్నాను. మేమంతా సాగర ద్వీపం వెళ్తూంటే, దారిలో యిలా నావ మునిగిపోయింది.

''మీ మామగా రెక్కడున్నారు.

''కాళీ పాడాలో ?''

"అక్కడ నీ కెవరున్నారు ?''

''ఒకవేళ యెవరైనా వున్నా, నేను వారి నెవర్నీ గుర్తించ లేను."

''అక్కడికి, ఎప్పుడూ వెళ్ళలేదా ఏం ?''

''వివాహమైన తరువాత, ఒకసారి మాత్రమే వెళ్ళాను.''

సురేంద్రుడు కొంచెంసేపు ఆలోచించి ''నీ పుట్టింట్లో యెవరూ లేరాయె. మరి అటువంటప్పుడు నీవు ఇక యెక్కడికని వెళ తావు ?" అని అన్నాడు.

''కలకత్తా''

"కలకత్తా! అక్కడెవరున్నారు?"

"ఎవరూ లేరు."

"యెవ్వరూలేరూ? అయితే యెక్కడని వుంటావు?"

"యెవరి యిల్లన్నా వెదుక్కుంటాను."

"యెందుకని?"

మాలతి మాట్లాడలేదు.

సురేంద్రుడు అడిగాడు "నీకు వంటచేయడం తెలుసా."

"ఆ!"

"కలకత్తాలో యెక్కడనా వంటపని చేస్తావా యేం"

"ఆ!"

సురేంద్రుడు కొంచెంసేపు మౌనంగావుండి మెల్ల మెల్లగా "మాలతీ, కలకత్తాలో కాకుండా యింకెక్కడయినా అటువంటి పని దొరికితే చేస్తావా?" అని అడిగాడు.

"చేయను"

ఆ జవాబు సురేంద్రబాబుని నిరాశ పరిచిన ట్లనిపించింది. సురేంద్రుడు వో నిట్టూర్పు విడిచాడు.

సురేంద్రుడు రెండోవేపు చూస్తూ "తెలియని వాళ్ళకు కలకత్తా చాల చెడ్డ ప్రదేశం. సరే, నీ యిష్టమేదో అదే కానీయ్. అయినా చాలా జాగ్రత్తగా వుండు. యింకో సంగతి. నా పేరు సురేంద్రనాథ్ చౌదరి, యెప్పుడయినా అవసరం కలిగితే నారాయణపురానికి నాకు కబురుపంపు, లేకపోతే తిన్నగా అక్కడికే వచ్చేసెయ్! యేదయినా కష్టం కలిగినట్లయితే నేను కొంచెం వుపకారం చేస్తాను" అని చెప్పాడు.

మాలతి తలవంచుకుని అలానే కూచుంది.

"మేము వో పక్షం రోజులలో కలకత్తావేపు వెళతాము. అందాకా ఇక్కడే వుండు."

సురేంద్రబాబు వెళ్ళాక మాలతి తన చోటుకు వచ్చి యేడుస్తూ కూచుంది. సురేంద్రబాబు మాటలకు నొచ్చుకున్నది. యదార్థమైనా, ఆ యేడ్పుకు యింకా బోలెడు కారణాలున్నాయ్!

సురేంద్రబాబు ఆమె సిగ్గును కాపాడి, ఓడలో స్థలమిచ్చాడు. ఉపకారంచేసి. యింకా ఎన్నో చేసేందుకుగాను ముందుగనే మాటకూడా యిచ్చాడు. అయితే తను ఎవరికని వంట చేసేందుకు కలకత్తా వెళుతూవుంది? స్నేహమయి అయిన తల్లీ, జబ్బులోవున్న తమ్ముడూ, దిక్కూ మొక్కూలేని ఆ పరివారాన్ని వదిలి వంటచేసి తన పొట్టను నింపుకునేందుకే వచ్చిందా?

వంట చేయడమనేది నామ మాత్రంగా అడ్డు పెట్టుకుని డబ్బును సంపాయిద్దామని ఆమె అనుకుంది. డబ్బును సంపాదించే విధంకూడా ఆమెకు తెలిసింది మాలతి అందగత్తె! ఆమెకు అందానికేమీ తక్కువ లేదు. కలకత్తా పెద్ద పట్నం. తన అందాన్ని తీసుకుని వెళ్ళి అక్కడ అమ్మేందు కేమీ కష్టపడవలసిన పనిలేదు. ఆమె రూపానికి తను అనుకున్నదానికంటే యింకా యెక్కువే దొరకవచ్చు! అందుకనే కలకత్తా వెళ్దామనే నిశ్చయం అంత దృఢంగా ఆమెలో నాటుకుంది. ఆమెకు అది కేంద్రమవుతుంది బీవదల్లా ఆమె గొప్ప ధనవంతురాలవుతుంది. జీవితాన్నింత కాలమూ కష్టాల్లో పెరగనిచ్చినా. ఆమె యిక సుఖానికి అలవాటు పడుతుంది.

రెండోరోజు ఓడ ''హాలాద్‌పురం'' క్రిందుగా వెళుతూ వుంది. మాలతి కిటికీ తెరిచి తిన్నగా వడ్డువేపు చూస్తూవుంది. వడ్డుమీద యెవరూలేరు. యే ఆశతో మాలతి ఆ వేపుకు వచ్చి కూచుందో ఆ ఆశ పూర్తికాలేదు. పల్లెకు చాలా దూరంగా ఓడ నడుస్తూ వుంది. మాలతి కిటికీ మూసి, వెక్కి వెక్కి యేడ్చింది. జయవతి దగ్గిరకు వచ్చి కూచుని, ఆమె కన్నీళ్ళు తుడిచి ''యేడిస్తే యిప్పు డిక యేమవుతుందమ్మా! యింతకూ వాళ్ళకు కాలం తీరిపోయింది. అందుకనే, గంగానదీమతల్లి వాళ్ళను లాక్కుపోయింది'' అని అంది.

నావ మునిగి వాళ్ళందరూ చచ్చిపోయారనే తలపుకు వచ్చి మాలతి యేడుస్తోందని జయవతి అనుకుంది. జయవతి మాలతి కంటే వయసులో పెద్దది. ఆమె మాలతిని తన చెల్లెలుగా చూసుకుంటూ వుంది.

మాలతి కలకత్తాలో దిగిపోతుందనే కబురు విని తరువాత ఆ స్నేహం యింకా యెక్కువైంది. మాలతిలేచి కూచున్నాక జయవతి ఆ మాటా యీ మాటాచెప్పి ఆమెను యీవిచారంనుంచి మరిపిద్దామని యింకా చూస్తూ కూచుంది.

## 16

పవిత్రవంతమైన కాశీపట్టణంలో చచ్చిపోయినట్లయితే శివ సాయుజ్యం ప్రాప్తిస్తుందని హిందువుల విశ్వాసం. అందుకోసమే సదానందుని అత్త కాశీకివెళ్ళి తిరిగిరాలేదు. అదృష్టవంతు

రాలయిన అత్తగారి శరీరాన్ని కాశీగంగలో కలిపి శివలోకం ప్రాప్తించేట్లు చేసి సదానందుడు వంటరిగా హాలాడ్‌పురం తిరిగి వచ్చాడు.

నిర్మానుష్యమైన తన యింట్లోకి చాలరాత్రి గడిచాక సదానందుడువచ్చి స్వయంపాకం చేసుకుని తిన్నాడు. హారాన్‌బాబింటికి వెళ్ళి సంగతులు తెలుసుకుందామని అనుకున్నాడు కాని, అంత రాత్రప్పుడు వెళ్ళకూడదని పక్కమీద పడుకున్నాడు. కాశీలో వున్నప్పుడు హారాన్‌బాబు దుశ్చరిత్రము, సుభద దౌర్భాగ్యమూ లలన దుఃఖజీవితాన్ని గురించీ ఆలోచించేవాడు. రోగంతో బాధపడుతూన్న అత్తగారి సేవచేస్తూ కూడా అతను వీళ్ళను మర్చిపోలేకపోయాడు. మధ్యలో ఒకసారి వుత్తరం వ్రాసి సంగతులు తెలుసుకున్నాడు. కాని, తరువాత అటునుంచి కాని యిటునుంచి కాని వుత్తర ప్రత్యుత్తరాలు ఏమీ లేక పోయినై. సరిగ్గా ఒక నెలనుంచి యేసంగతీ అతనికి తెలవలేదు. రాత్రి చాలా సేపటివరకూ మేలుకుని యింటి వాసాలు లెక్కపెడుతూ, ఆలోచిస్తూ నిదురపోయాడు.

రెండోరోజు శ్రీమాన్ సదానంద చక్రవర్తి పూలూ, బేల పత్రాలు, విశ్వనాథుని ప్రసాదం మొదలైన వస్తువులు చేత్తో పట్టుకుని హారాన్‌బాబింటికి వచ్చాడు.

లోపలికి వెళ్ళగానే, ఎదురుగుండా సుభద కనుపించింది. సుభద వసారా వూడుస్తూ వున్నదల్లా, చీపురు క్రిందవేసి, తలమీద గుడ్డను కొంచెం ముందుకు లాక్కుని బొంగురు పోయిన కంఠతో "ఎప్పుడు వచ్చావు సదా... ;" అని అడిగింది.

''రాత్రి....''

అందరూ బాగావున్నారా ?''

సదానందుడు విచారంతో నవ్వుతూ ''అందరూ యెవ రున్నారు అత్తా, నేనేగా ? అత్తకు కాశీలో స్థానం దొరికింది'' అని చెప్పాడు.

సరిగ్గా తెలుసుకోలేక సుభద "ఏమి దొరికింది....?'' అని అడిగింది.

''అత్తగారు కాశీలో చనిపోయింది.''

సుభద కీవిషయం తెలవదు. అసలే దుఃఖంతో యేడుస్తు ఆమెకు రెండో దుఃఖంకూడా తోడుగా దొరికినందున గట్టిగా యేడ్చింది.

చాలాసేపు యేడ్చి ''నాయనా! లలనకూడా లేదు'' అని మెల్లగా చెప్పింది.

"చకితుడయి సదానందుడు "ఎక్కడి కెళ్ళింది ?'' అని అడిగాడు.

సుభద ఏడుస్తూ "ఎక్కడి కెళ్తుంది నాయనా ? ఈ ప్రపంచం లోని కష్టాల్ని భరించలేక ఆత్మహత్య చేసుకుంది. ఆమె చీర నాలుగు రోజుల క్రితం గంగానది ఒడ్డున దొరికింది'' అని వెక్కి వెక్కి ఏడ్చింది.

సదానందుడు కూడా తన కళ్ళను తుడుచుకొని సుభదను ''ఏమయినా చెప్పి వెళ్ళిందా ?'' అని అడిగాడు.

''ఏమీ చెప్పలేదు.''

''హారాన్ తాత యెక్కడికి వెళ్ళాడు ?''

"తెలియదు. అప్పు డప్పుడు ఇంటికి వస్తూ వుంటాడు. ఎక్క-డికి వెళ్తుంటాడో, ఏమో ?"

"ఇప్పుడు ఏం చేస్తున్నాడేం ?"

"అదికూడా తెలవదు."

"మాధవునికి యెలా వుంది ?"

"ఏమని చెప్పను ? ఎప్పటి మాదిరిగానే !"

"మిగిలిన అందరూ ?"

"బాగానే వున్నారు."

సదానందుడు లేచాడు. సుభద "నీకు అన్నం ఎవరు వండి పెడుతున్నారు నాయనా ?" అని అడిగింది.

"ఎవరున్నారు. నేనే !"

కొంచెంసేపు ఆలోచించి "ఇక్కడ తినకూడదూ ?" అని సుభద అడిగింది.

"ఎందుకు తినకూడదు? అయినా అంత అవసర మేముంది ? అన్నం వండుకునేందుకు నాకేమీ కష్టంగాలేదు."

"అదేముంది? నీవు ఇక్కడే తింటూ వుండు."

కొంచెంసేపు సదానందుడు ఆలోచించి "ఇవాళకాదు. ఇప్పుడు అత్తగారికి తర్పణము వదలాలి" అని చెప్పాడు.

సుభద ఆలోచించి సరేనంది.

సదానందుడు ఇంటికి తిరిగివచ్చి ఓ గదిలోకి వెళ్ళి, తలుపు వేసుకుని నేలమీద పడుకున్నాడు. అప్పుడు సరిగ్గా పగలు ఎనిమిదవుతుంది. అతను లేచేప్పటికి రాత్రి ఎనిమిదయింది. చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. తిన్నగా బైటకు వచ్చి "శారదా" అని కేకేశాడు.

శారదాచరణుడు ఇంట్లోనే వున్నాడు. సదానందుని కంఠధ్వని విని కిటికీ దగ్గరకువచ్చి "ఎవరూ?" అని అడిగాడు.

"నేనే"

"యెవరూ సదానందా?"

"అవును"

"ఎప్పుడొచ్చావు?"

"నిన్నటి రాత్రి"

"ఇటువేపు వచ్చావేం? వరండాలో కూచుందాంరా"

"వద్దు. అక్కడకు వద్దు. నీవే ఇక్కడికిరా"

శారదాచరణుడు దగ్గరకు వచ్చాక "లలన చనిపోయిన సంగతి నీకు తెలుసా?" అని సదానందుడు అడిగాడు.

శారదాచరణుడు వుదాసీనంగా "తెలుసు"

"ఆమె ఎందువల్ల చనిపోయిందో, యేమయినా తెలుసుకున్నావా?"

"లేదు. అయినా, కష్టాలు భరింపలేక ఆత్మహత్య చేసుకుందను కుంటాను"

తీక్షణంగా శారదా చరణుని చూస్తూ "ఇంకేమీ తెలియదు?" అని సదానందుడు అడిగాడు.

"తెలియదు"

సదానందుడు తన తీక్షణ దృష్టిని ఇంకా తీక్షణంగా శారదా చరణునిమీద పరుపుతూ "నీవు మూర్ఖుడవు. డబ్బులేక కష్టాలకు గురియై ఓ మనిషి ఆత్మహత్య చేసుకుంటూవుంటే యెదురుగుండా వుండి యేమీ సాయం చేయకుండా నువ్వు వూరుకున్నావన్నమాట?"

సదానందుడు, శారదాచరణుడు బాల్య స్నేహితులు. చిన్నప్పటి సంగతులు యెన్నో సదానందునికి తెలుసు. ఆ సంగతులన్నీ యెత్తి పొడవడానికి సదానందుడు వచ్చాడని శారదాచరణుడు గ్రహించి "సదానందా ఇక ఆ మాటలవల్ల లాభమేమిటి? నా తండ్రి జీవించే వున్నాడని మరిచిపోకు! అతను వుండగా నే నెవరికీ సాయం చేయలేను. అదీగాక, ఆమె యేమీ నాతో చెప్పలేదు. అడగనూలేదు" అని చెప్పాడు.

సదానందుడు ఆశ్చర్యంతో "యేమీ చెప్పలేదూ? చెప్పేందుకు ఆసలు ఇటువేపే రాలేదా?" అని అడిగాడు.

"ఆ. చాలా రోజుల క్రితం ఒకసారి వచ్చింది"

"ఎందుకు? ఎక్కడికి?"

"షుమారు ఓ నెల రోజులముందు చాల పొద్దుపోయిన తర్వాత ఆమె నన్ను శివాలయంలోకి రమ్మనమని కబురు చేసింది. వెళ్ళడానికి ఇష్టం లేకపోయినా వెళ్ళాను"

"వెళ్ళటానికే ఇష్టంలేదూ?"

"అయిపోయినదాన్ని, త్రవ్వడం దేనికి?"

"తరువాత?"

"పెండ్లి చేసుకోమని చెప్పింది?"

"ఎవరితో?"

"తనతోనే?"

"తనతోనేనా? లలనతోనా? మరి నీవేమని చెప్పావు?"

చిన్నప్పటి సంగతులు జ్ఞాపకం తెచ్చుకుని శారదాచరణుడు చిన్నబుచ్చుకున్నాడు. "నేనేం చేయను జెప్పు? నాయన ఇంకా బ్రతికే వున్నాడు?" అని అన్నాడు.

కోపంతోనూ, విచారంతోనూ సదానందుడు వుండబట్టలేక "నీతండ్రిగారు బ్రతికున్నారు. మరి లాభమేమిటి?" అని అడిగాడు.

శారదాచరణునికి కోపం వచ్చింది, నాన్నగారి విషయంలో ఎవరు ఏమన్నా అతను ఒప్పుకోడు "లాభ నష్టాల సంగతి ఆయనకే తెలుసు. యీ విషయంలో ఆలోచించేందుకు నా కేమీ అధికారంలేదు. పైగా అది నాకేమీ బాగోదు. అయిందేదో అయిపోయింది. నేను పెళ్లిచేసుకోలేనని ఆమెతో చెప్పాను" అని చెప్పాడు.

"ఆమె వెళ్లిపోయిందా?"

"లేదు, ఆఖరికి చలన నన్నా పెళ్ళిచేసుకోమని కోరింది"

"దాన్నికూడా నీవు ఇష్టపడలేదా?"

"లేదు. నాన్నగారి కిష్టముంటే నాదేమీ లేదన్నాను"

"మీ నాన్న ఇష్టపడలేదు కదూ?"

"లేదు."

"యెందుకని?

"చెప్పడానికి ఇష్టంలేకపోయినా చెపుతాను. నా పెళ్ళికేమయినా డబ్బు వస్తుందేమోనని మా నాన్నగారి అభిప్రాయం. హారాన్ బాబేమి యివ్వగలడు?"

"మీ నాన్న యెంత అడిగాడు?

"నేను చెప్పలేను"

"అత నడిగినంత ఇస్తే ఇంకేమీ అభ్యంతరము లేదనుకోవచ్చా?"

''లేకపోవచ్చు.''

"మరి. నీ అభ్యంతర మేమయినా వుందా ?"

"ఏమీ లేదు.''

''అయితే చూస్తాను" అంటూ సదానందుడు లేచాడు.

''ఎక్కడికి వెళ్తున్నావు ? కొంచెంసేపు కూర్చోవా ఏమిటి ?''

''పనుంది."

''సదానంద్. అందులో నా తప్పేమీ లేదు.''

''సరే, ఆ సంగతి భగవంతుడికి తెలుసు!''

''కోపం వచ్చిందా ?''

''లేదు.''

సదానందుడు ఇంటికివచ్చి ఆ గదిలోంచి యీ గదిలోకి యీ గదిలోంచి ఆ గదిలోకి తిరిగాడు. తరువాత బైటకువచ్చి తిన్నగా గంగానదివేపు వెళ్ళాడు. భాగీరథిలోని చిన్నచిన్న కెరటాలు మెట్లకు తగిలి 'ఝుమ ఝుమ' మను ధ్వని చేస్తూ, వస్తూ వెళుతున్నాయ్! ఆ తమాషాను చూస్తూ కొంచెంసేపు నిలుచున్నాడు. దూరాన్నుంచి ఓ ఓడ గంగానది నీటిని కోసుకుంటూ, మెల్లిగా వెళ్తూంది. తరువాత రేవులోని ఆఖరి మెట్టు మీద కూచుని నీళ్ళల్లోకి కాళ్ళుజాపి మనసుకొద్దీ సంతోషంగా పాడటం మొదలు పెట్టాడు.

## 17

పుచ్చపువ్వులాంటి ఆ నాటి రాత్రి వెన్నెల్లో—గంగా ప్రవాహంలో సురేంద్రబాబుగారి ఓడ మెల్ల మెల్లగా ఉత్తరం నుంచి దక్షిణంగా సాగిపోతూంది,

డెక్కమీద సురేంద్రబాబూ, జయవతీ కూర్చుని మాట్లాడు కుంటున్నారు. క్రింది భాగంలోని కిటికీ తెరిచి మాలతి గంగానది కెరటాలు చూస్తూ కన్నీళ్ళు తుడుచుకుంటోంది. ఇక హేరాద్ పురం వస్తుందని మాలతి తెలుసుకుంది. కొంచెం ముందుకు వచ్చాక, తీరాన్నే వున్న చిటికేసరపు చెట్టుకనుపించింది. ప్రక్కనే గంగానది మెట్లు కెరటాల దెబ్బలకు 'చమక్, చమక్' మంటు న్నాయి, దాని వెనుకనే హేలాద్‌పురం నిశ్శబ్దంగా నిద్రపోతూ వుంది. నిద్రపోతూవున్న ఆవూరి ఆడ మగవాళ్ళను ఒక్కొక్క ళ్ళనే మనసులో వూహించుకుంటూ కూచుంది. గంగలోస్నానం చేసి గుడ్డలువుతకడం అన్నీ మాలతికి జ్ఞాపకం వచ్చినై. మాలతి ఇప్పుడు లలనకాదు. అయినా, సుభదను, మాధవుని, చలనను హేరాన్ను మరచిపోలేదు. తనసదాన్నయ్యను కూడా ఆమె మరిచి పోలేదు. సదానందుడు ఆమె మనసులో సగభాగాన్ని ఆక్ర మించి కూచున్నాడు. అతని పాట చెవుల్లో ప్రతిధ్వనిస్తూంది. ఆ పాటను నిజంగా సదానందుడు తప్ప ఇంకెవరు పాడతారు? కొంచెం ముందుకు వెళ్ళాక, తీరపు రేవులోని ఆఖరిమెట్టుమీద కూచుని యెవరో నీళ్ళలో కాళ్ళు ఆడించడం ఆమె చూసింది. అప్పటికి పాట ఆగిపోయింది. అతనెవరు? తనకు తెలిసున్నంత వరకు అతను సదానందుడే.

ఆ పిచ్చివాడు తప్ప ఇంత రాత్రప్పుడు ఇంకెవడు గంగకు పాట వినిపించడానికని వస్తాడు? మాలతి చాలా రాత్రివరకు యేడ్చి నిద్రపోయింది.

మెలకువ వచ్చేలోగా సూర్యుడు చాలా పైకి వచ్చాడు. మాలతి లేవలేకపోయింది. తలనొప్పితో శరీరం వెచ్చబడింది

దాసీది వచ్చి వంటిమీద చేయిపెట్టి "మీకు జ్వరం వచ్చిన దమ్మా?" అని చెప్పింది.

అప్పటికి మాలతి జవాబు చెప్పలేదు. జయవతివచ్చి తల ముట్టుకుని కిటికీ తెరచి వుండడం చూసి "యీ విధంగా కిటికీ తెరిచి పడుకుంటే చల్లగాలి తగిలి వొళ్ళు వెచ్చబడింది" అని అంది.

"నిద్రవస్తే కిటికీ మూయడం మరిచి పోయాను" అంది మాలతి.

సురేంద్రబాబు వచ్చిచూసి, తన వద్దవున్న హోమియోపతి మందును ఇచ్చి జయవతిని దగ్గరే కూర్చోమని చెప్పి వెళ్ళాడు.

ఆ గది కిటికీలన్నీ మూసివున్నాయ్! స్టీమరు వెళుతూవుందో ఆగివుందో మాలతికి తెలియదు.

జయవతి తప్ప ఆ గదిలో యెవరూ లేరన్న సంగతి తెలుసుకుని "అక్కాయ్, మనం ఎంతదూరం వచ్చాము?" అని అడిగింది.

"ఎనిమిది కోసులు వచ్చి వుంటాము"

"కలకత్తా ఇంకెంత దూరం ఉంటుందమ్మా?"

"షుమారు ఇంకా, రెండురోజుల ప్రయాణం"

మాలతి యేమిటో ఆలోచించి "అయితే అక్కాయ్! అంత వరకూ నాకు నయంకాకుంటే?" అని అడిగింది.

జయవతి ఆ అర్థాన్ని గ్రహించి "మేము నిన్ను యీ నీళ్ళలో పారేస్తాము" అని నవ్వుతూ అంది.

మాలతికూడా మెల్లగా నవ్వింది. మాలతి నవ్వుకూ జయవతి నవ్వుకూ కొంచెం తేడావుంది. "నీళ్ళల్లో పారేస్తే మరీ మంచిదే అక్కాయ్!" అని అంది ఆమె.

అలా అంటుందని జయవతి అనుకోలేదు. "ఛీ, అటువంటి మాట అనకూడదమ్మా!"

మాలతి యేమీ మాట్లాడకుండా జయవతి అన్నమాటలు ఒక వేళ నిజమే అయితే? అని ఆలోచించింది. చావంటే ఆమెకు భయంలేదు. కాని చచ్చిపోయేముందు........ఆమెకు ఇష్టంలేదు. కన్నీళ్ళ చుక్కలు రెండు క్రిందపడినై.

జయవతి వాటిని తుడుచి "విచారపడతావేం చెల్లీ? చల్లని సీటిగాలి తగిలినందున వళ్ళు కొంచెం వెచ్చబడింది. అంత మాత్రానికే విచారించాలా?" అని కొంచెం ఆగి మళ్ళీ ఆలోచించి "ఒకవేళ ఏమైనా యెక్కువైతే కలకత్తా దగ్గరేగా! అక్కడ వైద్యులకీ, డాక్టర్లకీ తక్కువలేదు. ఎక్కడ చూచినా డాక్టర్లే?" అని చెప్పింది.

కలకత్తా స్టీమరు ఆగేరోజుకి మాలతికి జ్వరం తగ్గిపోయింది. అయినా బలహీనత, నీరసమూ ఇంకా యెక్కువగానే వున్నాయి. స్టీమరును కలకత్తా పక్కగా ఆపి, లంగరు దించారు. మాలతి అక్కడున్న ఓడలనూ, పెద్ద నావలనూ, బోట్లనూ, కిటికీలోంచి చూసి, కలకత్తా అంటే, యిదేనా? అనుకుంది.

ఈ అరుపుల్లో, యీ గోలలో, యీ విశాలమైన వీధుల్లో తన గోడు యెవరు వింటారు? ఇలాంటి యెడతెరిపిలేని పని పాటలు గల పట్టణంలో తనను చూసే దెవరు? తను యిక తప్పకుండా అక్కడ దిగిపోవాలి. యెవరికోసం ఆమె యింత సాహసం చేసిందో, యెవరి ముఖాన్ని చూసి ఆమె యీ నరక కూపంలోకి కూడా వురుకుదామని వచ్చిందో, ఆ ముఖాన్ని యింకా మాలతి

మరిచిపోలేదు. ఇప్పుడు కాకపోతే రేపయినా తాత్కాలికమైన యీ ఆశ్రయాన్ని తను వదిలిపెట్టాలి. వదిలిపెట్ట దలచుకున్నప్పుడు భయపడితే లాభమేమిటి?

ఆమె వెళ్ళడానికే నిర్ణయించుకుంది. కాని, సురేంద్రబాబు తన స్టీమరు యింకా నాలుగైదు రోజులు వుంటుందనీ, శరీరంలో బాగా నెమ్మదించిన తర్వాత వెళ్ళవచ్చుననీ చెప్పాడు.

రెండోరోజు మధ్యాహ్నం జయవతి కలకత్తా పట్టణం చూద్దామని బయలుదేరి సురేంద్రబాబుని కూడా రమ్మని ప్రతిమిలాడింది. ఆయన రానంటే రానని, మాలతిని తీసుకువెళ్తే ఆమెకు మళ్ళీ సుస్తీ చేస్తుందనీ నివారించాడు. విసుగుచెంది జయవతి వంటరిగానే వెళ్ళింది.

మాలతి గదిలో పడుకునివుంది. సురేంద్రబాబు తలుపు తెరిచి లోపలకు వెళ్ళాడు. మాలతి సంకుచిత దృష్టితో చూసింది. సురేంద్రబాబు దూరంగా కూచున్నాడు చాలా సేపయాక సురేంద్రుడు "నిజంగా నువ్విక్కడ దిగిపోతావా?" అని అడిగాడు.

తల ఆడిస్తూ "అవును" అని మాలతి అంది.

"బాగా ఆలోచించావా?"

"ఊఁ!"

"మరి, యెక్కడికి వెళ్తావు?"

"అది యింకా ఆలోచించుకోలేదు"

సురేంద్రబాబు నవ్వుతూ, "ఆలోచన యెందుకు?" యివాళ కాకపోతే రేపయినా ఒకసారి కలకత్తాను చూసిరా!" అని చెప్పాడు.

మాలతి మాట్లాడలేదు.

సురేంద్రబాబుకూడా చాలాసేపు ఆలోచించి "నీవెంతగా ఆలోచించలేవో, నేనంతగా ఆలోచించి చూశాను. నీవు బ్రాహ్మణపిల్లవు....పాపపుపని చేయలేవు గొప్పవారి బిడ్డవై, గొప్పింటిలో స్థానం దొరక్కపోతే, నీవే మాత్రం వుండలేవు. ఈ అసహాయమైన అవస్థలో ఇంతపెద్ద పట్టణములో, యెలా జాగ్రత్తగా సంచరిస్తావో నాకేమీ పాలుపోవడంలేదు" అని కొంచెం సేపాగి, మళ్ళీ "యింకాఆలోచించు. నీకున్న యీ వయసులో గౌరవాన్నీ మర్యాదలూ కాపాడుకుంటూ నువ్వెళ్ళగలవా! అడుగడుక్కీ నువ్వెన్నో కష్టాలు భరించాల్సి వుంటుందనీ, మోసకారులైన ప్రజలముందు అమాయకురాలివై యుక్తవయస్సులో వున్న నువ్వు చాలా యమయాతనలు పడతావనీ నాకు భయంగా వుంది" అని చెప్పాడు.

మాలతి మెదలకుండా యేడుస్తూవుంది.

"వెళ్ళడమే నిశ్చయించుకున్నావా?" అని మళ్ళీ అడిగాడు.

మాలతి కళ్ళు తుడుచుకుంటూ "ఆ!" అని అంది.

"అయితే మాలతీ, నీకు డబ్బుతో యెక్కువ పనుంది కదూ?" ఆమె కళ్ళవెంట నీళ్ళు జల జల రాలాయ్? అంత అవసరము ప్రపంచంలో యింకెవరికీ వుండదు.

"చాలా అవసరం కదూ?"

"అవును"

సురేంద్రుడు నవ్వాడు. ఆమె మనస్సును గ్రహించేందుకు అతనికి అట్టేసేపు పట్టలేదు. మాలతి యేడ్పు చూసి అతనికి నవ్వు వచ్చింది.

"అయితే, యేడుస్తావెందుకు? ఛీ, ఛీ, యింత అందగత్తెవు, యువతివి. కలకత్తా వెళుతున్నావు. యిక నువ్వేమీ డబ్బుకోసం విచారించవలసిన పనిలేదు కలకత్తాలో డబ్బు పూరికే దొరుకుతుందిలే! నీవే చూస్తావుగా?" అని అన్నాడు.

మాలతికి నెత్తిన పిడుగు పడినట్లనిపించింది. తలను నరికి క్రిందవేసి నట్లయింది. ఆ సమయంలో కిటికీలోంచి నీళ్ళలోకి దూకినా పర్వాలేదనిపించింది. శరీరమంతా యెముకలగూడులా అయిపోయింది. మూర్ఛవచ్చి పడిపోయింది.

కళ్ళువిప్పి చూసేప్పటికి తను పక్కమీద వుండడం గ్రహించింది. తల ప్రక్కన సురేంద్రబాబు ఆమె ముఖంలోకి చూస్తూ కూచున్నాడు. సిగ్గుతో ఆమె ముఖం యెరుపెక్కింది.

కొంచెంసేపయాక సురేంద్రబాబు "మాలతీ! రేపు ప్రొద్దున్నే ఇక్కణ్ణుంచి స్టీమరును పోనిస్తాను. కాని నిన్ను మాత్రం వదిలి పెట్టలేను నీవు నా వెంట రావాలి. నాదగ్గరే వుండాలి?" అని అంటుంటే మాలతి నిట్టూర్పు విడిచింది

"నీవు దేనికోసం కలకత్తా వెళ్తున్నావో, అది నీకు చేతకాదు. నీకు ఎంత డబ్బవసరమో యెంత డబ్బు కావాలో అదంతా నీకు నేనిస్తాను"

మాలతి కళ్ళవెంట నీళ్ళు కారినయ్! అది తెలుసుకుని సురేంద్రుడు ప్రేమతో అమెను కౌగిలిలోకి తీసుకుని "మాలతీ నా వెంట వచ్చేయ్! పెద్దధనికుణ్ని కాకపోయినా బీదవాణ్ని మాత్రం కాదు! నీబరువును నేను మోయగలను. కొంచెం ఆలోచించు. ఒకవేళ నేను వదిలిపెట్టి వెళ్ళినట్లయితే నువ్వు సుఖంగా వుండ

గలవా ? నేను మాత్రం యీ అవస్థలో శాంతంగా యింటికి వెళ్ళగలనా ?'' అని ఆమెను యింకా దగ్గరకు తీసుకుని ప్రేమతో కన్నీళ్ళు తుడిచి ఆగ్రహంతో లజ్జతో కూడుకున్న ఆమె పెదిమలను ముద్దు పెట్టుకుని "యేం ? వస్తావుకదూ ? ''అని అడిగాడు.

మాలతి శరీరమంతా పులకితమైంది. అవయవాలన్నీ కంపించాయ్! ఆమె యిప్పుడు మునుపటి మాలతికాదు. లలనకాదు. ఇప్పుడామె యెవరూకాదు. యీ సమయాన ఆమె ఆమే ! సురేంద్రునికి హృదయరాణి ! జన్మ జన్మాలకు ప్రణయిని. ఆమె సీత, సావిత్రి, దమయంతి, అయినా సీత, సావిత్రి, దమయంతు లెందుకు ? ఆమె రాధ, ఆమె చంద్రావళి.

స్వర్గాల కౌగిలిలో కూడా యీ సుఖమూ, శాంతీ, మాన అవమానాలనుకూడా గుర్తుకు తెచ్చుకోవాలా ? లలన నిష్పందముగా, అచేతనమైన స్వర్ణప్రతిమలా సురేంద్రుని కౌగిట్లో కరిగి పోయింది. ఆ కౌగిలిలోని యెముకలు....రాళ్ళ....నిప్పులేకాదు. యిప్పుడవి స్నిగ్ధమూ కోమలములై మధుర పూరితాలైనాయ్. ఇప్పటికి ఆమె శాపంనుండి విముక్తిపొందిన దానిలా అయింది. పోయినధనం యిన్ని రోజులకు తిరిగి లభించినట్లయింది. సంకుచితమైన మాలతి పెదిమలు మళ్ళీ నవ్వినయ్! మాటిమాటికీ సురేంద్రనాధుడు వాటిని ముద్దుపెట్టుకున్నాడు.

లలనాదేవి పాపం అనే మొదటి మెట్టు దిగి ఆత్మవిస్మృతయై స్వర్గసుఖ భోగాన్ననుభవిస్తూ వుంది.

అస్తమిస్తున్న సూర్యుడు కిటికీలోంచి ఆ పాపపు చిత్రాన్ని చూస్తూ వెళుతున్నాడు. సూర్యుని యెర్రటి కిరణాలు మాలతి

ముఖమండలాన్ని యింకా అందంగా చేస్తున్నాయ్, ఆవేశ ముతో తృష్ణతో ఆ ముఖాన్ని సురేంద్రుడు ముద్దు పెట్టుకుంటూ "మాలతీ! నాతో వస్తావా?" అని మళ్ళి అడిగాడు.

"వస్తాను"

"అయితే, ఇప్పుడే పద!"

"మరి అక్కయో?"

"యే అక్కయ్?"

"మీ భార్య"

"నా భార్యా? ఆమె యెప్పుడో చచ్చిపోయింది"

"జయవతి....?"

ఆమెమాట పూర్తికాకమునుపే సురేంద్రుడు "జయ నా భార్య కాదు, ఆమెను నేను పెళ్ళి చేసుకోలేదు" అని అన్నాడు.

"అయితే ఆమె మీకేం కావాలి?"

"యేమీకాదు. నీవే నా సర్వస్వము!"

ఆమె తన తలను అతని చాతిలో దాచుకుంటూ, "నేను మీ పాద దాసిని. నన్నెప్పుడూ వదలకండి" అని అంది;

"లేదు యెప్పుడూ వదలను"

"నన్ను తమతో తీసుక పదండి"

"సరే, పద"

"యీ రోజునే?"

"యీ రోజెందుకు? యీ క్షణాన్నే!"

ఆ సమయంలో బైటినుంచి వెయ్యి గొంతుకలు వినిపించాయ్! పట్టుకోండి. వెళ్ళ, తప్పుకో, పోయింది, పోయింది. మునిగిపోయింది: ఓ....ఓ...."

సురేంద్రుడు పరుగెత్తుకుంటూ డెక్కుమీదకు వచ్చాడు.

వెంటనే మాలతి అతన్ని అనుసరించింది. చాలా దూరాన వున్న ఓ నావ స్టీమరుకు తగిలి మునిగిపోతూ వుంది.

సంగతి తెలుసుకుని, సురేంద్రుడు "అందులో నా జయ వుంది." అని దూకేందుకు సిద్ధమవుతూ వుండగా మాలతి అతని చేయి పట్టుకుంది.

పిచ్చివాడిలా సురేంద్రుడు గట్టిగా అరుస్తూ, పట్టుకోవద్దు, పట్టుకోవద్దు. నా జయ మునిగిపోతూవుంది'' అని అరిచాడు.

విశాలమైన ఆ పెద్ద స్టీమరుక్రింద ఓ చిన్న నావ మునిగిపోయింది. సురేంద్రుడుకూడా మాలతి చేతుల్లో తెలివితప్పి పడిపోయాడు.

# 18

''జయా?'' తెలివి వచ్చాక సురేంద్రుడు కళ్ళువిప్పి మొదటి సారిగా పిలిచాడు. తలవద్ద కూచుని మాలతి కన్నీళ్ళు తుడుచుకుంటూ వుంది. కాని, సురేంద్రుడు ఇది చూడలేదు.

చాలా సేపు వున్నాక చిన్న నిట్టూర్పు విడిచి ''జయసంగతి ఏమీ తెలియలేదా?'' అని సురేంద్రుడు అడిగాడు.

దగ్గరున్న ఓ నౌకరు ''లేదండీ'' అని చెప్పాడు.

''సంగతేమీ తెలియలేదా?'' అయితే ఆమె బ్రతకలేదన్న మాట''

''అలానే అనిపిస్తోందండీ''

కొంచెంసేపాగి సురేంద్రనాథుడు "రాత్రి యెంతయి వుంటుంది?" అని అడిగాడు.

"షుమారు పదిగంట లవుతుందండీ"

"పదా? ఇంకా ఏ సంగతీ తెలియలేదన్నమాట?"

నౌకరు జవాబు చెప్పలేదు.

సురేంద్రుడు ఇంకా నిరాశుడై తల కొట్టుకుంటూ "మీరంతా ముందు ఇక్కణ్ణుంచి వెళ్ళండి. కలకత్తా అంతా గంగానది వొడ్డంతా వెదకండి" అని అనుజ్ఞ ఇచ్చాడు.

"ఆజ్ఞ" అంటూ నౌకరు వెళ్ళిపోయాడు.

గదిలో మాలతి తప్ప ఇంకెవరూ లేరు. అయినా సురేంద్రుడు ఏమీ మాట్లాడకుండా కన్నీళ్ళు కారుస్తూవున్నాడు. గదిలోని గడియారం మాత్రం కాలాన్ని వ్యర్థం చేయకుండా, పన్నెండు, రెండు, మూడు, నాలుగు యీ విధంగా గంటలు కొడుతూవుంది. సురేంద్రుడు మాటి మాటికీ కంబళి కప్పుకుంటున్నాడు. ప్రక్కన కూచున్న మాలతి కళ్ళుతుడుచుకుంటూవుంది. ఆమెకు సిగ్గూ, లజ్జా కలిగినయ్. తనమీద తనకే అసహ్యం కలుగుతూవుంది భూత భవిష్యత్ వర్తమానకాలాలు ఆమె మెదడులో తిరుగుతూ వున్నాయ్

సురేంద్రుడు చటుక్కున లేచి కూచుని మాలతివేపు చూస్తూ "రాత్రంతా యీ విధంగా మేలుకుని కూచుంటే యేమీ లాభం లేదు. వెళ్ళిపడుకో!" అని చెప్పాడు.

లేచి వెళుతూన్న మాలతిని మళ్ళీ పిలిచి "వెళ్ళకు కూచో! నీతో ఓ సంగతి చెప్పాలి" అని అన్నాడు.

రెండడుగులు ముందుకు వేసిన మాలతి అక్కడే కూచుని వుండి పోయింది.

ఏదో కొంచెం ఆలోచించినవానిలా సురేంద్రుడు కళ్ళు మూసుకుని గంభీరంగా "మాలతీ! యెవరి పాపంవల్ల యీ అనర్థకం కలిగిందంటావు?" అని అడిగాడు.

మాలతి తలమీద కొండ విరిగి పడినట్లయింది, యీ ప్రశ్న నే ఆమె యెన్నోసార్లు తనలోతాను ప్రశ్నించుకుని, జవాబును పొంది వుంది. అయినా నోరు విప్పి చెప్పడానికి ఆమెకు ధైర్యం చాలకపోయింది. తలవంచుకుని అలానే కూచుంది.

"సరే! యీ విషయాన్ని గురించి తరువాత మాట్లాడు కుందాం. ఇంక నువ్వెళ్లు" అని సురేంద్రుడు అన్నాడు.

అక్కణ్నుంచి మాలతివచ్చి తన గదిలో పడుకుని మిగిలిన రాత్రంతా పక్కమీద అటూ ఇటూ దొర్లింది. యెన్నోసార్లు దేవతలను తలుచుకుంది. యెన్నో విషయాలు తలుపుకు వచ్చినయ్! తెల్లవారుతుందనగా, నిద్రమత్తుతో యేవేవో కలలు కన్నది.

సూర్యకిరణాలు తీసివున్న కిటికీలోంచి ఆమె ముఖంమీద పడి, ఆమెను మేలుకునేట్లు చేసినయ్, ఆమెలేచి బైటకు వెళ్ళింది.

ఆ రోజంతా ఆమె సురేంద్రనాథుని చూడలేదు. కొద్దిసేపటికి ముందే ఓడను వదిలిపెట్టి అతను యెక్కడికో వెళ్ళాడు. రెండో రోజు కూడా ఆయన రాలేదు. మూడోనాడు సాయంకాలం కాబోతుండగా వచ్చి గదిలోకివెళ్ళి తలుపు వేసుకున్నాడు. ఆరోజుకూడా అలానే గడిచిపోయింది. నాలుగోరోజు మాలతిని పిలవనంపాడు. గదిలోకివెళ్ళి మాలతి ఒక ప్రక్క నిలుచుంది.

సురేంద్రబాబు కాగితంమీద యేమిటో వ్రాస్తూ కూచున్నాడు. అది వుత్తరమనుకుంది. మాలతి భయపడుతూ భయపడుతూ ఓరచూపుతో ఆయనను చూసింది. యెర్రని కళ్ళతో తలవెంట్రుకల చిందరవందరతో, గుడ్డలమీద బురద మరకలు కనుపిస్తూ ఉదాసీనంగా కూచుని వున్నాడు.

సగం వ్రాసినదాన్ని ఒక ప్రక్కనవుంచి సురేంద్రుడు తలెత్తి "నీ వంట్లో ఇప్పుడెల్లావుంది? బాగావుందా?" అని అడిగాడు.

అవునని తలూపింది.

"నే నివాళే యిక్కణ్నుంచి ఓడను వదిలేస్తాను. నీ యిష్టం వచ్చిన చోటకు వెళ్ళొచ్చు."

ఆమాట విన్నాక మాలతికి కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి! కాని, ఏమీ మాట్లాడలేదు. ప్రక్కనేవున్న కాగితాన్ని తీసుకుని సురేంద్రనాథుడు "ఇక్కడ నాకు ఓ స్నేహితుడున్నాడు. ఈ ఉత్తరం తీసుకుని ఆయన దగ్గరకు వెళ్లు. ఆయన నీకు యేదయినా దారి చూపిస్తాడు" అని చెప్పాడు.

ఓ కన్నీటి బిందువు 'టప్' మని మాలతి కళ్ళనుంచి జారి కాళ్ళమీద పడింది. సురేంద్రుడు ఇదంతా చూశాడు. అతను కొంచెంసేపాగి "నీ దగ్గర డబ్బేమీ లేదనుకుంటాను" అని అడిగాడు.

మాలతి తలూపి "లేదు" అని అన్నది,

"ఆ సంగతి నాకు తెలుసు. ఇది తీసుకో" అని తలగడ దిండు క్రిందనుంచి ఓ మనీబేగ్ తీసి ఆమె కాళ్ళముందు విసిరి ఈ పర్సులో వున్న దాంతో యే ఆధారం లేకపోయినా ఒక సంవ

త్సరం వరకూ నీకు హాయిగా గడుస్తుంది. తరువాత యిక భగవంతు డున్నాడు'' అని చెప్పాడు.

ఇంకొక కన్నీటిచుక్క ఆమె కళ్ళనుంచి క్రిందపడింది.

"ఆనాడు పిచ్చివాణ్ణయి, నిన్ను యెవరిపాపంవల్ల జరిగిందని అడిగాను. ఇప్పుడు జ్ఞానం కలిగింది. నా పాపఫలంవల్ల ఇది జరిగిందని తెలుసుకున్నాను. నీవు నిర్దోషివి! నా జయను నేనే చేతులారా చంపుకున్నాను. హత్య చేసుకున్నాను.''

నొసట పట్టిన చెమట తుడుచుకుని ''ఎన్నో నీచమైన పనులు ఈ చేతులమీదుగా జరిగిపోయాయి. ఇక పాపం చేయను. ఇకనైనా మంచిదారిని నడిస్తే సుఖమేమయినా దొరుకుతుందో, లేదో చూస్తాను'' అని అన్నాడు.

మాలతి నిలుచునే వుంది. సురేంద్రుడు వుత్తరం పూర్తిచేసి దాన్ని మడిచి కవరులో పెట్టి అడ్రసు వ్రాసి ఆమె కాళ్ళముందు విసిరివేస్తూ ''ఈ ఉత్తరంకూడా తీసుకుని శ్యామ బజారులోని యీ అడ్రసు అతను ఎక్కడ వుంటాడో తెలుసుకో! నీకు తప్పకుండా పని దొరికితీరుతుంది'' అని చెప్పాడు.

కంపిస్తున్న చేతులతో మాలతి వుత్తరం తీసుకుంది.

''ఆ పర్సుకూడా తీసుకో!''

ఆమె మనీబేగ్‌ను కూడా తీసుకుని తలుపు వేపుకు ఓ అడుగు వేసింది. సురేంద్రబాబు హృదయంలో యేమిటో ఇదిగా వుంది.

''ధర్మంగా నడువు'' అని అన్నాడు.

మాలతి యింకొక అడుగు తలుపువేపు వేసింది. ఈ మారు సురేంద్రబాబు కంఠం కంపించింది. ''మాలతీ! ఆనాటి సంగతి మరిచిపో'' అన్నాడు.

మాలతి తలుపు గడియ పట్టుకుని లాగింది. తలుపు సగం తెరుచుకుంది. సురేంద్రుని కంఠస్వరం యింకా కంపించింది. "కష్టాల్లోనూ, ఆపదల్లోను నాకు ఉత్తరం వ్రాస్తూవుండు'' అని అన్నాడు.

మాలతి బైటకు వచ్చింది.

వెంటనే అతని కళ్ళు నీళ్ళతో నిండిపోయినయ్! 'మాలతీ!' అని పిలిచాడు.

మాలతి అక్కడ నిలుచుంది.

మళ్ళీ 'మాలతీ!' అని ఆమెకు యింకోసారి పిలుపు వినిపించిది.

ఈమారు మాలతి లోపలకు వచ్చి, తలుపుకు ఆనుకుని నిల్చుంది.

కళ్ళు తుడుచుకుని సురేంద్రుడు ''జయవల్ల కలిగిన విచారాన్ని నేనింకా మరిచిపోలేదు'' అని అన్నాడు.

మాలతి తలుపును వదిలి అక్కడే కూచుండిపోయింది. ఆమె కాళ్ళు వణికాయ్:

"మాలతీ! ఇక యెవరి అండతో యీ ప్రపంచంలో నేను బ్రతికి వుండను?" అని కొంచెంసేపు సురేంద్రుడు ఏడ్చి, 'నీవు కూడా నన్నిప్పుడు వదిలిపెట్టి వెళ్తే నేను బ్రతకలేను' అని సురేంద్రుడు తివాచీమీద పడుకున్నాడు.

మాలతి దగ్గరకువచ్చి కూచుంది. ఆమె తన కౌగిలిలో అతని తల వుంచుకుని ''నేను వెళ్ళను'' అని అంది.

ఇద్దరూ చాలాసేపు ఏడ్చారు. మాలతి అతని కన్నీళ్ళు తుడిచింది. అప్పటికి సురేంద్రుని కళ్ళు మూతలుపడి వున్నై. అలానే

వుంచుకుని జీరపోయిన గొంతుకతో "ఆనాడు నీవేమన్నావో, ఏమన్నా జ్ఞాపకముందా?"

"ఏమని?"

"మీ పాద దాసినని"

"అవును. ఇప్పటికీ మీ పాద దాసినే!"

సురేంద్రుడు గట్టిగా "హరిచరణ్" అని పిలిచాడు.

డెక్కమీద వుండే హరిచరణ్ 'బాబూ!' అని పలికాడు.

"ఓడను యిప్పుడే యిక్కణ్నుంచి లంగరెత్తి పోనీయ్!"

"ఇప్పుడేనా బాబూ?"

"అవును. ఈ క్షణాన్నే"

## 19

ఓడ కనుపిస్తూన్నంతసేపూ సదానందుడు పాటను ఆపి, దాని వేపుచూస్తూ కూచున్నాడు. తరువాత ఇంటికివచ్చి నిద్రపోయాడు. ఆనాడు అతని మనసేమీ బాగోలేదు. నిద్రకూడా సరిగా పోలేదు. పొద్దున్నే సుభద దగ్గరకు వచ్చి "నేనిక్కడ భోజనము చేస్తే మీ కేమయినా ఇబ్బందా?" అని అడిగాడు.

వాడిపోయిన మొహంతో సుభద "బాగానే వుంటుంది నాయనా! ఇబ్బందేముంది?" అని జవాబు చెప్పింది.

"నేనూ అదే అనుకుంటున్నాను. నాకుకూడా ఇంకెవరూ లేరు. రెండు పూటలూ ఇక్కడే తిండి తింటూ వుంటే?"

"ఏం? బాగానే వుంటుంది నాయనా!"

"అత్తగారి తాలూకు ఆస్తి వాళ్ళ మామగారి దగ్గర వుంది. రెండు మూడు రోజుల్లో అక్కడికివెళ్ళి, ఆ సంగతి కూడా తెలుసుకుని రావాలి"

"అవును. ఆ పని చేసిరా నాయనా! నువ్వు చేయకపోతే యింకెవరు చేస్తారు?"

"నాకున్న డబ్బూ, గింజలూ, అన్నీ ఇక్కడే పెట్టుకుంటే ఇంకే విధమయిన దొంగతనమూ జరగనీనుకుంటాను."

అర్థాన్ని గ్రహించలేక సుభద "యిన్ని రోజుల్నుంచీ దొంగతన మేమయినా జరిగిందా?" అని అడిగింది.

"యింతవరకూ జరగలేదు. కాని ఇకముందు జరగదని యెలా అనుకుంటాను?"

సుభద యేమీ మాట్లాడలేదు.

తరువాత రెండు రోజుల్లో సదానందుని సామానంతా హారాన్ ముఖర్జీ యింట్లోకి మార్చబడింది. యిదంతాచూసి "సదానందా! నీ సామానంతా ఇలా రావడం చూస్తే, యిందర్లు యేమను కుంటారు?" అని సుభద అడిగింది.

సదానందుడు నవ్వుతూ "వస్తువులన్నీ నావికావు, ఇతర్లవి కావు. నేను ఇక్కడే తింటున్నాను. ఇక్కడే వుంటున్నాను అందువలన నా సామానంతా ఇక్కడే వుంటుంది. దీన్ని గురించి యెవ రేమనుకుంటే నాకేం భయం" అని అన్నాడు.

"హారాన్‌బాబు భార్య పిచ్చివాడైన సదానందుని మీద మంత్రం ప్రయోగించింది" అని ఒకరూ.

"సదానందు డిప్పుడు నిజంగా పిచ్చివా డయాడు" అని ఇంకొకళ్ళూ.

"చలనను పెండ్లిచేసుకుంటానికి యీ యెత్తు ఎత్తాడని" ఇంకొకరూ.

ఆ వీధిలో వుంటున్న నలుగురూ తలొక విధంగా అనడం మొదలు పెట్టారు. ఇదంతా విని సదానందుడు నవ్వి వూరు కున్నాడు.

యెవరయినా యేమన్నా అతన్ని ముఖాముఖి అడిగితే "నేను చచ్చిపోయేప్పుడు నీ పేరుతో కూడా రెండు మూడు సెంట్లభూమి వ్రాస్తానులే" అని చెప్పేవాడు.

ఇంకొకళ్ళతో "పిచ్చివాడు పిచ్చిపనులే చేస్తాడు. దీనికోసం యెందుకంతగా విచారపడతారు" అని అనేవాడు.

యీ మాటలకి అందరి నోళ్ళు మూయబడినై. కాని, యీర్ష్యతో కూడిన భవతరణ గంగోపాధ్యాయుడు సదానందుని పిలిచి ఉపదేశం మొదలుపెట్టాడు. ఆయన మాటలన్నీ విన్నాక సదానందుడు విచారాన్ని ప్రదర్శిస్తూ "అయిందేదో అయిపోయింది. ఇక మా అత్తగారి మామగారి ఊరు వెళ్ళి, తిరిగి వచ్చాక మళ్ళీ అవన్నీ తీసుకవచ్చి మీ దగ్గర వుంచుతాను" అని చెప్పాడు.

గంగోపాధ్యాయుడు కోపంతో "అరే, సదానందా నువ్వింకా కుర్రవాడివి. నీకేం తెలుసు. నీ తండ్రి నన్నెంత యిదిగా గౌరవించేవాడు" అని అన్నాడు.

"నేను మాత్రం మీతో గౌరవంగా మాట్లాడలేదూ ?"

"అయినప్పుడు, ఇటువంటి మాటలు నువ్వెందుకనాలి ?"

"యెప్పుడూ నా బుద్ధి సరిగ్గా వుండదు"

"అందుకనే చెప్పుచున్నాను నువ్వు చెడిపోతున్నావు"

"మీరు యీ దౌర్భాగ్యుడిమీద శ్రద్ధ చూపించి నట్లయితే, ఇలా నా పతనము జరగకుండా వుండేదేమో?"

"చెడిపోయేవాణ్ణి యెవరేంచేస్తారు? ముందు నా దగ్గర్నుంచి లేచిపో."

"ఆజ్ఞ" అని సదానందుడు బైటికివచ్చి కడుపు పగిలేట్లు నవ్వాడు.

ఒకనాటి మధ్యాహ్నం భోజనం చేస్తూ సదానందుడు సుభద మొహంచూసి "చలన పెద్దదయింది" అని అన్నాడు.

ఉదాసీనంగా సుభద "అవును నాయనా!" అని అంది.

"ఇక ఆమెను అలా వుంచకూడదు. నలుగురూ నాలుగు మాటలు అనుకుంటారు. వుంచినా మనకుకూడా మంచిదికాదు."

"ఆ భారమంతా. ఆ దుర్గాదేవే భరిస్తుంది"

"దుర్గాదేవి వచ్చి చలన పెండ్లి చేయదు"

సుభద యేమీ మాట్లాడలేదు.

"హరమోహన్ కొడుకు శారదాచరణుని కిచ్చి చలనను పెళ్ళి చేస్తే యెలా వుంటుంది?"

సుభద సరిగ్గా తెలుసుకోలేక. "శారదాచరణునితోనా?" అని అడిగింది.

"అవును"

"అలా అవుతుందా?"

"ఎందుకాదు"

"ఏమో?" సుభద నిరాశతో అంది.

ఆమె నిరాశను గ్రహించి మెల్లగా నవ్వి? "ఒకనాడు యీ విషయాన్ని గురించి శారదాచరణునితో మాట్లాడాను. అతనేమీ అడ్డుచెప్పలేదు" అని అన్నాడు.

సుభద్ర మొహంలో ఒక మెరుపు కనిపించి వెంటనే అది మాయమయింది. "అయినా అతని తండ్రి? ఇంతకూ ఆయన ఇష్టపడొద్దూ?" అని అన్నది.

"ఇష్టపడకుండా వుండడానికి కారణం?"

కొడుకు ఇష్టపడినా తండ్రి యెందుకని ఇష్టపడడో సుభద్రకు తెలుసు. అయినా ఆమె నోరువిప్పి చెప్పలేకపోయింది. అతని తండ్రి దగ్గరకు వెళ్ళి ఎవరడుగుతారు? అని చెప్పుదామనుకుని మళ్ళీ చెప్పలేక వూరుకుంది. మౌనముఖంతోనూ, పిరికి నేత్రాలతోనూ అతనివేపు చూస్తూ వూరుకుంది.

ఆ పిచ్చివాడు ఆమె మౌనభాషనుకూడా గ్రహించాడు. "అతని తండ్రితో నేను మాట్లాడి వప్పించి ఇష్టపడేట్లు చేస్తాను. ఎందుకంటే ముఖ్యంగా ముందు చలనకు పెండ్లి చేసితీరాలి" అని అన్నాడు.

సుభద్ర భయపడుతూ భయపడుతూ ఆశా నిరాశా మాయల్లో ఊగుతూ మెల్లమెల్లగా "ఆయన ఇష్టపడతారా?" అని అడిగింది.

"తప్పకుండా"

"నీ కెలా తెలుసు?"

పిచ్చివాడు మళ్ళీ నవ్వి "నాకు తెలుసు. మీరేమాత్రం విచారించకండి. నేనాయన్ని తప్పకుండా ఒప్పుకునేట్లు చేస్తాను" అని అన్నాడు.

వృద్ధుడైన హరమోహనుని యెలా ఒప్పుకునేట్లు చేయాలో, యెలాచేస్తే అతను ఇష్టపడతాడో అదికూడా సదానందుడికి తెలుసు.

సంతోషం పట్టలేక సుభద త్వరగా పాలు తెచ్చేందుకు గది లోకి వెళ్ళింది. పాలగ్లాసు చేత్తో పట్టుకొన్నాక ఆమె కళ్ళవెంట ఆనందాశ్రువు ఒకచుక్క జారిపడింది. ఆమె బైటకువచ్చి "సదా నందా! కొంచెంసేపు వుండునాయనా! పాలు మార్చి తెస్తాను" అని చెప్పి తిరిగి లోనకు వెళ్ళింది.

భోజనం చేసిన తర్వాత సదానందుడు మైదానంవేపు వెళ్ళాడు. అక్కడ అతనికి పొలమువుంది. రైతులు పనిచేస్తున్నారు, గట్టు మీద సదానందుడు కొంచెంసేపు తిరిగి, రెండుమూడుసార్లు దుర్గా దేవిపేరు స్మరించి రెండు గుక్కలు పొగాకు త్రాగి తిన్నగా హరమోహనుని ఇంటికి వెళ్ళాడు.

సదానందుని చూస్తానే, పొగాకు చిలుములోకి యెక్కిస్తున్న వృద్ధ హరమోహనుడు "అరే! నీవు చాలారోజుల్నుంచి కను పించడంలేదేం?" అని అడిగి 'ఆ ఆ' మరిచిపోయాను. నీ అత్త గారు కాశీలో కాలం చేసిందటగా? పాపం! అయితే నువ్వెప్పుడు వచ్చావు? కూర్చో" అని అన్నాడు.

సంకోచించకుండానే సదానందుడు అతని దగ్గరగా కూచుం టూ "మీ దగ్గరకు పెళ్ళి విషయం మాట్లాడేందుకు వచ్చాను" అని అన్నాడు.

"ఎవరి పెళ్ళి"

"తమ కొడుకు పెళ్లిని గురించి"

ఆమాట వినడంతోనే వృద్ధుడు గంభీరరూపం దాల్చాడు. నెరిసిన వెంట్రుకల వాళ్ళతో తప్ప, అప్పుడప్పుడే వస్తున్న మీసం వాళ్ళతో యీ విషయంలో పొత్తు కుదరదని అతనికి నమ్మకం సదానందునికి బుద్ధి సరిగ్గా వుండడం చేతని కొద్దిరోజుల్నుంచి అతను వింటున్నాడు కూడా.

''ఎవరి పెళ్ళి. శారదుని పెళ్ళా ?''

''అవునండి.''

వృద్ధుడు స్థిరంలేని మనసుతో ఇంట్లోకి చూపిస్తూ ''అక్కడ శారదాచరణుడుండొచ్చు వెళ్ళు'' అని అన్నాడు.

అతని ఆకృతి వేషం చూసి సదానందుడు ఆ అర్థాన్ని గ్రహించి.

''శారదునితో నాకు పనిలేదు. నేను మీదగ్గిరకే వచ్చాను.'' అని అన్నాడు.

''నా దగ్గరకా ?''

''అవును''

''ఎందుకు ?''

''ఇప్పుడేగా చెప్పాను శారదునికి పెళ్ళిచేయనా ?''

''ఎందుకని చేయను ? అయినా శారదుని పెళ్ళితో మీకేం పనుంది ?''

''నాకేమీ పనిలేకపోతే, ఊరికే వచ్చాననుకున్నారా ?''

''ఈ విషయంలో నువ్వే మాట్లాడుతావా ? నాతోనేనా ?

''అవును''

''నీతో యీ విషయం ఎలా అవుతుంది ?''

"బాగానే అవుతుంది. నా చిన్నతనంలోనే మా నాన్నగారు స్వర్గస్థులైనప్పటినుండీ, నేనే పొలమూ, పుట్ర అంతా చూసుకుంటూ వున్నాను. గొప్పగొప్ప వాళ్ళలా నేనూ వ్యవహరించగలను. వివాహం చేయడానికి వచ్చినప్పుడు ఇచ్చి పుచ్చుకోవడాలుకూడా జరుగుతై, ఆ సంగతికూడా నాకు తెలుసు. ఈ విషయంలో తమకెంత తెలుసో, నాకూ అంత తెలుసు."

లోకులు అనుకునేంత పిచ్చివాడు కాదని, హరమోహనుడు గ్రహించి "అవును. అదే కావాలిసింది" అని అన్నాడు.

నవ్వును ఆపుకోలేక సదానందుడు మెల్లిగా నవ్వుతూ, "నేను శ్రీమాన్‌గారికి ముందే నివేదించుకున్నాను. యీ పెళ్ళి విషయాన్ని గురించి మాటలు నావద్ద జరిగితే ఆప దేమీలేదు. ఈ విషయం స్థిరపరుచుకుందామనే నేను తమవద్దకు వచ్చాను" అని అన్నాడు.

"ఎవరిదగ్గర పిల్ల వుంది? యేవూరు?"

"ఈవూళ్ళోనే శ్రీయుత హారాన్ ముఖోపాధ్యాయుని రెండో కూతురు."

"హారాన్!"

ఆమాట పూర్తికాకముందే 'ఆ!' అని సదానందుడు అన్నాడు.

"అయితే అతనేమిస్తాడు."

"మీరు ఏది కోరితే అది."

చాలాసేపు ఆలోచించాక "చూడడానికీ, వినడానికీ ఆ పిల్ల ఎలా వుంటుందేం?" అని అడిగాడు.

"మీరామెను చూసే వుంటారు. కాని, జ్ఞాపకముండివుండదు. నా దృష్టిలో ఆమెకు యేమీ చెడుగుణాలు లేవు. మీ కొడుకు కూడా ఆమెను చూసే వున్నాడు. ఆయనేమీ అడ్డు చెప్పలేదు."

వృద్ధుడు కొంచెం నవ్వి "చాలు. మంచిదే? మనమంతా గృహస్థులం. బంగారపుబొమ్మ మాకవసరంలేదు. చూడడానికీ, వినడానికీ చెడుబుద్ధులు లేకుండా యేదో యింత యింటిపనులు జాగ్రత్తగా చేసుకుంటూ వుంటే చాలు!" అని చెప్పాడు.

"ఇంటిపనులన్నీ ఆ అమ్మాయే చక్కగా చేసుకుంటుంది."

"అయినా యీరోజుల్లో హారాన్ స్థితి ఏమీ బాగుండడం లేదుకదా! అతనేమివ్వగలడు?"

"నిజంగా అతని స్థితేమీ బాగాలేదు. ఇదంతా మీరు ఆలోచించే చెప్పవలసి వుంటుంది."

వృద్ధుడు యీ మాటలకు కొంచెం కష్టంలోపడి, "యీమాట అనకుండా వుంటేనే బావుండేది అని" అను కున్నాడు.

బుద్ధిమంతుడైన హరమోహనుడు తన తప్పును తప్పించుకోవాలని "ఇక ఏం చెప్పను నాయనా! పిల్ల పెళ్ళికి కొంత ఖర్చు వుంటుందని నీకు కూడా తెలుసుగా?" అని అన్నాడు.

"అవును తప్పకుండా ఖర్చనేది వుంటుంది."

అభ్యాసానుసారంగా హరమోహనుడు మెల్లగా నవ్వుతూ "ఒకవేయికన్నా తక్కువైతే, శారదునికి పెళ్ళిచేయదలచుకోలేదు." అని చెప్పాడు.

"అయితే స్థిరపడ్డట్లే."

సదానందుని మాట విని వృద్ధునికి తనమీద తనకే కోపం వచ్చింది. పదిహేను వందలని, తనెందుకు అడగలేదా అని ఆలోచించాడు. నోటినుంచి జారివచ్చిన మాటను అతిక్రమించలేక "పిల్లకు సొమ్మూ అదీ చేయించే విషయం మీరే భరించాల్సి వుంటుంది" అని చెప్పాడు.

"తప్పకుండా"

"యథావిధిగా లాంఛనాలూ, అవీ మీరే భరించాలి"

"ఆ!"

"అయితే యిక నాకూ యిష్టమే!"

"మరి యేదో ఓరోజు నిర్ణయించండి."

వృద్ధుడు కొంచెంసేపు ఆలోచించి "ఈ పెళ్ళి మీ ఒక్కరి వల్లనే అవుతుంది. ఇక హారాన్‌కూడా పరాయివాడు కాదు. పోతే ఇప్పుడు మన మనుకున్న నియమాలేవీ తమరు దాటకూడదు" అని అన్నాడు.

"ఇంకా నియమా లేమిటి?"

"హ హ హ. నియమా లేమున్నాయ్! ఏదో కొంచెం వ్రాత కోతలని వుంటే యిరువురికీ మంచిదికదూ?"

"అలానే కానీయండి."

"ఎవరి దగ్గర?"

"నాదగ్గర్నే"

"ఎప్పుడు?"

"ఒక నెలయాక"

వృద్ధుడు తన ఇష్టాన్ని తెలియపరిచాడు.

సదానందుడు "నా ప్రార్థన ఒకటుంది వింటారా?"

"ఏమిటది"

"ఈ ఇచ్చి పుచ్చుకోవడాలు, మన ఇద్దరికితప్ప మూడో చెవిని పడకూడదు"

"ఏం?"

"చిన్న కారణముంది"

"గుప్తదానం చేయాలనుకున్నావా యేం?"

సదానందుడు మాట్లాడలేదు. ఆ మూగ నోమునూ, అతని దయనూ చూచి హరమోహనుడు సిగ్గుపడి "నాయనా మేము ముసలివాళ్ళ మయాం. అందువల్ల సిగ్గుకూడా పోయింది. లేక పోతే హారాన్ సంగతి నాకు తెలవదా? నీవు గుప్తదానం చేస్తా నంటే నేనూ గుప్తంగానే గ్రహిస్తాను. అందుకు నీవేమీ విచారిం చొద్దు" అని అన్నాడు.

సదానందుడు సంతోషంతో అతనికి నమస్కరించి బైటకు వెళ్ళిపోయాడు.

## 20

సుభద, హారాన్, చలన అందరూ యీ సంగతి విన్నారు. ఈ పెళ్ళి సదానందుడే ఒప్పుకుని వచ్చాడని విని రాసమణి సదా నందుడు పూర్వజన్మలో సుభదకు కొడుకయి వుంటాడని అను కుంది. ఈ మాట సదానందునితో అంటే అతను మౌనంగా స్వీకరించి వూరుకున్నాడు.

తరువాత ఓనాడు అత్తగారి ఊరువెళ్ళి అక్కడున్న ఆస్తంతా అమ్మి, తిరిగివచ్చి చలన పెళ్ళికి కావలసిన వ్రాతకోతలూ, సొమ్మూ, అంతా సిద్ధం చేసుకుని శారదాచరణుని కలుసుకుని ఇద్దరూ గంగానది వద్దకు వచ్చారు.

శారదాచరణుడు "సదానందా! చిన్నప్పటి సంగతులు ఏమన్నా గుర్తున్నాయా?"

సదానందుడు అవునని తలూపాడు.

దగ్గర్లో వున్న నీళ్ళవేపు వ్రేలుతో చూపుతూ "ఆమె అక్కడే చచ్చిపోయింది" అని శారదాచరణుడు అన్నాడు.

సదానందుడు ఆమాట విననట్లు గంగానదిలో పోతున్న నావను చూస్తూ కూచున్నాడు.

శారదాచరణుడు మళ్ళీ, "అక్కడే లలన మునిగి చచ్చి పోయింది" అని అన్నాడు.

"ఎక్కడ ?" అని ఆత్రుతతో సదానందుడు అడిగాడు.

"అదిగో, అక్కడ"

"నీకెలా తెలుసు ?"

"ఆ ప్రదేశంలో ఆమె చీర పడివుంది"

లేచి నిలుచుని సదానందుడు, "అయితే వెళ్ళిచూసి వద్దాం పద" అని అన్నాడు.

నవ్వుతూ శారదాచరణుడు "ఆ చీర ఇంకా అక్కడే ఉందనుకుంటున్నావేం ?" అని అడిగాడు.

"లేకపోతేమాత్రం యేం ? ఆ ప్రదేశాన్ని చూసివద్దాం పద"

ఇద్దరూ అక్కడికివెళ్ళి నిలుచున్నారు, సదానందుడు గంగా నది నీళ్ళతో కాళ్ళూ చేతులూ కడుక్కొని మళ్ళీ యథాస్థానంలో కూచున్నాడు. శారదాచరణుడు "సదానంద్ ! నాకు చాలా విచారంగావుంది" అని అన్నాడు.

"ఎందుకని ?"

"ఆమెను నేనే చంపానేమోనని అనుకుంటూ వుంటాను"

"ఎందుకని ?"

"నిజంగా ఆమె ఆయువు పూర్తయిందో లేదో ఆసంగతి భగవంతునికే తెలియాలి. ఆమెను నేను పెళ్లి చేసుకునివుంటే ఆమె చచ్చిపోయేది కాదేమో?"

"చావు వచ్చినవాళ్ళు తప్పకుండా చస్తారు. ఇక నువ్వెన్ని అనుకున్నా లాభంలేదు"

"అవును. ఆ సంగతి తెలుసు. అయినప్పటికీ ఆమె ఇష్టాన్ని తృణీకరించకుండా పెళ్లి చేసుకుని వుంటే"

"జాతిపోదూ?"

"అవును. జాతిపోతుంది"

"ఆమె ఆఖరి కోరికకూడా పూర్తిచేసివుంటే....?"

"కోరికేమిటి?"

"ఓ దరిద్ర పరివారాన్ని ఉద్ధరించిన వాడి వవుతావు. చల నను పెళ్లిచేసికోమని చెప్పింది"

"అయితే చలను పెళ్లిచేసుకోవా?"

"పెళ్ళి చేసుకుంటాను. కాని ఇంతకూ ఆమె మాటలు నిల బెట్టలేక పోయాను"

"ఎలా నిలబెట్టలేక పోయావు?"

అయినదేదో అయిందిలే. కాని, మా నాన్నగారిని ఎలా వప్పించావు?"

"నీకు పెళ్లిచేస్తే బావుంటుందని అన్నాను"

"అంతేనా?"

"అంతే కాకపోతే ఏముంది?"

"నాకు తెలుసు. నేను నాన్నగారి తత్వం ఎరుగనా ఏమిటి?"

"అటువంటప్పుడు ఇంకా నన్నా సంగతి గురించి అడుగుతా వెందుకు?"

"అదికాదు. ఎంత డబ్బడిగాడో తెలుసుకుందామని"

"తెలుసుకున్నందువల్ల లాభమేమీ ఉండదు"

"సదానందా! ఇది పాపపు సొమ్ము"

"ఆ సంగతంతా ఇప్పుడు మరిచిపో! నీ జీవిత మెప్పుడూ సుఖంగా ఉండాలని కోరుతున్నాను"

"సమయంవచ్చినప్పుడు ఆ డబ్బును నేను తిరిగిస్తాను"

"సరేలే" అని సదానందుడు లేచి, లలన చీర పడినచోటకు వెళ్ళి అక్కడున్న మట్టిని తీసుకున్నాడు.

ఆశ్చర్యంతో శారదాచరణుడు "ఇదేమిటి? సాయంకాలపు పూట మట్టెందుకు?" అని అడిగాడు.

"పిచ్చిపని చేస్తున్నాను"

"పిచ్చిపని చేస్తున్నావని నేననలేదు"

"నీ వెందు కంటావు? నేనే అంటున్నాను"

"కాదు కాదు, మట్టెందుకో సరిగ్గా చెప్పు?"

"నేను శివాజీ పూజ చేస్తుంటాను. ఇంట్లో గంగానది మట్టి లేదు. అందుకని తీసుకున్నాను" అని మట్టిని పిండముచేసి, దాన్ని నీళ్ళలోకి విసిరి చేతులూ ముఖం కడుక్కొని, శారదా చరణుని వద్దకువచ్చి "పదశారదా! ఇంటికపోదాంపద!" అన్నాడు.

"మట్టితో బొమ్మనుచేసి, నీళ్ళలో పారేశావేం?"

"నీ కళ్ళతో నువ్వు చూశావుగా?"

"శివాజీ పూజకోసం మట్టి కావాలని అన్నావుగా?"

"లేదు. ఇక శివాజీ పూజ చేయను"

"ఎందుకని?"

"ఆ సంగతి ఇంకెప్పుడయినా చెపుతానులే!"

ఇద్దరూ బయలుదేరి ఎవరింటికి వాళ్ళు వెళ్ళారు. సదానందుడు ఇంటికి వెళ్ళి గది తలుపులు వేసుకున్నాడు.

రాత్రి అన్నానికి చలనా అత్తా ఇద్దరూ ఎన్నిమార్లు వచ్చి పిలిచినా వంట్లో బాగుండలేదని చెప్పి, తలుపులు తీయలేదు. సుభదవచ్చి చూస్తే నిద్రపోయాడు. ఎంత పిలిచినా పలుక లేదు. రెండవరోజు లేచి మామూలుగా భోజనంచేసి పనిపాటలు చూసుకున్నాడు.

మెల్ల మెల్లగా చలన వివాహపు తిథి దగ్గరకు వచ్చింది. అందరి ముఖాల్లోనూ సంతోషం తాండవించింది. సదానందుడికి కూర్చునేందుకు శ్వాస పీల్చటానికి కూడా తీరిక లేకపోయింది. అత్తగారు కన్నీళ్లు ఆపుకోలేక ఇంట్లోకి వచ్చిన వాళ్ళందరితోనూ లలన లేకపోవడంవల్ల మనసు సరిగ్గా లేదని చెప్పడం మొదలు పెట్టింది. ఒక్క సుభదే శాంతంతోనూ, ధైర్యంతోనూ వుంది.

చలనకు వివాహమయింది.

## 21

లలన వెళ్ళాక మాధవుడు జ్ఞానిలాగా, అనుభవముగల వృదునిమాదిరిగా, అన్నివిషయాలూ విచారిస్తూఆలోచిస్తూకూచునే

వాడు. ప్రతి వస్తువుమీదా మనసుంచడు. ఎక్కువగా మాట్లాడే వాడు కాడు. యీనాడుకూడా అతను అలానే కూచున్నాడు. సదానందుడు రావడంచూసి. "సదాన్నయ్యా! నీ విప్పుడు నా దగ్గరకు రావడం లేదేమి?" అని అడిగాడు.

"నా కెన్నో పనులుంటాయ్ కదూ! అందుకని రావడంలేదు తమ్ముడూ?"

"ఇప్పుడు ఆ పనులన్నీ అయిపోయాయా?"

"ఆ!"

"చిన్నక్కాయ్. మళ్ళీ మనింటికి ఎప్పుడు తిరిగొస్తుంది?"

"మూడు నాలుగు రోజులు పోయాక"

"నువ్వెప్పుడూ వంటరిగా నాకు కనుపించనే లేదు!"

సదానందుడు అతని దగ్గరగా కూచుని, "వంటరిగా ఎందుకు మధూ?" అని అడిగాడు,

"వంటరిగా వున్నప్పుడే అక్కయ్య నీతో ఆ సంగతి చెప్ప మంది?"

"యే అక్కయ్య మధూ?"

"పెద్దక్కయ్య! అప్పుడు నీవుఇక్కడ లేవుగా! కాశీకి వెళ్ళావు. అందుకని నువ్వు తిరిగి వచ్చాక నీతో చెప్పమని మరీ మరీ అక్కయ్య చెప్పి వెళ్ళింది. అప్పట్నుంచీ నువ్వు వంటరిగా కనుపించలేదు."

సదానందుడు ఇంకా దగ్గరకు జరిగి మాధవుని శరీరంమీద చెయ్యివేసి

"ఎందుకు వెళ్ళిపోయింది మధూ? ఎవరైనా ఏమన్నా అన్నారా?" అని అడిగాడు.

''ఎవరూ ఏమనలేదు''

''మరి ఎందుకు వెళ్ళిపోయింది''

''నేనుకూడా వెళ్ళిపోతాను''

''ఛీ''

మాధవుడు మెల్లగా నవ్వి ''అక్కకూ నాకూ తప్ప ఇంకెవ్వ రికీ ఈ సంగతి తెలియదు. ఆమె నా కంటే ముందు వెళ్ళి పోయింది. అక్కడ నా కోసం అంతా సిద్ధంచేసి నన్ను తీసుక వెళ్ళేందుకు వస్తుంది. అక్కడ మే మిద్దరం విశ్రాంతిగా హాయిగా, సుఖంగా వుంటాము'' అని ముఖాన్ని ఇంకా సంతోషంగా కనపరుస్తూ "అక్కాయ్ వచ్చి నన్ను తీసుక వెళ్ల తుంది'' అని అన్నాడు.

చాలా సేపు ఊరుకున్నాక సదానందుడు ''ఎప్పుడు?'' అని అడిగాడు.

''ఎప్పుడైతే వీలుగా ఉంటుందో అప్పుడు''

''మాధవ్! ఈ మాటలన్నీ నీకు ఎవరు చెప్పారు?''

''పెద్దక్కాయ్.''

''నిన్ను తీసుక వెళ్తానని నీతో చెప్పిందా?''

''అవును."

''ఒకవేళ తీసుకు వెళ్ళకుంటే, ఒక్కడివే వెళ్తావా?"

''ఏమో?''

సదానందుడు మాట్లాడలేదు.

''సదాన్నయ్యా! అక్కడికి వంటరిగా వెళ్ళగలమా?"

''ఏం? మీ అక్కయ్య ఎలా వెళ్ళింది?''

"అయితే నేనూ వెళ్ళగల నన్నమాట"

"ఆ!"

మాధవుడు కొంచెం సేపాగి విచారంతో "అయినా నేనెలా వెళ్ళను? నాలో బలమేమీ లేదాయె! అక్కయ్య బలంగా వున్నప్పుడు వెళ్ళింది. నేను వెళ్ళేదెలా? నిల్చునే శక్తికూడా నాలో ఇప్పుడు లేదాయె! మరి నేనంత దూరం వెళ్ళగలనా?" అని అడిగాడు.

సదానందుని కళ్ళవెంట నీళ్ళు కారినా ఆ చీకటిలో మాధవుడు వాటిని సరిగ్గా చూడలేదు. మాధవునికి రోజులు దగ్గరకు వచ్చాయని సదానందుడు గ్రహించి, కొద్దిరోజుల్లోనే ఆ పిల్లవాడి జీవితం సమాప్త మవుతుందని అనుకున్నాడు.

అతని మనసులో సుభద్ర లలన, అందరూ మెదిలారు, వీళ్ళందర్నీ సంబాళించుకుంటూ అతను సుఖంగా రోజులు గడపలేడు. వెనుకటివిధంగా భజనకీర్తనలూ అవీ పాడలేడు. విచారించలేడు. ఇక్కడికి రాకమునుపు అతను సుఖవంతుడు. ఇప్పుడితనికి సుఖంలేదు. వెనుక అతను విరాగి: ఇప్పుడు సంసారి.

కన్నీళ్లు తుడుచుకుని బ్రతికున్నంతకాలం సుఖం ఇకలేదని గ్రహించి జీవించివున్న ప్రతివాడూ దుఃఖితుడేనని అను అనుకున్నాడు. చనిపోయిన తర్వాతనే యీ జ్వాలామయ దుఃఖిత సంసారంనుంచి ప్రతివాడికీ విముక్తి లభిస్తుంది.

చచ్చిపోయిన లలన తన దుఃఖాన్ని కష్టాన్ని అన్నీ మూట కట్టి అతని నెత్తిన పెట్టినట్లనిపించింది.

ఆ రాత్రి మాధవుడి వంట్లోకూడా ఏమంత బాగాలేదు. ఈ మధ్య అతనికి ఓ పీడ పట్టింది. సమయం వచ్చినప్పుడు లలన

వచ్చి అతన్ని తీసుక పోతానని చెప్పింది, అయినా తనవద్ద బలంలేదు, ఒకవేళ ఆమె రాకపోతే తను ఏ విధంగా అక్కడికి వెళ్ళాలి? చాలా రాత్రిదాకా ఆలోచించి తన అక్క అబద్ధం చెప్పదనే నిశ్చయానికొచ్చి నిశ్చితంగా నిదుర పోయేవాడు.

# 22

ఈరోజు మాధవుని స్థితి మరీ గాబరాగావుంది. పక్కమీద అటు ఇటూ దొర్లుతున్నాడు. ప్రక్కన తలవద్ద అత్త కృష్ణప్రియ, చలనా కూచున్నారు. సుభద మాత్రం వంటింటిలో కూచుని ఏడుస్తూ వంటచేస్తూవుంది. సదానందుడు డాక్టరుకోసం వెళ్ళి ఇంకా గాలేదు. హరాన్‌చంద్రుడు ''ఇప్పుడే వస్తాను'' అని నాలుగు గంటల క్రితం వెళ్ళి ఇంతవరకూ తిరిగి రాలేదు. ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూంటే కృష్ణప్రియ డాక్టరు రాక కెదురుచూస్తూ, అవసాన గడియలు లెక్కపెడుతూంది.

సాయంకాలం కాబోతూ వుందనగా డాక్టరు వచ్చాడు. డాక్టరు రోజూవచ్చి చూస్తున్నా, మాధవుడి రోగం తగ్గలేదు. కాని యెక్కువ అవుతూంది. ఇక బ్రతకడని డాక్టరుకు తెలుసు, అందువల్ల డాక్టరుకు రావడాని కసలు ఇష్టంలేదు. కాని, సదానందుని బలవంతంమీద వచ్చాడు.

డాక్టరు రోగిని పరీక్షించి, సదానందునితో బైటకువచ్చి ''సదానందబాబూ! యీ రోజు మాత్రం జాగ్రత్తగా వుండండి. పిల్లవాడికి యీ రాత్రి గడవదు'' అని చెప్పాడు.

ఆ సంగతి సదానందునికి డా కూతెలుసు.

హారాన్ దొంగలా, చాలా రాత్రయాక వచ్చి తలుపులు మెల్లగా తీసి లోపలకు తల పోనిచ్చి "ఇప్పుడెలా వుంది?" అని అడిగాడు.

ఎవరూ జవాబు చెప్పలేదు. సుభద మాత్రం బైటకువచ్చి అన్నపు కంచాన్ని దగ్గరపెట్టి దగ్గరగా కూచుంది.

హారాన్ "మధు ఎలా వున్నాడు?" అని అడిగాడు.

"ఎలా వున్నాడని చెప్పను? చాలా మించిపోయింది."

"ఏం బాగాలేదూ?" అని కొంచెం ఆగి మళ్ళీ "నా వంట్లో కూడా ఏమీ బావుండడంలేదు" అని అన్నాడు.

అత నేమాలోంచి యీ మాట అన్నాడో, దేన్ని జ్ఞప్తికి తెచ్చుకుని అన్నాడో, ఇందులో ఎంత నిజముందో, అతనికి తెలుసు. ఈ మాట మాత్రము సుభద చెవుల్లో దూరలేదు. తన భార్యముందు తన వంట్లో బావుండడం లేదని చెప్పినా ఆమె ఏమీ సమాదానం చెప్పకపోవడంవల్ల కొద్దిగా నిషాచేసి వున్నందున అతనికి పెద్ద అవమానాన్ని కలిగించి అతని మెదడులో వృక్షరూపాన్ని దాల్చింది. కోపంతో గిన్నెను నెట్టి "ఇక నే నేమీ తినను. నేను చావాలా ఏమిటి?" అని లేచి తన గది లోకి వెళ్ళి పక్కమీద పడుకున్నాడు.

ఇటు సుభద చేతులు కడుక్కుని మాధవుని దగ్గరకు వెళ్ళి కూచుంది. కృష్ణప్రియ ఆమెను చూచి "హారాను యెక్కడున్నాడు?" అని అడిగింది.

"ఆయన వంట్లో ఏమీ బాగాలేదని పడుకున్నారు."

కృష్ణప్రియ కొంచెంసేపు వూరుకుని "ఆఁ, పరువూ మర్యాదా లేకపోయినా, జన్మకు సిగ్గనేది వుండాలి'' అని అంది.

ఆమాట విని రాసమణి నాలుక కొరుక్కుంది.

మెల్ల మెల్లగా రాత్రి గడుస్తూంది. కృష్ణప్రియ యెన్నో మృతశయ్యల దగ్గర కూచుని ఎన్నో చావులు చూచింది. మాధవుడు ఆఖరి దశలో వున్నాడని ఆమెకు తెలుసు. కొంచెం సేపయాక మాధవుడు ''తలలో చాలా నొప్పిగా వుంది" అని అన్నాడు.

కృష్ణప్రియ మెల్లగా తలమీద చేత్తో నిమురుతూ వుంది. కొంచెం ఆగి మళ్ళీ ''కడుపునొప్పి; ప్రాణంకొట్టుకుంటూవుంది'' అని మాధవుడు మూలిగాడు.

అందరూ అతని అంతిమ క్షణాన్ని చూస్తూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. కొంచెం సేపయాక క్షీణిస్తున్నగొంతుతో "దాహం'' అని అడిగాడు.

అత్త పాలకు బదులు కొంచెం నీళ్ళు నోట్లో పోసింది.

మెల్లమెల్లగా కొట్టుకుంటున్న వూపిరి వేగంగా కొట్టుకుంటూండడం అందరూ చూచారు. కృష్ణ ప్రియకు నాడి చూడ్డం తెలుసు గనుక చాలాసేపు నాడిచూసి ''ఇకనేలమీదకు దించండి" అని చెప్పింది.

సదానందుడు మాట్లాడలేదు.

ఈ మాట వినిన రాసమణి ''ఇంకా చూస్తావేం సదానందా?'' అని అంది. చలన, అత్త, అమ్మా అందరూ గొల్లుమన్నారు. సదానందుడు మాధవుణ్ణి నేలమీదకు దించాడు.

చాలా సేపయాక మాధవుడు నోరు తెరిచాడు. కృష్ణప్రియ కొంచెం నీళ్ళుపోసింది. కొద్దిగా బలం వచ్చినట్లు కళ్ళు తెరిచి నవ్వుతూ "సదా....న్నయ్యా! అక్క....వ....చ్చిం....ది" అని అన్నాడు.

దగ్గరే కూచున్న చపల భయపడి తల్లి దగ్గరకు వెళ్లి కూచుంది. రాసమణి శరీరంలోని అవయవాలు గగుర్పొడిచినయ్.

ఇంకా కొంచెం సేపయాక మాధవుడి ప్రాణం యెక్కువగా యాతన పడడం మొదలు పెట్టింది. వూపిరి తీవ్రంగా కొట్టుకుంటూ వుంది. యిదంతా చూస్తూ కృష్ణప్రియ "యింకేమీ ఆలస్యం లేదు, సమయం అయింది" అని యేడుస్తూ అంది.

రాసమణి కూడా "ఎందుకలా చూస్తారు? ఇక పరలోకపు పనులన్నా చేయండి తులసి నీళ్ళ...." అని ఊదుకుంది.

అందరూ గట్టిగా గొల్లుమని యేడుస్తున్నారు. ఈ గోలకు హారాన్‌కు నిద్ర మెలకువ వచ్చింది. గబగబా లోపలకు వెళ్తుండగానే, మాధవుణ్ణి బయటకు తీసుకరావడం చూశాడు. అతను కూడా ఏడుస్తూ కొడుకు శరీరాన్ని యెత్తుకుని క్రిందపెట్టి "నాయనా, మధూ, మధూ?" అని ఏడుస్తూ పిలిచాడు.

మాధవుడు యెక్కడో వినిపిస్తున్న గొంతుకతో "నాన్నా!" అని వుంటాడు.

## 23

ఓ పెద్ద భవనంలో మాలతి కుషన్ కుర్చీలో కూచుని పుస్తకం చదువుతూ వుంది. ఆ గదికి నాలుగు వేపులా అలంకారాలు

అమర్చి వున్నాయ్। క్రింద తివాచీలు, గోడలకు అద్దాలు, ఒక శ్రీమిది జమీందారుల కుండవలసిన ఫర్నిచర్ అంతా అమర్చ బడి వుంది.

కాగితాలమీద కాగితాలు చదువుతూ వుంది. కాని, ఒక్క అక్షరమైనా మనసుకు నాటడంలేదు. ఆమె ఏడుస్తున్నదని బుగ్గలమీదున్న కన్నీటి చారలవల్ల తెలుసుకోవచ్చు. ఆమె యేడ్చేది యెందుకో యేమో యెవరికీ తెలియదు కాని, ఆమె యేడవడం మాత్రం యథార్థం! ఆ యేడ్పును ఆపుకునేందుకే ఆమె పుస్తకాన్ని అందగా తీసుకుంది. ఆమె వంటిమీద నగలు కాని, విలువైన గుడ్డలుకాని లేవు, పుస్తకం మూసి మేజాబల్ల మీదకు విసిరివేసి, కూర్చున్న కుర్చీ చేతిమీద తల అనించి కూచుంది. మళ్ళీ కళ్ళవెంట నీళ్ళు కారుతున్నై. యీ మారు వాటిని అపుకునేందుకు ప్రయత్నించలేదు. ఒక్కొక్క చుక్క కుర్చీ కమ్మిమీద పడి దాని మీదున్న ముఖమల్ గుడ్డను తడుపుతూ వున్నాయ్. సురేంద్రనాథుడు ఎప్పుడు వచ్చింది కూడా ఆమెకు తెలియదు. ఏడుస్తూందల్లా ఏడుస్తున్నట్టే వుంది. సురేంద్రనాథుడు యేమీ మాట్లాడకుండా నిలుచుని ఆమెను చూస్తున్నాడు.

కొంచెం నేపయాక సురేంద్రుడు మరీ దగ్గరకు వచ్చి "మాలతీ!" అని పిలిచాడు.

మాలతి వులిక్కిపడి అతనివేపు చూసి "రండి" అని అంది.

సురేంద్రుడు ఆమెదగ్గర కూచుని తన రెండుచేతుల్లోకి అమె చేతులను తీసుకుని గద్గదంగా "ఏడుస్తున్నావేం?" అని అడిగాడు,

"లేదే" అని అనలేకపోయింది.

మాలతి మాట్లాడలేదు.

ఆయనకూడా కొంచెంసేపు మాట్లాడలేదు. ఆమె చేతుల్ని కొంచెం గట్టిగ వత్తుతూ "ఇంత ఇదిగా ప్రయత్నిస్తున్నా నీకు ఏడుపు తగ్గలేదే! అని నాకు విచారంగా వుంది. ఎన్ని విధాల ప్రయత్నించినా నిన్ను సంతోషపెట్టలేక పోయాను" అని అన్నాడు.

జవాబు చెప్పాలని మాలతి అనుకున్నా, ఏం చెప్పాలో ఆమెకు తెలియదు, యింకేమి జరిగినా ఆమె ఏడవకూడదని అనుకుంది. కాని, కన్నీళ్ళనుమాత్రం జయించలేక పోయింది. అవి ఆ విధంగానే కారుతూ వున్నాయ్.

సురేంద్రుడు, "ఏపని చేస్తే ఒకరు సుఖపడతారో, ఆ పని ఆ సంగతి మానవుల కెంతమాత్రం తెలియదు. దేవతలకూడా అది తెలుసో లేదో, చెప్పలేం. తృప్తికోసం, సుఖం కోసం, యీ యింటిని ఇంత గొప్పగా అలంకరించినా, ఈ దేవీ ప్రతిమను ఇంత ప్రేమతో ప్రతిష్ఠించినా, సుఖమేం కలిగింది? సుఖము అటుంచి, దుఃఖం మరీ ఎక్కువయింది. యెవరికి ఆనందం కలగాలని యింత గొప్పగా ఇంటిని ఆకర్షించేట్లు చేశానో ఆ శ్రమకు ఒక్క రోజుకూడా వారు సుఖంగా వుండడం చూడలేదు. ఇక్కడికి వచ్చినప్పట్నుంచీ నీ పెదిమలమీద ఒక్క క్షణమయినా చిరునవ్వు కనుపించలేదు" అని అంటూ ఆమె చేతుల్ని వదిలి మళ్ళీ "మాలతీ! యెన్నో రోజులు గడిచి పోయినయ్! నే నేపని చేసినా నీముఖం వికసించదా? ఏ విధంగా కూడా నీకు సంతోషాన్ని కలిగించలేనా?" అని అడిగాడు.

మాలతి కన్నీళ్ళు తుడుచుకుంది.

"యీ సౌందర్యమేమిటి? ఈ అందానికి నేను పూర్తిగా పిచ్చి వాణ్ణయ్యానని చెప్పడానికి అసమర్థుణ్ణి. నీవు పెట్టుకుంటావని యెన్నో సొమ్ములూ, బట్టలూ, తెచ్చాను. కాని, అవి ఓ క్షణమైనా నీ వంటిమీద చూడలేదు. మాలతీ! నా వేపు కన్నెత్తి చూడవా యేమిటి?"

మాలతి తలమీద చేయిపెట్టి నిమురుకూ గద్గదస్వరంతో "నీవు నన్ను చూడలేవని చెప్పలేను. ఇవాళ నా మనసులో వున్న విషయాలన్నీ మీకు దాచకుండా చెప్తాను. తక్కువజాతి ఆడవాళ్ళు నగలకీ, గుడ్డలకీ ధనానికీ తప్ప ఇంకే వస్తువులకూ దుఃఖించరు, ఆశించరు. నీవు వాళ్ళలాంటి దానివి కావని నా మనసుకు యెవరో చెప్పుతున్నారు. మరి, నేను ఏంచేస్తే నీవు సంతోషంగానూ, సుఖంగానూ వుంటావో నాకు తెలియడంలేదు. లేకపోతే ఇప్పటివరకూ నీవు సంతోషంగా వుండేదానివే!" అని కొంచెంసేపు మౌనంగావుండి "మాలతీ. నీ భర్త యింకా బ్రతికే వున్నాడా?" అని అడిగాడు.

అతని గుండెమీద చేతులు తిప్పుతూ మాలతి లేదని అంది.

అయితే మరి నేను నిన్ను పెళ్ళిచేసుకుంటే నీకు సంతోషమేమన్నా కలుగుతుందా? చెప్పు చెప్పు. నాకు సిగ్గేమీ లేదు"

మాలతి అతని పాదాలమీద పడి చేతులూ కాళ్ళూ పట్టుకుని ఆపాదాలమీద ముఖం దాచుకుంది. ఆమెనులేవదీద్దామని సురేంద్రనాథుడు ప్రయత్నించలేదు. కన్నీళ్ళతో తనపాదాలుతడుస్తున్నయ్, అని తెలుసుకున్నా అత నామెను లేవదీయలేదు. ఓ నిశ్వాసం విడిచి నిశ్శబ్దంగా కూచున్నాడు.

ఎంతో కాలం గడిచాక ఉదాసీనంగా "నా ఆరోగ్యం యెలా వుందో భగవంతునికే తెలుసు. మనస్ఫూర్తిగా నిన్ను ప్రేమించానో, లేక నీ సౌందర్యం నన్ను పిచ్చివాణ్నిగా చేసిందో చెప్పలేను. అయినా వివేక మనేది యేమీ నాలో లేదు. మంచిచెడ్డలు తెలుసుకునే జ్ఞానం నన్ను వదిలి పోయింది. నీ వేపనిచెప్పినా దాన్ని చేయడానికి నా ప్రాణమైనా అర్పిస్తాను. ఈ పనులుచేసి నీ మనస్సును నా మీదకు తిప్పుకుంటున్నానని అనుకోవద్దు. అది భగవంతునికే తెలుసు. ఇది అబద్ధంకాదు. ఇదంతా సరి గాని మాలతీ! నిన్ను పెళ్ళిచేసుకుంటే సంతోషంగా వుంటావేమో చెప్పు? జాతీ, కులం. గౌరవం యింతపెద్ద వంశం యివన్నీ నేనుచూడను" తరువాత సురేంద్రుని కన్ను చెమ్మగిల్లి కంఠం రుద్ధమయింది. కొంచెంసేపుండి మళ్ళీ తీయని పలుకులతో "మాలతీ! నాలాంటి వాళ్ళకు యెటువంటి దారి దొరుకుతుందో, దానికోసం అంతా వదిలిపెట్టి, చివరకు ఆత్మహత్య చేసుకుని నరకంవేపు వెళ్తాను" అని అన్నాడు.

మాలతి వినలేక "అటువంటి మాటలనకండి! మీరు నా ప్రాణాలు రక్షించారు. నా సిగ్గును కాపాడి, నాకింత ఆశ్రయాన్ని కలిగించారు. లేకపోతే ఇంతకాలం బ్రతికుండేదాన్నికాదు. నేను నీచురాల్ని, విశ్వాసఘాతకురాలినీ కాను. దిక్కులేని దానిమీద చూపిన దయనూ, ప్రేమనూ యీ జీవితంలో మరిచిపోలేను. వీటన్నిటికీ ప్రతిఫలం నేను యే విధంగా ఇవ్వాలా?" అని యేడుస్తూ అంది ఆమె.

సురేంద్రుడు ఓ నిట్టూర్పు విడిచి "ప్రతిఫలమెలా అవుతుందో అది ఈశ్వరునికే తెలియాలి. కాని, నాకు మాత్రం

తెలవదు. ఒక నెలనుంచి నేను ఎటువంటి ఆనంద, భోగం అనుభవిస్తున్నానో, నా హృదయం ఎలా మండుతూ వుందో నేను నీకు యేవిధంగా చెప్పను? చూడు తప్పనుకోకు. ఈ కొద్ది రోజుల స్నేహానికే నేనొక ఆడదాని బానిసగ మారిపోతున్నానంటే, నాకే సిగ్గవుతూవుంది. ఒక....ఒక....నీ వెవరైనాసరే. అయినా నేను స్వర్గీయులైన మా పితామహుల వంశ గౌరవాన్ని కూడా అగౌరవపరిచేందుకు తయారయాను'' అని అన్నాడు.

మాలతీ ఏడుస్తూ ''నేను మీ దాసీలకు దాసీగా వుండడానికి కూడా పనికిరాను. నే నెవరినని మీ మనసింతగా పాడుచేసుకుంటారు? నేను ఆజన్మాంతం దుఃఖితురాలిని. ఇంత దయను నేనీ జీవితంలో యెప్పుడూ పొందలేదు" అని మళ్ళీ ''అఖరు చేయదలచుకుంటే ఈశ్వరుడే నన్ను ఆఖరుచేస్తాడు''అని అంది.

సురేంద్రనాథుడు ఆమె చేయి పట్టుకుని తన దగ్గర కూచోపెట్టుకుని ''ఏ విధంగా కూడా నీకు సంతోషం కలగదా?'' అని అన్నాడు.

మాలతి కన్నీళ్ళు తుడుచుకొని ''మేము బీదవాళ్ళం అని అంది.

''నేనుమాత్రం బీదవాణ్ణికాదు నా కున్నదంతా నీదే!''

''నేను నా విషయాన్ని కాదు చెప్పేది''

''ఎవరిసంగతి? మరి నీ కెవరూలేరుగా?''

''ఇప్పుడెవరయినా వున్నారో, లేరో, భగవంతునికే తెలుసు. నేను వచ్చినపుడు మాత్రం అందరూ వున్నారు''

''ఇదేమిటి, పడవ మునిగిపోయి....''

ఆమాట పూర్తికాకమునుపే "ఆఁ, అదంతా అబద్ధం. పడవా గిడవా ఏమీ మునిగిపోలేదు" అని మాలతి అంది.

ఆశ్చర్యంతో సురేంద్రుడు మాలతి ముఖంలోకి చూసాడు. ఇదంతా నిజమా, అబద్ధమా? అనే అనుమానం కలిగింది. కాని, యీ ముఖం తనను మోసము చేయదు. ఈ నేస్ప్రు.... యీ కళ్ళల్లో మోసముందా?

అబద్ధం ఎప్పటికీ దాగివుంటుందా? ఆయన మనసు ఏమీ గ్రహించలేక పోయింది. కొంచెం సేపయాక "మాలతీ!" అని పిలిచాడు.

"ఏమిటి?"

"నిజమేనా?"

మాలతి అతని ముఖంలోకి చూసింది. చూస్తూ చూస్తూండగానే, ఆమెకళ్ళు కన్నీళ్ళతో నిండినై! సురేంద్రుడు సిగ్గుపడి తన చేత్తో ఆమె కన్నీళ్ళు తుడుస్తూ "అయితే అసలు సంగతంతా చెప్పు?" అని అడిగాడు.

"పుట్టినప్పటినుంచీ కష్టాల్లో పెరిగాను. తండ్రిగారు ఏదో వున్నవాడికిచ్చి పెళ్ళిచేసారు. కాని, ఈ అభాగ్యురాలు ఒక సంవత్సరం తిరక్కముందే విధవ అయింది. అప్పట్నుంచీ తండ్రిగారింట్లోనే వుండేదాన్ని. మానాన్న 'హలాద్‌పురము'నకు షుమారు మైలు దూరంలో వుండే జమీందారుగారివద్ద పనిచేస్తుండేవారు. జీతం చాలా తక్కువ. యెలాగో ఒకలాగు దాంతోనే మాకు గడిచేది!" అని చెపుతూంటే ఆమె గొంతును ఎవరో నొక్కినట్లయింది.

"మీ ఇంట్లో అప్పుడు యెవరెవరున్నారు?"

"అందరూవున్నారు. తల్లీ, తండ్రీ, అత్తా, మేమిద్దరంఅక్కా చెల్లెళ్లం, తమ్ముడూ. తరువాత దొంగతనం పేరుతో మానాన్న గారి నౌకరీ పోయింది. అప్పట్నుంచీ భిక్షాటనమే మాకు ఆధార మయింది. ఒకరోజు తిండివుంటే ఒకనాడు వుండేదికాదు. సీతమ్మవారి లాంటిది కాబట్టి మా అమ్మ మా పస్తులు చూడ లేక అక్కడక్కడే అడిగి, బుడిగి, మాకు పెట్టి తాను పస్తుం డేది. మూడేసి రోజుల వరకూ...." అని మాలతి వెక్కెక్కి ఏడుస్తూ "కాని, మా నాన్నగారు ఇవన్నీ చూస్తూకూడా ఏమాత్రం శ్రద్ధ తీసుకునేవాడు కాదు. గంజాయి తాగి, నల్లమందు, తిని, అక్కడక్కడ పడుకునేవాడు. నాలుగైదు రోజులవరకూ ఇంటి ముఖం చూసేవాడు కాదు. ఓ సంవత్సరం నుంచి చిన్న తమ్ముడు మాధవుడు జ్వరంతో బాధపడుతూ వున్నాడు. అస లిప్పుడు వాడు బ్రతికున్నాడో లేదో?" అని చెపుతూవుంటే సురేంద్రనాథుని కళ్ళు నీళ్ళతో నిండాయ్.

తరువాత కృష్ణత్తయ్యా, సదానందుని విషయం చెప్పి. "చలనామయి పెళ్ళీడుకు వచ్చినా, బీదవాళ్ళ మవడం మూలాన్ని పెళ్లిచేయడానికేమీ ప్రయత్నాలు చేయలేదు. పెళ్లికాకపోతే బ్రాహ్మణజాతి పోతుంది. అమ్మగారి అన్నపానాదులు తగ్గిపోయి నయ్! రాత్రుళ్ళు నిదుర కరువైంది. కాని, నాన్నగారి కేమీ చీమకుట్టినట్లు లేదు. సదానందుడు వున్నాడనే నమ్మకంవుంది. కాని, ఆయన ఇప్పుడు అత్తగారితో కాశీకి వెళ్ళాడు.

"నాన్నగారి నౌకరీ పోయాక యీవిధంగా ఆరునెలలు గడి చినయ్? చుట్టుపక్కలవాళ్ళు యెంతని సాయం చేస్తారు? కాశీకి

వెళ్ళేప్పుడు సదాన్నయ్య యిచ్చిన యాభై రూపాయలూ అయి పోయినయ్. "చాలు. ఇక ఆకష్టాల్ని చెప్పలేను" అని అంటుంటే సురేంద్రుని కళ్ళు నీళ్ళతో నిండినయ్, మాలతి యేడ్చింది.

చాలా సేపయాక సురేంద్రుడు కన్నీళ్లు తుడుచుకుని "చాలు. మిగిలింది యింకోనాడు చెప్పు" అని అన్నాడు.

మాలతి కన్నీళ్ళు తుడుచుకుని "యెందుకు ఇవాళే చెప్పేస్తాను, అందరూ నేను అందంగా నున్నాననేవాళ్ళు....కలకత్తా వెళ్ళి డబ్బు సంపాయిద్దామని ఆలోచించి ఒకనాటి రాత్రి గంగా నది వడ్డుకు యీ నది వొడ్డున వెళ్తే ఒకళ్ళని దారి అడుగవలసిన పనిలేదని వచ్చి యెవరూచూడరనికూడా ఆలోచించాను. నది వొడ్డుకు వచ్చేసరికి ఒక వోడ వెడుతూండడం చూసాను. నాకు ఈతవొచ్చు. ఈదుకుంటూ వెళ్ళి, ఓడ అంచును పట్టుకుని తిన్నగా అక్కడకు వెళ్ళవచ్చని అనుకున్నాను. కలకత్తా యెక్కువదూరం లేదనికూడా విన్నాను. ఇలా ఆలోచించి కొంచెం దూరం ఈదుకుంటూ వెళ్ళేప్పటికి నా కోక చేతులకూ కాళ్ళకూ చుట్టుకుని నాకు అపాయం కలిగించింది. అప్పుడే ఓడ దగ్గరకు వచ్చింది. నా కాళ్లూ చేతులూ ఆడలేదు, అందుకని చీరను విప్పివేసాను, వడ్డుకు తిరిగి వెళ్దామంటే ధైర్యంలేదు. అందుకని ఓడ అంచు పట్టుకున్నాను, ఓడ వెళ్తూవుంది, ధైర్యంగా దాన్నే పట్టుకున్నాను. అలా చాలా దూరం వచ్చాను. ప్రొద్దున్నే ఆడవాళ్లు గంగానదికి స్నానానికి వచ్చినపుడు ఒక చీరను దానం అడుక్కుందామని అందులో గుడ్డలేకుండా నగ్నంగా

వున్నదానికి ఒక ఆడుది కాకుంటే ఇంకో ఆడుదానికైనా దయ కలుగుతుందనీ, అనుకున్నాను. ఆ తరువాత తమకు తెలుసు'' అని చెప్పింది.

''యెవరికోసం యింత సాహసాన్ని తలపెట్టావో వాళ్ళకు యిన్ని రోజులు గడిచిపోయినా యేమీ సహాయం చేయలేక పోయావుకదూ?''

''ఊఁ!''

''తెలుసు. నే నప్పుడే అనుకున్నాను. ఈ సంగతి చెప్ప డానికే సిగ్గుపడుతున్న నీవు ఆ పని చేయడానికి ధైర్యం యెక్క-డ్నుంచి వస్తుంది? నాకు తెలుసు''

మాలతి మాట్లాడలేదు.

''ప్రతి నెలా యెంతయితే వాళ్ళకు సరిపోతుంది?''

''ఇరవై రూపాయలు''

''అయితే, ప్రతినెలా యింటికి యాభై రూపాయలు పంపుతూ వుండు.''

''మీ రిస్తారా?''

''ఇస్తాను. కావాలంటే యింకా యిస్తాను.''

ఇన్ని రోజు లయాక తనజన్మ సఫలమైందని మాలతి అను కుంది.

''తరువాత యింకోపని చేయాలి. నన్ను పెళ్ళిచేసుకో, యెందు కంటే, ఇంత నిర్మల హృదయాన్ని కళంకితం చేయ నీయను.''

''వద్దు''

"ఎందుకని వస్తు? నా జాతి భ్రష్ట మవుతుందని ఆలోచిస్తున్నావా? కాని నేనీ వూరికి జమీందారుణ్ణి! నా దగ్గర చాలా డబ్బుంది. ఎవరిదగ్గర డబ్బుంటుందో, వారికి ఖాత రనేది యెప్పటికీపోదు.

"చాలా అల్లరవుతుంది"

"అవుతుంది........కాదనను. అయినా అది చాలా కాలం వుండదు."

"అయినా, వంశం, కులం, గౌరవం?"

"మాలతీ! ఒకరోజు కోసమన్నా యివన్నీ మరిచిపోనీయ్! ప్రపంచంలోకి వచ్చి అనేక వస్తువుల్ని పొందాను, అనుభవించాను. కాని ఇప్పటివరకూ సుఖ మనేది పొందలేకపోయాను. ఒక్కరోజన్నా నన్ను సుఖపడనీయ్!

"నా జీవితాంతం నేను మీదగ్గరే వుంటాను."

"భగవంతుడు అలానే చేయాలని నేను వేడుకుంటాను. ఐనా నీవు జీవితాంతం వరకూ వుంటే నేను వుంచుకోగలనా? మాలతీ, ప్రపంచాన్ని నేను చూసినట్లు నీవు చూడలేవు. నేను నమ్మతగిన వాణ్ణి కానని నాకు తెలుసు. ఏ ప్రేమలో స్వచ్ఛందతా పూర్వకంగా నీవు జీవితం గడుపుదామని ఆశించావో దాన్ని నేను మధ్యలోనే త్రుంచి వెళ్ళిపోతే నీ గతేంగాను? ఆలోచించు మాలతీ; ఆలోచించు. నన్ను పెళ్ళిచేసుకో!"

"మీ ఆశ్రయ మెప్పుడయితే యీ దీనురాలికి దొరికిందో అప్పుడే మిమ్మల్ని చేసుకున్నట్లు! ఈ బంధనాల్ని త్రెంచి పారవేయ దలచుకుంటే త్రెంచి పారేయండి. తరువాత యింకే బంధనమూ అవసరం వుండదు."

"నీ కవసరం లేకున్నా, నాకు కావాలి!"

"కావలసివున్నాసరే పెళ్ళిమాత్రం వద్దు."

"ఎందుకని? విధవను పెళ్ళిచేసుకోకూడదా?"

"చేసుకోవచ్చు. అయినా వేశ్యతో మాత్రం కూడదు."

"ఛీ! ఛీ! అటువంటి మాట లనకు మాలతీ! నిన్నెంతో ప్రేమిస్తున్నాను."

"అందుకనే చెప్పింది. లేకపోతే పెళ్ళి చేసుకునే దాన్నే"

"మాలతీ!"

"ఏమిటి?"

"నీ వుద్దేశం చెప్పవూ?"

"చెపుతాను. మీరుతప్ప నా శరీరాన్ని యింతవర కెవరూ ముట్టుకోలేదు. అయినా ఒక మనిషికి ప్రాణ మర్పించి వున్నాను."

"తరువాత"

"నన్ను పెళ్ళిచేసుకోమని అతన్ని ప్రోత్సహించాను."

"ఆ తరువాత"

"తనజాతి భ్రష్ట మవుతుందని, అతను పెళ్ళికి యిష్టపడ లేదు."

"మరి, ఆ హృదయాన్నీ ప్రాణాన్నీ తిరిగి యెలా మళ్లించు కున్నావు?"

"అతను వెళ్ళగొట్టిన విధంగానే"

"ఇచ్చేసాడా?"

"నేను వేశ్యనని ముందే చెప్పానుగా, అన్ని పనులూ వేశ్య చేస్తుంది. వేశ్య ఒక్కతే దీనికి సమర్థురాలు"

"పిచ్చి సదానందుడేనా అతను?"

"కాదు. ఇంకొకరు"

"అయితే, నీవు మనిషిని గుర్తించలేదన్నమాట! మరి అతనికి నీ వెందుకు చెప్పలేదు? అతను నిన్ను ప్రేమించాడా?"

మాలతి శరీరంలో మెరుపు మెరిసినట్లయింది. పిచ్చివాని ముఖం....ఆనాడు వర్షం కురుస్తుంటే, తడిస్తే జ్వరం వస్తుందని సదానందుని యింటివద్ద తను నిలుచోవడం బలవంతంగా ప్రతి రోజూ యేదో ఒక విధంగా తన పిడికిలి నింపి పంపడం ఆపద సమయాల్లో అతని సానుభూతి అన్నీ జ్ఞాపకం రావడంతోనే, కళ్ళు నీళ్ళతో నిండినయ్! వాటిని సురేంద్రుడు చూడకుండానే తుడుచుకుంది.

"మాలతీ ఆ తరువాతను"

"కలకత్తా రావాలని బయలుదేరాను"

"ఊ!"

"దయతో తమరు మీ పాదాలవద్ద యింత ఆశ్రయాన్ని కల్పించి, రక్షించారు"

"మాలతీ! నువ్వు రత్నంలాంటిదానివి. పొరపాటున ఆ రత్నం చెడ్డ ప్రదేశాల్లో పడినా దాన్ని ఆదరించవచ్చు."

"ఎవరు చెప్పారు? ఒకరు ప్రేమతో మెడలో కట్టుకున్న రత్నాన్ని యింకొకరు కాళ్ళదగ్గరకూడా వుంచుకోరు. మీరు నాకు ఆశ్రయ మిచ్చారు. నేను రత్నాన్నే! నన్నాలానే వుండ నీయండి. అదే నాకు పరమ సౌభాగ్యమని తలుచుకుంటాను."

"మాలతీ, నువ్వు మూర్ఖురాల వనుకున్నాను. కానీ, మూర్ఖురాలి వెంతమాత్రం కాదు"

మాలతి మెల్లగా నవ్వింది. ఇంతకాలమయాక మొట్టమొదటి సారిగా ఆమె నవ్వింది. ఆ సమయంలోనే బైటనుంచి దాసీది "బాబూ! అఘోరబాబూ. వారి భార్యా బైటనుంచున్నారు" అని అంది.

"అఘోరబాబా? యిక్కడికెందుకు....?"

"ఏమో, తమతో తొందర పనుందట"

సురేంద్రుడు లేచి "మాలతీ! అయితే నేను వెళ్తున్నాను" అని అన్నాడు.

"వెళ్ళండి. కానీ, అఘోరబాబెవరు?"

"తరువాత చెప్పుతాను"

## 24

పుట్టిన ప్రతి మానవుడూ చనిపోవడం, ఆకాశంవేపు విసిరిన ప్రతి రాయీ తిరిగి క్రిందపడి పోవడం హత్య చేసినవానికి వురీ, దొంగతనం చేసినవానికి జైలూ ప్రేమించినవాడు యేడవటం....యితర నియమాలతో పాటు ప్రపంచంలో యివీ ఒక నియమాలై కూచున్నాయి.

ఈ నియమాలను ప్రచారంలోకి యెవరు తీసుకుని వచ్చారో యెవరికీ తెలవదు. భగవంతుని ప్రేరేపణవల్ల కళ్ళు నీళ్ళతో నిండుతాయో, లేకుంటే మనుష్యులే తమ పనుల్ని పూర్తిచేసుకునేందుకుగాను యేడుపును సాధనంగా తీసుకుంటారో అదీ కాకుంటే వివశమై యేడుస్తారో, యేదీ తెలవదు. కాని, ప్రేమించినవాళ్ళు మాత్రం యేడవటమనేది నిజం.

ప్రేమవల్ల మాలతి కన్నుల్లోంచి కారిన నీరు భగవంతుని పాదాలమీద కమలములులా వికసించాయ్! తనను తాను మరిచి పోయి సిగ్గూ, బిడియములు లేకుండా ఉచితా నుచితములు లేకుండా యెవరి పాదాలమీద మాలతి లా బలిదానం చేస్తారో వాళ్ళకు జీవన్ముక్తి, భగవత్సాక్షాత్కారం కలుగుతాయి. ప్రజలు వాళ్ళను పిచ్చివాళ్ళని అనుకుంటారు. కాని, ఆ పిచ్చివాళ్ళు కనబడడం మాత్రం అరుదు.

సురేంద్రుడు వెళ్ళాక తలుపులు మూసి, నేలమీదపడి మాలతి ఎంత యేడ్చిందో చెప్పలేను. బాల్యావస్థలోని ప్రేమకంటే, ఇప్పటి ప్రేమ ఆమె మనసును పూర్తిగా హరించింది. ఈ సారి మాలతి తన కున్నదంతా అర్పించి ప్రేమించింది కాని, దాని మీద కృతజ్ఞత కమ్మింది. తన సుఖాన్నే కోరుతుందని యెవరన గలరు? తనకోసం అతను నవ్వుతూ నవ్వుతూ ప్రేమను ప్రాణాన్ని అర్పించగలడని ఆమె తెలుసుకుంది.

మాలతి తనలో తానే "మీరు నన్ను ప్రాణంకంటే యెక్కువగా ప్రేమించారు. నా కోసం ప్రాణాలు బలి యివ్వడానికి కూడా తయారయారు. అయినా, మిమ్మల్ని నా కోసం కళంకితుణ్ణి కానివ్వను. నా కోసం మిమ్మల్ని నలుగురూ నాలుగు విధాలుగా అంటుంటే నేను వినలేను. నేను యెవరికీ తెలియనిదాన్ని, కులం లేనిదాన్ని. యెవరూ నన్ను గుర్తుపట్ట లేరు. నాకు సిగ్గూ యెగ్గూ లేదు. మరి మీరో అందరికీ తెలుసు. గొప్ప జమీందారులు. మిమ్మల్ని అంతా పూజిస్తారు. అటువం టప్పుడు యీ కళంకమనేది ప్రపంచమంతటికీ తెలుస్తుంది,

పైగా వేశ్యను జాతిలేనిదాన్ని పెళ్ళి చేసుకున్నాడని నలుగిరితో పాటు ప్రపంచమంతా కోడై కూస్తుంది. సమాజంలో మిమ్మల్ని అగౌరవ పరుస్తారు. నీచంగా చూస్తారు. మీకు తెలియకుండానే మీ హృదయానికి గాయాన్ని కలిగిస్తారు. నేనలా కానీయను. మిమ్మల్ని పెళ్ళిచేసుకుని, మీ గౌరవానికి, వంశానికీ, కళంకాన్ని కలుగచేయనీయను'' అని అనుకుంది.

శాంత మనస్కురాలై కూచుని, కళ్ళు తుడుచుకుని, చేతులు జోడించి ''భగవంతుడా ! ఈ జన్మలో నేను ఏ ఏ అపరాధాలు చేశానో, అవన్నీ నీకు తెలుసు. ప్రపంచంలో నీవు తప్ప నాకింకో ప్రదేశంలేదు. పతితనైనా నీ పాదాలవద్ద యింత ఆశ్రయాన్ని యివ్వడానికి నన్ను తప్పకుండా తీసుకుని వెళ్ళు'' అని ప్రార్థించింది.

అక్కడే ఆ రాత్రంతా నిద్రపోయింది. రెండోనాడు సురేంద్రుడు రాలేదు. అతని రాకకోసం ఆ రోజంతా చూసింది. చాలా రాత్రి గడిచాక సురేంద్రుడు వచ్చాడు. అతని ముఖం అదోమాదిరిగా వుంది. అయినా లేని సంతోషంతో ''మాలతీ! నా కోసం యివాళంతా యెదురు చూసావనుకుంటాను ?'' అని అడిగాడు.

ఆమె మాట్లాడలేదు.

''మాలతీ, ఆ విషయం యేం చేసావు ?''

''ఏమిటది ?''

''ఏమిటా ? నిన్నటిమాట అప్పుడే మరచిపోయావా ?''

''మరిచిపోలేదు. జ్ఞాపకం వుంది.''

"జ్ఞాపకమైతే వుందిలే. మరి యేమాలోచించావు?"

"ఆలోచించాను. కాని, పెళ్ళి చేసుకోలేను"

"చేసుకోవూ? అంటే?"

"అది మీకు ముందే చెప్పాను"

"నా ముహం! నేను పెళ్ళిచేసుకొని తీరుతాను"

"నేను మాత్రం కానీను. ఇక్కడికి వచ్చి ఒక నెలయినా కాలేదు. నా కనవసరంగా విసుగు కలిగిస్తున్నారు. జయవతి చని పోయాక ఆమెస్థానంలో కలకత్తానుంచి యింకొకదాన్ని తీసుక వచ్చారని అప్పుడే అందరికీ తెలిసిపోయింది."

"ఆ సంగతి నాకూ తెలుసు. సరే దాన్నలా వుండనీయ్! నేను...."

"మీరు బలవంతంగా పెళ్ళిచేసుకుంటే, తప్పకుండా నేను విషం తాగుతాను."

"అది తరువాత చూద్దాం. ఏడు రోజుల్లో పెళ్ళి ప్రయత్నాలన్నీ కావాలి"

"యేడు రోజుల్లోపల నే నిక్కడ వుండను"

"యెక్కడికి కెళ్తావు?"

"యిష్టమున్న చోటికి"

"చచ్చిపోతావా?"

"చచ్చిపోతాను? నేను చచ్చిపోలేను. దేనికోసం యిల్లు వదిలిపెట్టి యిక్కడకు వచ్చానో, దానికోసమే. తిరిగి బయలు దేరుతాను"

"అయితే యింతకూ పెండ్లికి యిష్టపడవన్నమాట"

"నేను చేసుకోలేను"

సురేంద్రుడు విస్మయంగా "యేంచేస్తాను? యింతకూ నీ యిష్టం" అని అన్నాడు.

యీసారు మాలతి జవాబు చెప్పలేదు.

"యింటికి డబ్బు పంపావా?" అని సురేంద్రుడు అడిగాడు. యేడుస్తున్న మాలతి అడ్డంగా తల తిప్పింది.

"ఎందుకని పంపలేదు?"

ఆమె మాట్లాడలేదు. ఆమె యేడుస్తోందని తెలుసుకుని సురేంద్రుడు "నీదగ్గం డబ్బులేదా?" అని అడిగాడు.

"లేదు!"

"యేమీ లేదా?"

"లేదు"

"ఇక్కడికి వచ్చి ఇంతకాలమయినా నీ వేమీ తీసుకోలేదు?"

మాలతి యేడ్చింది. మాట్లాడలేదు. వ్యర్థంగా సురేంద్రుడు యీప్రశ్న వేసాడు. ఆమెదగ్గర యేమీలేదని ఆతనికి తెలుసు. కొంచెంసేపయాక ఆమె చేతిని పట్టుకుని తన వొడిలో కూచో పెట్టుకుంటూ "నీ వేమీ తెలియనిదానిలా ప్రవర్తిస్తే నేనేం చేయను? ఒక్క చీరగాని, ఒక్క నగకానీ పెట్టుకోవు. నీ కవసరమేదో? నీ కేది బావుంటుందో గూడా నోరువిప్పి చెప్పవు. అటువంటప్పుడు నేనేంచేయను?" అని అడిగాడు.

తరువాత జేబులోంచి ఓ నోట్లకట్టను బయటకు తీసి "వుంచుకో! ఇందులోంచి ఎంతయినా మీ ఇంటికి పంపు. మిగిలింది యే అభ్యంతరం లేకుండా ఖర్చుపెట్టుకో. ఇంకా

కావలసి వుంటే మధ్య మధ్య అడుగుతూ వుండు.'' అని అంటూ వాటిని ఇచ్చి ''ఇకనుంచైనా డబ్బును పోగుచేయడం తెలుసుకో?'' అని అన్నాడు.

మాలతి వింటూవుంది.

''మరిచిపోకుండా ఇవాళే డబ్బు పంపు.''

''ఎలా పంపను?''

''రిజిష్టరు ద్వారాగాని, మనిఆర్డరు ద్వారాగాని పంపు''

''నా చేతకాదు. మీరే ఇతర పేరుతో పంపించండి.''

''ఎందుకని? పట్టుబడిపోతానని భయమా?''

''ఊ!''

''అయితే మా వకీలు అఘోరబాబుతో చెప్పి పంపిస్తాను. అతనుండేది కలకత్తాలోనే గనుక అక్కణ్నుంచే పంపుతాడు.''

''అలాగే చేయండి, అయినా యెవరైనా అడగడానికిగాని, జాడ తెలుసుకోవాలని గాని వస్తే?''

''ఏది మంచిదనుకుంటే అదే చెప్పుతాను?''

''వద్దు! మీ పేరు బైటకు రానీయవద్దని వారికి చెప్పండి.''

## 25

జయవతేమో చచ్చిపోయింది. కాని ఆమె తల్లిమాత్రం బ్రతికుంది. నారాయణపురానికి కొంచెం దూరంగా 'బాన్ పురం' లో ఆమెకు ఇల్లు కూడావుంది. జయా ఆమె తల్లీ అక్కడే వుంటుండే వాళ్ళు. కుటుంబపోషణ యెలా జరిగేదో వాళ్ళకే తెలుసు! ఈ

విధంగా కొన్ని రోజులయాక జయవతి నారాయణపురం జమీం దారుగారి ఆశ్రయంతోపాటు ఓ ఇల్లూ, అదీ మెల్లగా సంపా యించింది. జమీందార్లుగారి వద్ద ఓ స్థావరం కలిగాక ఆమె తల్లి కూడా వచ్చి జయవతి వద్దే కాలాన్ని వెళ్ళబుచ్చుతూంది. కాని జయ తల్లికి ఆ అదృష్టము లేక అయిదు నెలలు తిరక్కముందే కూతురుతో పోట్లాడి తన పాత యింటికి వచ్చి చేరింది. అసలు "బాన్ పురం" లోని పాత ఇంటిని వదిలిపెట్టడం ముసలిదాని కిష్టంలేదు. పోతూ పోతూ యెన్నో మాటలని మరీ వెళ్ళింది. అప్పటినుంచీ సురేంద్రుడు ఆ పాడు ముండను ఇంట్లోకి అడుగు పెట్టనీయవద్దని కఠినంగా శాసించాడు. కాని, ఆయన ఆజ్ఞాను సారంగా ఏమాత్రమూ జరుగలేదు.

అప్పుడపుడు వచ్చి. నానా తిట్లూ తిట్టి, జుట్టు పీక్కుని చివ రకు నౌఖరు అర్ధచంద్ర ప్రయోగాలతోగాని 'బాన్ పురం' మళ్ళీ వెళ్ళేదికాదు.

అయినా ఆమె కూతుర్ని యెక్కువగా ప్రేమించేది. అందు వల్లే సానివృత్తికి సాహసించిన కూతురినుంచి మనసును మళ్ళిం చుకోలేకపోయింది. ఇలా కొంతకాలం గడచింది. తరువాత కూతురు గంగానదిలో మునిగి చచ్చిపోయిందని వినగానే చుట్టు పక్కలవాళ్ళను పోగుచేసి యేడుస్తూ కూచుంది.

"ఆ ఓడను మించిన పెద్ద ఓడ కలకత్తాలోనే లేదని చూసిన వాళ్ళంతా అంటున్నారు" అని ఒకతను అన్నాడు.

"అలానే నని విన్నాను" అని ఒక వృద్ధుడు అన్నాడు.

మధ్య వయసులోవున్న ఓ పడుచు "ఎంత ఖరీదవుతుందో?" అని ఆశ్చర్యంగా అడిగింది.

"దానికి అంతుందా ఏమిటి?"

జయతల్లి "బంగారపు బొమ్మలాంటి పిల్ల! సాక్షాత్ దేవీ ప్రతిమ! అహా ఆ ముక్కూ, ఆ కళ్ళూ, ఆ రెప్పలూ యేమని చెప్పను!" అంటూ యేడుస్తూనే అంది.

జయ అందగత్తె అని అందరికీ తెలుసు?

"బాబుగారు దాన్ని యెంతయిదిగా ప్రేమించారు. అది యెప్పుడు యేదికావాలని అడిగితే, వెంటనే అది పాదాలముందు వచ్చి వాలేది. ఇంతకూ మహారాజులాంటి బాబుగారి దృష్టిలో పడడం మామూలు సంగతి కాదు.

అదికూడా నిజమే నని అందరికీ తెలుసు.

"నేనుకూడా ఎక్కువకాలం బ్రతకను. ఈ దుఃఖం నన్ను తినకుండా వుంటుందా?"

"జమీందారుగా రేమయారు?" అని ఒకరు అడిగారు.

జయతల్లి "ఆయనకేం? ఆయన బాగానే వున్నాడు. టింగు రంగా అంటూ ఇంకో ఓడలో వుండడం మూలాన ఆయనగారు బ్రతికిపోయారు!" అని అంది.

"అయితే ఇద్దరూ వేరువేరు ఓడల్లో వున్నారా?"

"లేకపోతే ఆయనగా రెలా బ్రతికారు? ఇంతకూ దాని ఖర్మం గాకపోతే ఆ అమ్మాయివెంట వుండేవాళ్ళు మాత్రం తక్కువ వాళ్ళా యేమిటి?"

"మరి వాళ్ళంతా యేమయారు?"

"అందరూ మునిగి చచ్చిపోయారు."

సాయంకాలం కాబోతుం దనగా అందరూ ఎవ రిళ్ళకు వాళ్ళు వెళ్లిపోయారు. తిన్నంతవరకు తిని జయతల్లి తలుపులు వేసుకుని పడుకుంది.

రెండో రోజు వుదయాన్నే జయతల్లి నారాయణపురంవేపు వెళ్లింది. ఆ దారే, ఆ తీరమే, ఆ వృక్షనీడలే అంతా ఆడే ఆమెకు అన్నీ బాగా గుర్తున్నై ! ఈ దారంటే వెళ్లి యీ దారంటే తిరిగి నెత్తి నోరూ కొట్టుకుంటూ వచ్చేది. మునుపటి విధంగా పోట్లాడే కూతు రిప్పుడు లేదు. ఆ పోట్లాటలు యికరావు. ఆ విధంగా గుండెల్ని తను ఇక కొట్టుకోదు. వేదనా హృదయాన్ని ఛీత్కా-రంతో శాంతపరుచుకుని, మెల్ల మెల్లగా నారాయణపురం చేరుకుంది. నడుస్తూ, కనపడ్డ ప్రతి ఇంటిలోకి తొంగిచూస్తూ ఆమె వెళ్తోంది. చివరకు సురేంద్రుని విలాస గృహం కనిపించింది. జయ తల్లికి ఎన్నో విషయాలు జ్ఞాపకాని కొచ్చి హృదయాన్ని గుబులుగా రేకెత్తించి ఏడిపింప చేసినయ్.

లోపలికి వెళ్ళడానికి ఆజ్ఞ లేకపోయినా, సాహసించి తలుపు నెట్టుకుని వెళ్లింది.

భోజనాదులు అయిపోయాక సురేంద్రునికి నిద్రపోవడం అలవాటు. నిద్రపోవడానికి వెళుతూ ఛీత్కా-రం విని జయతల్లి తుఫానులా వచ్చిందని తెలుసుకున్నాడు. వచ్చీ రావడంతోనే ఆమె జయవతిని తిరిగి ఇవ్వమని అడిగి దగ్గరగా కూచుంది. ఆ తరువాత ఒకటి ఇంకొకటి, ఎన్నో వేయికి పైగా అడిగి సురేంద్రునికి విసుగు కలిగించింది.

అన్నీ అయాక జయతల్లి తన దగ్గర ఒక్క- చిల్లిగవ్వకూడా లేదనీ, తమరు దయ వుంచినట్లయితే బ్రతుకుతాననీ, లేకపోతే కూటికి అలమటించి చనిపోవాల్సి వస్తుందని కూడా చెప్పింది.

''జరిగిం దేదో జరిగిపోయింది. ఇప్పుడు నీ కెంతయితే సరిపోతుందో చెప్పు?'' అని సురేంద్రుడు అడిగాడు.

"ఏం చెప్పను నాయనా! ఏదో తమరి దయ....!"

"సరేలే, ఎంతయితే సరిపోతుం దంటావు?"

"పదిహేను రూపాయ లైతే ఒక నెల గడుస్తుంది."

"సరే, ప్రతినెలా వచ్చి తీసుక వెళ్తూవుండు"

జయతల్లి ఎన్నో ఆశీర్వాదాలు, ఎన్నో తీయని మాటలు సురేంద్రుని కర్పించి దాస దాసీ లున్నచోటికి వెళ్లింది. ఆమె దుఃఖానికి కొందరు విచారించారు. మరి కొందరు ఏడ్చారు. చాలా సేపటివరకూ ఆమె సురేంద్రుని దయను ప్రకటించింది. మాటల సందర్భంలో తన కూతురు స్థానంలోకి ఇంకొకతెను తీసుకవచ్చి తోటలోని మహలులో ప్రేమపూర్వకంగా బాబుగా రుంచారని తెలుసుకునేప్పటికి ఆమె ఆకృతి మారిపోయింది. కళ్ళల్లోంచి నిప్పులు రాలినయ్! జ్ఞానం లేనిదానిలా ఆమె ఏమేమో కొత్తగా వచ్చి నామెను తిట్టుతూ, యేడుపులూ, పెడబొబ్బలతో తల వెంట్రుకలు లాక్కోవడం మొదలు పెట్టింది. ఇదంతా చూస్తే బాబుగారు డబ్బుకూడా యివ్వరని దాసీలు నయాన్న, భయాన్న చెప్పినా వినకుండా ఏమేమో అంటుంటే వాళ్ళంతా యెలానో ఆమెనుంచి తప్పించుకుని వెళ్లిపోయారు.

జయ తల్లి తోటలోని యింటివేపు నడిచింది. తన కూతురుని బలవంతంగా చంపి యీామె ఆస్థానాన్ని ఆక్రమించిందనే కోపంతో గర్జిస్తూ మహలులోనికి వెళ్లి అక్కడున్న దాసీ దాన్ని కోపంతో చూస్తూ "ఆదయ్యే మెక్కడ?" అని అడిగింది.

కొత్తగా వచ్చిందేమో పాపం ఆ దాసీది భయంతో రెండడుగులు వెనక్కువేసి "ఆమె ...అక్కడ" అని అంది.

ఆమె వేసిన ప్రశ్నకు సరయిన జవాబును పొందికూడా తెలుసుకోలేకపోయి మళ్ళీ దాసీని అలానే చూస్తూ "యెక్కడ!" అని అడిగింది.

యేమీ తెలుసుకోకుండానే వ్రేలితో ఒకవేపు చూపి దాసీది వెళ్ళిపోయింది. జయ తల్లి తిన్నగా పైకి వెళ్ళింది. ఒక్కొక్క గదిలోకే తిరుగుతూంది. కాని, ఎవరూ కనుపించలేదు. ఆ అలంకారం అదీ చూస్తే ఆమెకు యీర్ష్యపుట్టింది, యివన్నీ జయవతివేనా? కాదని యెవరంటారు? మనసులో తర్కవితర్కాలు చేసుకుంటూంటే ఓ గదిలో ఓ అమ్మాయి కనుపించింది. వెనుకనుంచి చూసి అది ఒక దాసీది అనుకుని "యేమే! మీ యజమానురా లెక్కడుంది?" అని అడిగింది. అసాధారణమైన ఆ కర్కశ స్వరాన్ని విని ఆమె వెనక్కు తిరిగి చూసింది.

ఆమె కట్టుకున్న గుడ్డలు మామూలుగా వుండడం మూలాన్ని జయ తల్లి ఆమె ముఖాన్ని చూసిందే తడవుగా కొంచెం మెత్తబడి "నీ వెవరవు?" అని అడిగింది.

"నే నిక్కడే వుంటున్నాను. తమరు కొంచెంసేపు కూర్చోండి"

"యెంత కాలంనుంచి నువ్విక్కడుంటున్నావు?"

"ఒక నెల రోజుల్నుంచి"

"మరి నీ యజమానురా లెక్కడుంది? ఆమె వెంబడే వచ్చావనుకుంటాను"

"మీకు ఆమెతో పనుందా ఏమిటి?"

"ఏమందా అని మెల్లిగా అడుగుతావేం? ఆ దయ్యపుముండ గుండె నమిలి తింటాను, నే నెవరో తెలుసా? జయవతికి తల్లిని. నన్నిక్కడ వున్న వాళ్ళంతా ఎరుగుదురు. ఆ ముండ నా కూతుర్ని చంపింది. ఇవాళ దాన్ని తినేస్తాను. తినేస్తాను. తినేస్తాను" పళ్ళు కొరుకుతూ తినేస్తాను. తినిగాని ఇక్కడనుంచి కదలను. ఏదీ, ఆ ముండ! దాని పనిపట్టి తీరుతాను అప్పుడు గాని నా కోపం చల్లారదు"

ఆమె నిట్టూర్పును ఆపుకుని జయ తల్లి భంగిమను చూస్తూ వుంది.

"దాన్ని నేను తినేస్తాను. ఆ దయ్యాన్ని బ్రతకనీయను, దానితల పగులకొట్టి యెముకలు యేరుతాను" అని నేలమీద తల కొట్టుకుంటూ "దాని గుండె చీల్చి రక్తాన్ని దుర్గాదేవి పాదాలకు రాస్తాను. దయ్యమేదీ? ఏం? ఎక్కడుంది ఆ దయ్యం?"

ఎవరికోసం ఇంత రద్ధాంతం జరుగుతుందో, ఎవర్ని చూపించమని ఇంత గందరగోళమవుతోందో వారు తనముందే వున్నారని జయవతి తల్లికి తెలియదు. ఒకవేళ తెలుసుంటే ఇంకో విధంగా జరిగి వుండేదేమో.

మాలతి దగ్గరకు వచ్చి ఆమెచేయి పట్టుకుని మెల్లగా "మీరు వూరుకోండమ్మా" అని అంది.

"నే నూరుకోనా? చెప్పడానికి నీ వెవరవే? నా కూతుర్ని చంపితే నే నూరుకుంటానా?"

"ఆమెగారు ఇక్కడలేదు"

"లేదూ?"

"లేదు"

"దాన్ని చూడకుండా ఇక ఒక్క అడుగయినా, బైటకు వెళ్ళను. దాన్ని చంపి నాశనంచేసి, వెళ్తాను."

మాలతి మెల్లగా నవ్వి "అవును ఎందుకని వెళ్ళాలి? ఇక్కడ కొంచెంసేపు హాయిగా వుండండి పాపం. చాలా ఆలస్యమైంది. అన్నపానాదు లేమీ కాలేదనుకుంటాను" అని అంది.

"అన్నపానాలా? అన్నీ ఒక్కసారే చేస్తాను"

"నాకు తెలుసునమ్మా! కూతురుకోసం తల్లి హృదయం ఎంతగా బాధపడుతుందో నాకు తెలుసు. పాపం మీకు...."

జయతల్లి కొంచెం మెత్తపడి, మధ్యలోనే "నీవే ఆలోచించమ్మా? ఏమంటావు?" అని అడిగింది,

"అవును నాకు తెలుసు! మనం ఏం చేయగలం? ఇంతకూ బ్రతికిం తర్వాత నోట్లో నాలుగు మెతుకులు వేసుకోవడం తప్పదు. ఈ విచారంతో మనం ఊరుకుంటే పొట్టమాత్రం ఊరుకుంటుందా?"

"నిజమే!"

"అందుకనే, యేమయినా తింటారా అని అడుగుతూంట"

"అవును. నువ్వన్నమాట నిజం. సరేలే అమ్మా"

"జయ అక్కాయ్, మీ విషయం నాతో ఎంతో ఇదిగా చెప్పేది"

"చెప్పేదా? నిజంగా? అయితే నువ్వామెను చూసావా?"

''ఎన్నో రోజులు ఆమె వెంట వున్నాను''

''ఆమె వెంబడే వున్నావా ?''

''ఊఁ! ఆమెదగ్గరే వున్నాను. మా వూరినుంచి ఆమె నన్ను లాక్కొచ్చింది. ఎన్నోమాటలు చెప్పేది. అన్నింటికన్నా మీ విషయమే మరీమరి ఎక్కువ యిదిగా చెప్పేది.

''మరి మా అమ్మాయిని యేమనుకున్నావు?''

''అవును. ఆమె చాలా మంచిది. నాకు తెలియదా ?''

''అలాంటి కూతురు చచ్చిపోయింది.... యేంచెయ్యనమ్మా ? ఇంతకూ ఆ దయ్యం ఎక్కణ్ణుంచి వచ్చింది ?''

''కలకత్తా దగ్గర్నుంచి''

''అయితే బాబుగారికి ఆ ముండేమన్నా మందూ మాకూ పెట్టిందా యేం ?''

''పెట్టిందనే విన్నాను''

''పెట్టిందీ ? అయితే ఆ మందూ మాకూ ఇవాళే వదిలిస్తాను''

''అలానే చేయాలి''

''వదిలించే వెళ్తాను. ఇంతకూ మంత్రాలూ తంత్రాలూ నేర్చు కుందా యేమిటి ?''

''మంత్రాలు తంత్రాలేమిటమ్మా ? సరే! మనుషుల్నే మూర్ఖులుగాచేసి అలా ఓ పక్క నుంచుతుంది. లేవమంటే లేచి, కూచోమంటే కూచునేట్లు చేస్తుందికూడా''

''ఆ మంత్రాలూ తంత్రాలూ నాకూ తెలుసు''

''ఎందుకు తెలవ్వు ? మధ్యాహ్నం వచ్చినప్పుడు ఆమెను మీకు చూపిస్తాను''

"బాణాలు వదలటంకూడా తెలుసా ?"

"ఒక్క బాణమేనా ? చుస్తారుగా ?"

"అయితే యెప్పుడు వస్తుందేం ?

"మధ్యాహ్నం"

జయ తల్లి కిటికీలోంచి బైటకు చూసింది. మధ్యాహ్నం కావడానికి అట్టే ఆలస్యంలేదు. "అయినా ఇప్పుడు కాదులే. ఇప్పుడు నాకు చాలా పనులున్నాయ్! రేపొస్తాను." అని జయ తల్లి లేచి నిలుచుంది.

"కాదు కాదు. ఇక్కడే అన్నం తిని వెళ్ళండి"

"ఆలస్య మవుతుందేమో ?"

"ఆలస్యమేమీ కాదు".

"అలా అయితే తొందరగా కానీయ్! మరి నీ పేరేమిటమ్మా ?

"నా పేరు మాలతి"

"చాలా మంచిపేరే"

జయ తల్లి నాలుగుమెతుకులు కొరికి లేచి "అయితే యిక వెళ్తానమ్మా !" అని అంది.

"మీతో ఇంతవరకూ ఒకమాట చెప్పటం మరిచిపోయాను. అక్కయ్య దగ్గర నేను పదిరూపాయలు అప్పుగా పుచ్చుకున్నాను. అయితే ఆమె ఇప్పుడు లేదు. అబరువు కొంచెం తీర్చుకుంటే చాలా బావుంటుంది ?"

"ఏవిధంగా తీర్చుకుంటావు ?"

"ఆ పదిరూపాయలు మీరు తీసుకుంటే చాలు"

"నాకు నువ్విస్తావా ?"

"ఆ! ఎందుకివ్వను" అని పదిరూపాయలు తెచ్చి ఆమె చేతిలోపెట్టింది. చాలాసేపు మాలతి ముఖంలోకి చూచి ఆఖరికి జయతల్లి "అమ్మాయ్! నువ్వు యేదో పెద్దింటి పిల్లవుగా కనుపిస్తున్నావు" అని అంటుంటే ఆమె కళ్ళల్లో నీళ్ళు క్రమ్మి "యేదేమయినా నాకు నిజంగా నువ్వు పెద్దింటి పిల్లవుగా కనుపిస్తున్నావు. నా జయ చేతుల్లో ఎంతడబ్బుండేది, యేం లాభం? తల్లినైన నాకు యెప్పుడూ ఎర్రని యేగానైనా ఇచ్చెరుగదు" అని కళ్ళు తుడుచుకుంది.

"మేము దరిద్రులమైనా ఒకరి రుణానవుండము. తినడానికి లేకపోయినా ధర్మం చేస్తాము"

"అందరూ అలా చేస్తారా అమ్మా ?"

"మనకెందుకు ఒకరి సంగతి? పోనీయండి. మీరు రేపొస్తారా?"

"ఆ ! ఐనా, అవును. యెందుకు రాను ?"

"యజమానురాలికి మీ విషయం ఆమె రాగానే చెపుతాను."

"ఆ! వద్దు వద్దు. ఇక చెప్పనవసరంలేదు."

ఆమె యెందుకలా అన్నదో మాలతి తెలుసుకుంది.

జయ తల్లి "ఇక వెళతాను. అప్పుడపుడు నీదగ్గరకు వస్తుంటానమ్మా" అని అంది.

"అలానే వస్తూవుండు" అని మాలతి చెప్పింది.

# 26

అంతా విన్నాక సురేంద్రుడు కడుపు చెక్కలయ్యేట్లు నవ్వుతూ "అయితే ఇంతకూ నీతో బాగా పోట్లాడిందన్నమాట ?'' అని అడిగాడు.

''పోట్లాటెందుకు ? ఇద్దరమూ బాగా కలిసే మాట్లాడు కున్నాము.''

"సరే, స్నేహం చేసుకుందన్నమాట ?''

''ఊఁ !''

"నీతోనేకాదు. ఆమె తన కూతురుతోకూడా యెప్పుడూ పోట్లాడుతూనే వుండేది.''

''ఆ సంగతికూడా విన్నాను,''

''ఏమని ?''

''ఆమె మనసులోని కష్టం అంతా కాకపోయినా కొద్దిగా నన్నా విన్నాను.''

మనసులోని కష్టమేమిటో మాలతి విప్పి చెప్పలేదు.

"రావడంతోనే, నిన్ను తిట్టిందనుకుంటాను."

''నన్ను కాదు....యే దయ్యాన్ని మీరు కలకత్తానుంచి తీసుక వచ్చారో దాన్ని ! నన్ను మాత్రం కాదు,''

''ఆ దయ్యానివి నీవేగా ?

''నే నెందుకవుతాను ! నేను కలకత్తానుంచి రాలేదుగా ?"

''సరే దానిలో యేముంది ? అది నీవే''

''ఆమె నన్ను గుర్తుపట్టలేరు. నన్నొక దాసీ అనుకుంది,"

కొంచెం విచారపడి, సురేంద్రుడు "ఇతర్లు ఇంకా యేమను కుంటున్నారో?" అని అన్నాడు.

"అందుకే నేనివాళ రక్షింపబడింది. లేకపోతే పచ్చడయ్యే దాన్ని"

"చంపేదా?"

"చంపితే చంపొచ్చు"

"ఇంకా యేమని చెప్పావు?"

"ఆ దయ్యం ఇక్కడలేదని అన్నాను. విని, అది రాగానే తినిగాని పోనని అంది."

సురేంద్రుడు నవ్వాడు.

'మీ కేమయినా మందూ మాకు పెట్టిందా? అని నన్ను అడిగింది. నేను "ఆమెగారు మందే పెట్టుంటారు" అని చెప్పాను."

"నిజంగా నేను అలానే అయిపోయా ననుకుంటాను?"

"అవును. అలానే అయిపోయారు?"

"ఆ సంగతి తర్వాత చెప్తాను. తరువాత?"

"తర్వాత మంత్ర తంత్రాలు ఆమెకు తెలుసా? అని అడిగితే, ఆమెకు తెలుసునని చెప్పాను."

గట్టిగా నవ్వుతూ సురేంద్రుడు "అయితే పారిపోయిందను కుంటారు. అంతేనా, ఏం?" అని అడిగాడు.

"ఊ! అంతే. వెంటనే వెళ్ళిపోయింది."

"సరే; ఇక ఇక్కడికి రాదనుకుంటాను."

"ఎందుకు రాదు? ఇంతకూ ఆ దయ్యం దగ్గరకు రాదుగాని, నా దగ్గరకు మాత్రం వస్తుంది."

"యెవరిదగ్గరకు వచ్చినా, నీవు మాత్రం ఇలారా."

మాలతి దగ్గరకు రాగానే ఆమె చేతులు పట్టుకుని "మాలతీ! ఎన్ని రోజులని యిలా గడుపుదాం. నీ చేష్టలు నాకేం నచ్చ లేదు."

"సొమ్ములు పెట్టుకుంటే, అందం యెక్కువవుతుందా?"

"అందానికని కాదు. అందం నీకేం తక్కువలేదు. పుట్టుకతో అందం లేనివాళ్ళకు, అందాన్ని మనం కలిగించలేం అయినా నా ఆనందానికి...."

"సొమ్ములు పెట్టుకోవాలి?"

"అవును."

"పెట్టుకోవడానికి నా కేమీ అభ్యంతరం లేదుగాని, యింతకూ పెట్టుకోమని యెందు కంత యిదిగా బలవంతం చేస్తారో చెప్పండి?"

"చెపితే నువ్వు విచారించవు కదా?"

"ఎందుకు విచారిస్తాను."

"అయితే విను! అలంకార శూన్యమయిన నీమూర్తిలో ఓ పెద్ద జ్యోతి వుంది! ముట్టుకోడానికి కూడా నాకు అప్పు డపుడు భయమవుతూ వుంది. నిన్ను చూస్తున్నకొద్దీ, నీతేజస్సు నిర్మలంగా ప్రకాశిస్తున్నకొద్దీ నా పాపాలన్నీ నీలానే స్వచ్ఛం దతా పూర్వకంగా వెలుగుతాయని అనుకుంటాను. ఆఖరికి నీదగ్గర నిలుచునే ధైర్యం కూడా నాలో లేదు. అందుకని నీ అందాన్ని నగలతో కొంత కప్పిపుచ్చితే మంచి దని అను కుంటాను."

ఎదురుగావున్న పెద్ద అద్దములో మాలతి తన ప్రతిబింబాన్ని చూసుకున్నప్పుడు, సురేంద్రుడు చెప్పినమాటల్లో అసత్య మేమీ కనుపించలేదు. "రూపు రేఖాదులు గల అందగత్తెనేననీ, యింకా తన శరీరంలో మెరుపులాంటి జ్యోతి వుందనీ, పూర్వం చేసిన పుణ్యాల బాపతు ఫలం యింకా తనలో ప్రతిఫలిస్తూ వుందనీ, యిప్పటివరకూ తనవంటిని పవిత్ర మనేది కొద్దిగానైనా అంటి పెట్టుకుని వదలకుండా వుందనీ" ఆమె అనుకుంది.

రాత్రి నిశ్శబ్దమైన గదిలో మాలతికి భ్రమకలిగింది ఆభ్రమలో యెదురుగుండా వున్న పెద్ద అద్దములో ఒక మూర్తీ, ఆ మూర్తి ప్రక్కనే తన ఆరాధ్య దేవుడైన సురేంద్ర నాథుడు ఆమెకు కనుపించారు. విస్మయానందాలతో ఆమె కళ్ళు మూసుకుంది.

మరునాడు సాయంకాలంపూట సురేంద్రుడు మెళ్ళో పూల దండలతోనూ, చంకీ దండలతోనూ, గులాబి పువ్వులతోనూ, మెడనిండా, అలంకరించుకుని ఒక చేత్తో పూలగుత్తి పట్టుకుని, మాలతి గదిలోకి వచ్చాడు. ఇదంతా చూసి నవ్వుతూ "ఈ వేష మేమిటి?" అని మాలతి అడిగింది.

"ఏమిటో నువ్వే చెప్పు చూద్దాం?"

"నాకేం తెలుసు?"

"మరి, నువ్వు ప్రతిరోజూ పూజ చేస్తుంటావుకదూ?"

"ఊఁ చేస్తుంటాను."

"అయితే కుంకుమ నీదగ్గర తప్పకుండా వున్నదనుకుంటాను. దాంతో నన్నభిషిక్తుణ్ణి చేయ్! నీదగ్గర దాచటం దేనికి, యివాల్టికి నా కళ్యాణం పడదోసుకు వచ్చింది."

''ఎవరితో ?''

''ముందు కుంకుమతో నా నొసట తిలకాన్ని అమర్చు తరువాత విందువుగాని.''

మాలతి తిలకం దిద్ది, ''ఇప్పుడు చెప్పండి?'' అని అతని కళ్ళల్లోకి ఆశగా చూసింది.

"అయితే యింతవరకూ తెలుసుకో లేవన్నమాట,'' అని అతను తన మెడలోని దండలు ఒక టొకటి తీసి మాలతి మెడలోవేసి, యెడమచేతిలో వున్న చిన్నడబ్బాలోంచి అనేక తరహాలైన రత్నాల ఆభరణాలను ఆమె మెడలో వేసాడు! మాలతి తన జీవితంలో అటువంటి నగల నెప్పుడూ చూసివుండ లేదు. విస్మయంతో అతణ్ణి చూస్తునే వుండిపోయింది!

అన్ని వస్తువులూ అలంకరించి, ఆమెను ముద్దుపెట్టుకుని ''నీతోయిప్పటికిపెండ్లయిపోయింది. ఇన్నిరోజులకి నీవు నాభార్య వయ్యావు. ఇక నీవు నన్నొదిలి యెక్కడికీ పోలేవు. నీమెడలో యీ చేతుల్తో వేసినదండల్ని జన్మ జన్మాంతరాల వరకూ నీవు తీయలేవు'' అని అన్నాడు.

ఇద్దరికళ్ళూ నీళ్ళతో నిండినై! కొంచెం సేపటివరకూ యెవరి నోటివెంటా మాటలేదు. తర్వాత సురేంద్రనాథుడు కళ్ళు తుడుచుకుని, ''ఇక యింటికి పద. నీ గృహస్థ ధర్మాన్ని నెరవేర్చు. జీవితమంతా సుఖంగా గడుపుతావని ఆశీర్వదిస్తున్నాను'' అని అన్నాడు.

మాలతి ప్రమాణంచేసి, మళ్ళీ అతని వద్దనే కూచుంది. కన్నీళ్ళు యీ నాడుకూడా ఆమెకు యెక్కువగనే వస్తున్నై!

యెన్నో పర్యాయాలు తుడుచుకున్నా, మళ్ళీ ఆకళ్ళు ఆలానే నిండేవి. సురేంద్రనాథుడు అంతా గ్రహించుకొని, "మాలతీ! నీ తలిదండ్రులు జ్ఞాపకం వచ్చారా?" అని అడిగాడు.

మాలతి తలూపుతూ, "అవును" అంది.

"నేను చేయదలచుకున్న పని నీవే చేయనీయడం లేదు. యిలా వుండామని అసలు నే నెప్పటికీ అనుకోలేదు. నీవు దొరికి నప్పుడే యీ హృదయానికి భాగస్వామి లభించినదను కున్నాను. మళ్ళీ ఒక పర్యాయం గృహస్థుణ్నై, నీతలి దండ్రుల్ని యిక్కడకు తీసుకవచ్చి. ఎవరేమనుకున్నా సరే నేను సుఖంగా వుందామని ఆశించాను" అని ఒక నిట్టూర్పు విడిచి, "ఆ ఆశ నిరాశగా మారిపోయింది" అని, "యిక యింటికి వెళ్దామా?" అని ఆమెవంక చూసాడు.

"యెక్కడికి?"

"ఎక్కడైతే నేనుంటానో అక్కడికి"

"అది నా ఇల్లుకాదు"

"అయితే, అక్కడకు రావా?"

"రాను"

"నీవు రావని నాకు తెలుసు"

# 27

కష్టపుదినాలు చాలా మెల్లగా నడిచేమాట నిజమే! ఎలా అయినా అవి మెల్లగానే నడిచిపోతాయికాని, అలానే వుండవు.

మాధవుడు చచ్చిపోయాక సుభదకు రోజులు అలానే గడుస్తు న్నయ్! ఆ రోజుల్లో వర్షం ఎక్కువగా ఉంది. ఆకాశంమీద మేఘాలు విడిపోలేదు. దారులూ, తీరాలూ అన్నీ బురదతో నిండిపోయినయ్.

ఒకే విధంగా నడుస్తుందనుకునే వాళ్ళ జీవితాలు, ఎప్పుడూ, ఒక విధంగా నడవ్వు. ప్రకృతికికూడా యీ విషయం తెలుసు! ప్రపంచంలో పరివర్తన మనేది, జరక్కుండా వుండదని అందరికీ తెలుసు. ఒక సుభదకు మాత్రం తెలియదు. ఉదాశీనంగా రేవుకు వెళ్ళి, స్నానంచేసి నీళ్ళుతెచ్చి వంటవండి, అందరికి పెట్టేదికాని, ఆమె ముఖంమీద వుదాసీనపు ఛాయలు మాత్రం అలుముకునే వుండేవి.

ఆమెను చూసిన ముసలివాళ్ళు ''ఇక లాభంలేదు'' అని ''ఇటువంటి భాగ్యము మన శత్రువుక్కూడా భగవంతుడు ఇవ్వకూడదు'' అని అనేవాళ్ళు.

సుభద నవ్వు మాయమైంది. యేడుపుకూడా మాయమైంది. పైగా ఇప్పుడు ఇల్లంతా శూన్యమైంది. చలన మామగారింటికి వెళ్ళింది. రాసమణి పగలంతా ఇంట్లో వుండదు, ఇక హారాన్ చిన్నపిల్లవాడిలా ప్రతిరోజూ రెండు పూటలా ఇంట్లో మూడణాలో నాలుగణాలో తీసుకుని వెళ్ళేవాడు. సుభద మధ్యాహ్నమంతా యెండ అనీ, ఆ వంటింట్లో పమిట పరుచుకునేది. సాయంకాలంలేచి వంటచేసి సదానందునికిపెట్టి, హారాన్‌కోసం కంచంలో అన్నం పెట్టుకుని అతని కోసం యెదురుచూసేది! మళ్ళీ వుదయమయేది. సాయంకాలమయేది. రాత్రయేది. రోజూ

లానే సుభద యీనాడు కూడా మధ్యాహ్నం వంటింట్లో పడు కుంది.

"అమ్మగారికా? బైటనుంచి యెవరిదో పురుష కంఠధ్వని వినిపించింది.

సుభద, వినికూడా తనను కాదని వూరుకుంది,

"యేమండోయ్ అమ్మగారూ?"

సుభద బైటకువచ్చి "యెవర్ని నాయనా?" అని అడిగింది.

"నేను పోష్టు బంట్రోతును! వుత్తరం...."

ఆశ్చర్యంతో వుత్తరం యెవరు వ్రాస్తా రబ్బా అని అనుకుని దగ్గరకు వెళ్ళి "యివ్వు" అని అడిగింది.

"అలాగ యిచ్చే వుత్తరం కాదమ్మా? యిది రిజిష్టరుత్తరం సుభదాదేవి అనివుంది, ఆమె సంతకం కావాలి"

"రిజిష్టరనే పేరు సుభద యెప్పుడూ వినలేదు. అందువల్ల "నా పేరే సుభద, అది యిటివ్వు" అని అడిగింది,

బంట్రోతు వుత్తరంతోపాటు కాగితం తీసి "సంతకం చేయండి" అని అడిగాడు.

"సిరాబుడ్డి. కలం యివ్వు"

"నేనెక్కడ తేనమ్మా? మీయింట్లో లేదూ?"

"అయితే చూస్తాను." అని పైనా క్రిందాచూచి, పగిలిన ఓ సిరాబుడ్డీ విరిగిపోయిన కలమూ తీసుకుని సంతకం చేసి, ఉత్తరం తీసుకుంది.

గదిలోకివెళ్ళి కవరువిప్పి చూస్తే, అందులో ఓయాభై రూపా యల కాగితం వుంది. ఏదో పొరపాటున తప్పు జరిగిందనీ తిరిగి

యిచ్చేద్దామనీ ఆమె బైటకు వచ్చేప్పటికి, బంట్రోతు చాలా దూరం వెళ్ళిపోయాడు. పిలవడం బావుండదని, కొంచెం సేప యితే తప్పు తెలుసుకుని వాడేవచ్చి తీసుకవెళ్తాడనీ, అనుకుని. ఆమెగదిలోకి వచ్చి కూచుంది. కానీ బంట్రోతు ఆ రోజు, మరు సటి రోజుకూడా రాలేదు. సుభద యీ సంగతంతా తరువాత సదానందునికి చెప్పింది. సదానందుడు ఆలోచించి "తప్పుకా దమ్మా! యీ పల్లెటూళ్లో యెవరికీ నీ పేరులేదు. అదీకాక హారాన్ ముఖోపాధ్యాయుల యింట్లో అని కూడా రాసివుంది. ఇది నిశ్చ యంగా నీకే! సరేగాని, కలకత్తాలో నీకెవరన్నా బంధువు లున్నారా?" అని అడిగాడు.

"కలకత్తాలో నాకెవరూ లేరు నాయినా?"

రెండోనాడు సదానందుడు పోష్టాఫీసుకు వెళ్ళి విచారించివచ్చి "అఘోర నాథవసు అనే వకీలు కలకత్తానుంచి యీ డబ్బు పంపాడు," అని చెప్పాడు.

"ఆపేరు నాకు అసలు తెలియదే?" అని ఆమె ఆశ్చర్య పడింది.

"అయితే, యిప్పుడేం చేయాలి?"

"ఏదైనా వుపాయం నీవే ఆలోచించు నాయనా!" ఆమె ప్రాధేయపూర్వకంగా అతనివేపు చూసింది.

"ఉపాయం యేమాలోచించను. తీసుకోవడానికి యిష్టం లేక పోతే తిరిగి వారికి పంపించండి" అని అన్నాడు.

"నాయనా! పిల్లా జెల్లా అన్నంలేక పస్తులతో మాడినాసరే ఈడబ్బును మాత్రం ముట్టుకోను. యిప్పుడు నాకేం ఆపద వచ్చిం

దని. ఈడబ్బు నాదికాదు. నీవే తిరిగి పంపించు నాయనా!''
అని అంది.

కలకత్తా వెళ్ళి నేను విచారించి వస్తాను. అంతవరకూ యీ డబ్బు నీ దగ్గరేవుంచు. ఇచ్చేయడానికి వీలుంటే యిచ్చేద్దాము'' అని అతను బాగా ఆలోచించి అన్నాడు.

''డబ్బును నీవెంబడి తీసుకవెళ్ళు. వీలూ గీలూ లేదు. ఇంకొకరికి పంపే వుద్దేశంతో పొరపాటున నాకు పంపుంటారు.'' అని ఆమె అంది.

''ఏమయినా సరే! అక్కడకు వెళ్లి నిర్ణయించుకుంటాను.''

''సరే, నీయిష్టం''

# 28

విశాలమైన ఆఫీసులో అఘోరనాధవసు కూచుని వున్నాడు. ఓప్రక్క మెత్తని కుషన్ కుర్చీలో నారాయణపురపు జమీందారు సురేంద్రనాథుడు కూచున్నాడు. వసు గారికి ముందున్న పెద్ద టేబిల్‌మీద ఏవో దావాలకు సంబంధించిన కట్టలు గుట్టలుగా పడివున్నాయ్! వానిని గురించి యిద్దరూ చర్చించుకుంటున్నారు.

కొంచెం నేపయాక సురేంద్రుడు తలెత్తి ''అఘోరనాధ బాబూ! ఈ దావాలో నేను గెలవలేనేమో?'' అని అడిగాడు.

''తొందరపడి, ఇప్పుడేమీ చెప్పలేము''

''ఇందులో ఓడిపోవడం తథ్యమని నాకు బాగా తోస్తోంది''

''ఇంతమాత్రానికే అధైర్యపడితే యెలా? హైకోర్టు ఇంకా వుందిగా?''

"వున్నా అంతదూరం వెళ్ళడానికి నాకిష్టంలేదు."

"అయితే మాల్‌పూర్ సంపదంతా వదిలి పెడతారా ?"

"మరి వుపాయం ఏముంది ?"

"అయితే. పెద్ద రాబడి పోతుందే ?"

"షుమారు సగం తగ్గుతుంది"

సురేంద్రునికి రాబడంతా మాల్‌పూర్‌తోనే వుందని అఘోర బాబుకు తెలుసు! ఆ సమయాన్నే నౌకరువచ్చి "ఎవరో ఒకతను మిమ్మల్ని కలుసుకోవాలంటున్నారండీ!" అని చెప్పాడు.

అతనివేపు చూసి అఘోరబాబు "యెవరేం ?" అని అడిగాడు.

"ఎవరో తెలియదండి, బ్రాహ్మణ పండితునిలా వున్నాడు."

"నాకు టైం లేదని చెప్పు ?"

కొంచెంసేపు వున్నాక మళ్ళీ తిరిగివచ్చి "చాలా తొందర పనుందట. ఇప్పుడే మిమ్మల్ని కలుసుకోవాలని అంటున్నాడు" అని నౌకరు చెప్పాడు.

ఏమీ తోచక అఘోరబాబు సురేంద్రబాబువేపు చూసి "ఈ గదిలోకి పిలవనా యేమిటి ?" అని అడిగాడు.

"తప్పేముంది, పిలిపించండి."

అలానే పిలవమని నౌకరుకు చెప్పాడు.

కొంచెం సేపట్లోనే ఓ నూతన వ్యక్తి గదిలోకి రావడంతోనే, అఘోరబాబు "కూర్చోండి" అని అన్నాడు.

దగ్గరున్న కుర్చీలో ఆ నూతన వ్యక్తి కూచుంటూ "నేను అఘోరబాబుగారి కోసం...." అని ఆపాడు,

"నా పేరే అఘోరనాథబాబు."

"అయితే మీతోనే నాకు పనుంది. చెప్పదలచుకుందేదో యిక్కడే చెప్పనా?" అని అతను అఘోరబాబు ముఖంవేపు చూసాడు.

"ఏమీ ఫర్వాలేదు చెప్పండి."

బొడ్లోంచి ఓ కాగితాన్ని బైటకుతీసి "యీ రూపాయలు సుభదాదేవికి మీరేనా పంపింది?" అని అత నడిగాడు.

ఆ నోటును బాగాచూశాక "అవును! నేనే పంపాను" అని అన్నాడు.

"అయితే హాలాదుపూర్ హారాన్‌ముఖర్జీ భార్య సుభదాదేవి కేనా?" అని అతను తిరిగి అడిగాడు,

"అవును. ఆమెకే!"

"యెందుకు పంపారు?"

"నా యజమానిగారి అనుమతితో."

"ఆయనగారిపేరు?"

"ఆయనగారు తన పేరును వెల్లడిచేయవద్దని నాకు చెప్పారు"

"అయితే యీ డబ్బును తిరిగి తీసుకోండి! యెవరికోసం మీరు ఈ డబ్బును పంపారో ఆమెకు ఈ డబ్బు తీసుకోవడం యిష్టంలేదు ఆమె మీ యజమానిని కాని, మిమ్మల్ని కాని యెవరిని ఎరుగదు. ఇంతకూ అదేమిటో కనుక్కోమని నన్ను పంపింది. ఒకరికి పంపవలసిన డబ్బు పొరపాటున మీరు యింకొకరికి పంపారనుకున్నాము."

"ఆ పొరపాట్లు ప్లీడర్ల వద్ద జరగవు."

"జరగవనీ తెలుసు. అయినా యీ డబ్బును తిరిగి తీసుకోండి. ఆమెగారు యిచ్చివేసి రమ్మన్నారు."

"అలా నేను తీసుకోను. నా యజమాని అనుమతి లేనిదే నేనే పనీ చేయలేను."

"వారిని అడిగి కనుక్కోండి. తిరిగి నేను రేపు వస్తాను అని ఆయన లేద్దామనుకుంటుండగా సురేంద్రబాబు "తమ పేరు?" అని అడిగాడు.

"నా పేరు సదానంద చక్రవర్తి."

సురేంద్రుడు త్రుళ్ళిపడి కొంచెంసేపు ఆయనవేపు చూసి "అయితే మీరీవూళ్ళో ఎక్కడ దిగారు?" అని అడిగాడు.

"ఫలానాచోట వుందామనికూడా నేనింకా ఆలోచించుకో లేదు. పని అయిపోయింతర్వాత ఇవ్వాళే వెళ్దామని అనుకున్నాను."

సురేంద్రుడు అఘోరబాబుతో 'రాత్రికి వస్తానండీ?" అని తరువాత సదానందుని చూసి "మీతో కొంచెంసేపు మాట్లాడాలి?" అని అన్నాడు.

"చెప్పండి."

"ఇక్కడకాదు మా యిల్లు యిక్కడికి దగ్గర్లోనే వుంది. మీకేమీ యిబ్బందిలేకపోతే అక్కడికివెళ్ళి మాట్లాడుకుందాం."

సదానందు దేమీ అడ్డు చెప్పలేదు. ఇద్దరూ బండిలో కూచున్నాక సదానందుడు "మిమ్మల్ని నే నెప్పుడూ చూడలేదు. నన్నెక్కడయినా మీరు చూశారనికూడా గుర్తులేదు" అని అన్నాడు.

"మీరు నన్నెక్కడా చూడలేదు. అయినా మీ రెవరో నాకు తెలుసు."

"ఏవిధంగా తెలుసు ?"

"ఇంటికి పదండి అన్ని విషయాలూ మాట్లాడుకుందాం" కొంచెం సేపయాక బండి యింటిదగ్గరకు వచ్చింది. సురేంద్రుడు "నేనూ బ్రాహ్మణుడనే! మనకు చాలా ఆలశ్యమైంది. ఈ పూటకు మీరు యిక్కడే భోజనం చేయాలి" అని అన్నాడు.

తలూపుతూ సదానందుడు "సరే" నని అన్నాడు.

భోజనాదులు అయాక యిద్దరూ తీరుబడిగా కూచున్నప్పుడు సురేంద్రుడు "సుభద్రాదేవి బీదదికదా ?" అని అడిగాడు.

"బీదతనంలో వుండొచ్చు. అయినా ఆమె బీదతనంతో మీ కేంపని ?"

"ఎవరయినా ధర్మ మిస్తే పుచ్చుకోదా ?"

"పుచ్చుకోవచ్చుగాని యెవరో తెలియనివాళ్ళు యిచ్చినదాన్ని పుచ్చుకోవడం...."

"దానిలో తప్పేముంది ? ఇందులో తప్పులేదని ధర్మంచేసే వాళ్ళే చెపుతున్నారు. ధర్మం చేయాలని వున్నవాళ్ళు చేయొచ్చు"

"ఇంతకూ దానం యెవరుచేశారు ?"

"అఘోరబాబే ననుకోండి"

"అతని కధికార మేముంది ?"

"దానధర్మాలు చేయడానికి అందరికీ అధికారం వుంది."

"చేస్తే చెయ్యొచ్చుగాని తీసుకునేవాళ్ళకు యిష్టముండొద్దూ ?"

"ఎందుకని తీసుకోరు ? జరగనప్పుడు"

సదానందుడు కోపంతో ''ఈ విధమైన ధర్మభిక్ష తీసుకోక పోయినా సుభదకు గడుస్తుంది'' అని అన్నాడు.

''ప్రస్తుతం గడిస్తే గడవచ్చుగాని, కొద్దిరోజుల క్రితం గడిచిందా ?''

''మీ కిదంతా యెలా తెలుసు ?''

''చాలాసంగతులు నాకు తెలుసు. హారాన్ బాబు పనీపాటా చేయడు సరిగదా అతనికి యెన్నో దుర్వ్యసనా లున్నాయ్! పిల్లా జెల్లని పోషణ చేయలేనివాళ్ళకు యితరుల సాయం లేకుండా, అర్థించకుండా గడుస్తుందా ?''

సదానందుడు కష్టంలోపడి యేమీ మాట్లాడలేదు.

''ఇంతకూ హారాన్ బాబు యేంచేస్తున్నాడు ?''

''ఏమీలేదు.''

''తెలిసింది. మీ సహాయంవల్ల వాళ్ళకు గడుస్తోంది కదూ ?''

''భగవంతుడు వాళ్ళకు సహాయం చేస్తున్నాడు. నే నొక దరిద్రుణ్ణి ?''

''అయితే చలనకు పెళ్ళయిందా ?''

''అయింది.''

''ఏవూళ్ళో, ఎవరితో ?''

''మావూళ్ళోనే, శారదాచరణ చక్రవర్తితో''

''మాధవుడికి, యిప్పు డెలావుంది ?''

''చాలా రోజులక్రిందనే చచ్చిపోయాడు.''

''మరి, సుభద పెద్దకూతురు ఎక్కడుంది ?''

''ఎక్క డేమిటి ? ఆమెకూడా లేదు.''

"లేదూ? ఎలా చచ్చిపోయింది?"

"గంగానదిలో పడి, ఆత్మహత్య చేసుకుంది."

"ఎలా తెలుసుకున్నారు. శవం దొరికిందా?"

"లేదు. ఆమె చీరె గంగానది వొడ్డున పడివుంది. దాన్నిబట్టి ఆమె చచ్చిపోయిం దనుకున్నారు."

"ఈ విషయంలో, యెవరికీ ఏమీ అనుమానం కలగలేదా?"

"లేదు."

"సరే బాగానే వుంది. ఒకవేళ ఆమె యీ రూపాయల్ని మీకు పంపివుంటే?"

"యెవరు, లలనా?

"లలనెవరు? ఆమెపేరు లలనా?"

"అవును."

"పొరపాటు పడ్డాను. లలనే. లలనా....చలనా, యిద్దరూ అప్పా చెల్లెళ్ళుకదూ?"

"అవును"

"అయితే, యీ డబ్బును ఆమె పంపినట్లయితే"

"చచ్చిపోయిన మనిషేనా?"

"అవును ఆమే! గంగానది వడ్డున చీర దొరికినంత మాత్రాన ఆమె చచ్చిపో దనుకుంటాను! ఒకవేళ తన తల్లిగారికి యీ డబ్బును పంపివున్నట్లయితే."

"యిప్పుడామె లేదు. మీరన్నట్లు ఒకవేళ వున్నట్లయితే ఎప్పుడో వుత్తరం వ్రాసేది?"

"వుత్తరం రాయడానికి ఒకవేళ సిగ్గుపడినట్లయితే?"

"లలన సంగతి నాకు తెలుసు! సిగ్గు కలిగే పనిని ఆమె యెప్పుడూ చేయదు. బ్రతికుండగా తనను తాను యెప్పటికీ దాచుకోదు! ఆమె స్వభావము పూర్తిగా నాకు తెలుసు!"

"ఆమె మీరనుకున్నట్లు చావలేదు. యింకా బ్రతికేవుంది. యేదారీ లేని తలిదండ్రులకి యీ డబ్బును ఆమె పంపించింది. యికనుంచి ఆమె యిలానే ప్రతినెలా పంపుతూ వుంటుంది కూడా!"

"అయితే ఆమె ఇంకా బ్రతికే వుందంటారా? నేను నమ్మను, ఇంతకూ, తమ పేరు?"

"సురేంద్రనాథరాయ్."

"ఏవూరు?"

"నారాయణపురం"

"హారాన్ సంగతి మీకెలా తెలుసు?"

"లలన చెప్పింది."

"లలన యెప్పుడూ చెప్పదు. ఆమె చచ్చిపోయింది."

"చావలేదు, హాయిగా బ్రతికే వుంది."

"అవును. మీ రన్నట్లు హాయిగా స్వర్గంలో వుంది."

"సదానందబాబుగారూ! అప్పుడే వెళ్తారేం? కొంచెం సేపు కూచోండి."

"నాకు పనుంది వెళ్తాను. మీ రన్నట్లు. ఆమె బ్రతికుండి, ఆమె ఎప్పుడయినా మిమ్మల్ని కలుసుకుంటే, తప్పకుండా నా ఆశీర్వచనా చెప్పండి."

"యీ సంగతి ఆమె తల్లితో చెపుతారుకదూ?"

"ఆ! స్వర్గంలో వుందని...." అని మెల్లమెల్లగా వెళ్ళి పోయాడు. తిరిగి రానూలేదు. వచ్చి కూచోనూలేదు.

అతను వెళ్ళాక సురేంద్రుడు చాలాసేపు కూచున్నాడు. కొద్ది రోజులకు పూర్వం యిటువంటి ఘటన జరిగి వున్నట్లయితే అతను నవ్వేవాడే కానీ, ఇప్పుడు కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్! నౌకరు వచ్చి "బాబూ! బండిని సిద్ధం చేయనా?" అని అడిగాడు.

"ఆ! సిద్ధం చేయ్!"

# 29

చాలారాత్రి గడిచింది, ఎంతో ప్రొద్దుపోయినా మాలతి యింకా మేలుకుని "సీతాదేవి వనవాసము" చదువుతూవుంది. చదువుతూ ఎన్నోసార్లు ఏడ్చింది. ఎన్నోసార్లు కన్నీళ్ళు తుడుచుకుంది.

అదే సమయాన బైటితలుపు దగ్గిర్నుంచి ఓ పెద్ద కంఠంతో "లలనా" అనే పిలుపు వినిపించింది.

మాలతి కంపించింది. చేతిలోని "సీతాదేవి వనవాసము" క్రింద పడిపోయింది.

"లలనా?"

క్షీణకంఠంతో "ఎవరూ?" అని మాలతి అంది. నవ్వుతూ సురేంద్రుడు లోపలకు వచ్చి "లలనా!" అని మళ్ళీ పిలిచాడు.

"మీరా?"

"అవును, నేనే! నువ్వు పట్టుబడిపోయావు. పేరు మార్చుకుని నన్నెందుకని మోసపుచ్చావు?" అని అతను అడిగాడు.

"ఎక్కడ?"

"మళ్ళీ అబద్ధమా?" ఆమె పెదవులమీద ముద్దు పెట్టుకుని, "అంతా విన్నాను లలనా! నువ్వు మాలతివికావని తేలిపోయింది." అని అన్నాడు.

"ఎక్కడ విన్నారు?"

"కలకత్తాలో."

"కలకత్తాలో నన్నెవ్వరూ యెరుగరే?"

"అక్కడివాళ్ళు నిన్నెరుగకపోయినా హలాద్‌పూర్‌నుంచి నీకు తెలిసినవాళ్ళు వచ్చారు?"

"ఎవరు?"

"ఎవరున్నారు? నీ సదాన్నయ్య, ఆ నోటును తిరిగిఇవ్వడానికని వచ్చాడు?"

"నోటు తిరిగి ఇవ్వడానికా?"

"ఊఁ!"

"సదాన్నయ్యేనా?"

అవును, ఆయనే?"

మాలతి మాట్లాడకుండా కూచుంది.

"యేం మాట్లాడవేం?"

"సదాన్నయ్య, యెలా వున్నాడు?"

"బాగానే వున్నాడు. మీ అమ్మకూడా బాగానే వుందట! ఇప్పుడు మునుపటంత బీదతనంలో లేనందున, ఆ డబ్బును

తీసుకోడానికి నిరాకరించింది. సదానందుడు వాళ్ళకు మంచి రోజుల్ని కలుగజేసాడు.''

''నా పేరు లలన అని మీకెవరు చెప్పారు?''

''ఇంకెవరు చెప్తారు, సదానందుడే! నువ్వు చచ్చిపోయావని వాళ్ళంతా అనుకుంటున్నారు!''

మాలతి నిట్టూర్పు విడిచింది.

"నువ్వు బతికే వున్నావని నేను చెప్పాను''

''ఎందుకలా చెప్పారు?''

''అబద్ధమెందుకు చెప్పాలి? నువ్వు బ్రతికే వున్నావాయె· సుఖంగా వున్నావాయె! యేం, సుఖంగా లేవూ?''

''ఊ! ఈ సంగతి సదాన్నయ్యే అడిగాడా?''

''లేదు నేనే చెప్పాను. మీ అమ్మకు చెప్పమనికూడా చెప్పాను.''

''నేనే యీ డబ్బును పంపానని చెప్పారా?''

''అవును''

''నా జీవితాన్నంతా పాడుచేసారు. అసలతను పిచ్చిమనిషి. ఇక ఈ సంగతి ఆ ఊళ్ళో చెప్తూ అదేపనిగా తిరుగుతాడు. వాళ్ళంతా నేను చచ్చిపోయా ననుకుంటున్నప్పుడు, మధ్యలో మీ రెందుకు దూకా....''

''అతను పిచ్చివాడని మీరనుకుంటున్నారు కాని, అతనిలో పిచ్చేమీ లేదు. ఎంత చక్కగా మాట్లాడాడు! ఇంకో సంగతి, నీ చెల్లెలికి పెండ్లయిపోయింది.''

"అయిందా? ఎక్కడ? ఎవరితో?" ఆ కళ్ళల్లో సంతోషం వెల్లివిరిసింది."

"అవూళ్ళోనే! శారదాచరణునితో."

"అతనే పెళ్ళిచేసుకోవాలి. అతను చేసుకుంటాడని నాకు తెలుసు!"

"నీకెలా తెలుసు? ఇదివరకు యీ పెళ్ళిని గురించి మాట లేమన్నా జరిగాయా?"

"ఉహూ! అటువంటి మాటలేమీ జరగలేదు కాని, నేనే ఒక సారి చలనను పెళ్ళి చేసుకోమని ప్రార్థించాను. అప్పుడు తండ్రికి భయపడి చేసుకోలేదు. నేను చచ్చిపోయానని దయతలిచి తరు వాత పెళ్ళి చేసుకున్నా డనుకుంటాను."

"తండ్రికి, భయపడ్డం దేనికి?"

"అతనొక లోభి! కొడుకు పెళ్ళికి కొంత డబ్బు కలిసి రావా లని ఆశ"

"అటువంటప్పుడు అతనేలా రాజీ అవుతాడు. నీ తండ్రే మన్నా డబ్బివ్వగలడా?"

"ఇవ్వగలడు" కొంచెం సేపటివరకూ ఆలోచించి "మరి, మాధవుడెలా వున్నాడు? వాడి సంగతి ఏమన్నా అడిగారా?" అని అడిగింది.

"ఆఁ, అతను బాగానే వున్నాడట?"

"మాలతి నిట్టూర్పు విడిచి, చాలా రాత్రివరకూ మేలుకుని కూచుంది. ఎన్నో విషయాలు ఆమెకు జ్ఞాపకం వచ్చినయ్!

# 30

సదానందుడు తిరిగి వచ్చాడు. దారి పొడుగునా ఏదో ఆలోచిస్తూనే వున్నాడు. త్రోవలో ఎవరైనా "అన్నాయ్, ఎక్కడనుంచి?" అని అడిగితే "ఊ" అని మాత్రం అనేవాడు.

"ఎక్కడికి వెళ్లారు?" అని అడిగితే ఆగి అతని మొహంలోకి చూచి "ఇంటికి వెళ్తున్నాను" అని అనేవాడు. అతను తిన్నగా ఇంటికివచ్చి సుభదకు ఆ నోటును యిచ్చి "సంగతేమీ తేలలేదు" అని చెప్పాడు.

"అయితే, అంతా వ్యర్థమే నన్నమాట"

సదానందుడు ఏమీ మాట్లాడలేదు.

"మరి, యీ పైకాన్ని ఏం చేయాలి?"

"మీ ఇష్టం మీ డబ్బు. మీ కిష్టమైతే యీ డబ్బును బీదవాళ్ళ కెవరికన్నా పంచిపెట్టండి. లేకపోతే వుంచుకోండి;లేకుంటే ఖర్చుపెట్టకుండా అలానే జాగ్రత్తగా వుంచేయండి. ఎప్పుడైన అంతు తెలిస్తే పంపండి. నేనేం చెప్పను"

విసుగెత్తి సుభద వాటిని పెట్టెలోవుంచి తాళం వేసింది.

సదానందుడు "హారాన్‌తాత ఎక్కడి కెళ్ళాడు?" అని అడిగాడు.

"పడుకున్నారు నాయనా!"

"ఎక్కడికీ వెళ్ళలేదా?"

"వెళ్లి, ఇప్పుడే వచ్చారు"

ఆనాటి సాయంకాలం పెద్ద తుఫాను వచ్చింది. సుభద్ర వుద యాన్నేలేచి వంట చేసింది. హారాన్ తిండితిన్నాక డబ్బేమన్నా వుంటే కొద్దిగ ఇస్తావా ?'' అని అడిగాడు.

''ఇవాళ ఇంకెక్కడికీ వెళ్ళకండి. ఆకాశం మేఘాలతో నిండుతుంది. మళ్ళీ వర్షం వస్తుందేమో ఇంట్లోనే కూచోండి.''

''వర్షం వస్తే రానీయ్ !''

''తిరిగి రావడానికి కష్టం కలుగుతుందేమో ?''

''బాగానేవుంది! నాకేం కష్టం? ఇవాళ చాలాపనుంది. వర్షానికి జడిస్తే ఎలా వెళ్ళాలి ?''

ఏ వుద్యోగములేని ఆపనేమిటో సుభద్రకు తెలుసు! ఇవాళ ఏకాదశి. పైగా ముసలమ్మకు వంట్లో యేమీ బాగాలేదు'' అని అన్నది.

హారాన్ ఏమీ వినలేదు. బొడ్లో డబ్బు దాచుకుని, తలమీద గుడ్డవేసుకుని ఆ బురదతో కట్టుకున్న పంచను పైకి యెగదోపు కుని వెళ్ళి పోయాడు.

సుభద్ర నిట్టూర్పు విడిచి ''యేం స్వభావం!'' అని అను కుంది.

ఒకఝాము రాత్రి గడిచాక వర్షం కురవడం మొదలుపెట్టింది. సుభద్రకు ప్రతిరోజూ రాత్రిపూట జ్వరం వస్తూవుంది. కాని, ఆ విషయం రెండోవారి కెవరికీ తెలియనీయలేదు.

వర్షంతోపాటు ఆమెకు చలికూడా వేసింది. చేతికి అందిన దాన్ని తీసుకుని ఆమె కప్పుకుంది.

ఇంకా వర్షం కురుస్తూనేవుంది. జ్వరంతోనూ, చలితోనూ యేమీ తెలియని ఆ స్థితిలో తలుపును తెరవడానికి ఎవరో ప్రయత్నిస్తున్నట్లు ఆమెకు వినిపించింది. కొంచెం సేపట్లోనే, టక టక మని తలుపు తెరిచిన చప్పుడయింది. సన్నని దీపపు వెలుతుర్లో, ఎవరో ఒక మనిషి గదిలోకి రావడం చూసింది. వచ్చిన మనిషి చేతిలో వెదురుకర్ర వుంది. శరీరమంతా సిరాతో పూయబడినట్లు అక్కడక్కడా నల్లని మచ్చలు వున్నాయ్! సుభద భయంతో ''ఎవరు బాబూ నువ్వు?'' అని అరిచింది.

''ఊరుకో!" గంభీరముతో కూడిన ఆ కంఠం సుభదను భయ పెట్టింది.

కర్రను రెండుసార్లు 'టక టక' మని కొడుతూ, మంచం దగ్గరకు వచ్చి ''నీ పెట్టి తాళాలు తే?'' అని అడిగాడు.

ఏదో తెచ్చిపెట్టుకున్నట్లు కంఠం బొంగురుగా, గంభీరంగా వుంది.

సుభద యేమీ మాట్లాడలేదు.

అతను మళ్ళీ ఒకసారి లాఠీని నేలమీద కొట్టి ''తాళం తే: లేకపోతే నీ గొంతు పిసికి చంపేస్తాను తెలుసా?'' అని అన్నాడు.

సుభద లేచి కూచుని, తలగడ క్రిందనుంచి తాళం గుత్తిని తీసి, అతని వద్దకు విసిరివేసి, మెల్ల మెల్లగా ''నా పెద్ద పెట్టెలో కుడిప్రక్కనున్న సొరుగులో యాభై రూపాయల నోటువుంది. అది నువ్వు తీసుకో! ఎడమప్రక్క విశ్వనాధబాబా ప్రసాద ముంది. దానిమీద మాత్రం చేయి వేయకు'' అని చెప్పింది.

ఎప్పుడో ఆ పెట్టె మర్మం తెలిసిన వాడిలా, అతను తాళంతో పెట్టెని తెరిచాడు. ఎడమప్రక్క చేయి పెట్టలేదు. సుభద ఎలా చెప్పిందో సరిగ్గా అదే విధంగా కుడిప్రక్కనున్న అరలోంచి యాభై రూపాయల కాగితాన్ని తీసుకుని, బొడ్లో దోపుకున్నాడు.

అతను వెళ్ళిపోతూన్నపుడు, సుభద నిట్టూర్పు విడిచి, మెల్లగా "నోటుమీద పేరు వ్రాసుంది. నెంబరు కూడా వుండొచ్చు. కొంచెం జాగ్రత్తగా మార్చుకో!" అని మాత్రం సలహా ఇచ్చింది.



208

# శరత్ బాబు రచనలు

## నీలకంఠం అనువాదం

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | భారతి | | 5 | 0 | 0 |
| 2. | గృహదహనం | | 4 | 0 | 0 |
| 3. | శేషప్రశ్న | | 4 | 0 | 0 |
| 4. | సవిత | | 4 | 0 | 0 |
| 5. | భైరవి | | 3 | 0 | 0 |
| 6. | చరిత్రహీనులు | 1 వ భాగము | 2 | 8 | 0 |
| 7. | డిటో | 2 వ భాగము | 2 | 8 | 0 |
| 8. | పల్లీయులు | | 1 | 8 | 0 |
| 9. | సుభద | | 1 | 8 | 0 |
| 10. | విరాజ్ బహూ | | 1 | 8 | 0 |
| 11. | శరత్ కథలు | | 1 | 0 | 0 |
| 12. | బడీబహన్ | | 0 | 12 | 0 |
| 13. | పరిణీత | | 0 | 12 | 0 |
| 14. | అనూరాధ | | 0 | 12 | 0 |

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | UPRO1G7209 | **Date** | 12/04/22 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | CI+207 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared By** | chaya | **Cutting By** | chaya |
| **Scanned By** | Swathi | **Pages** | 213 |
| **Quality Checking** | Ramya | | |